'లోఫర్'తో టాలీవుడ్‌ని పలకరించినా ఆ తరువాత తన దృష్టంతా బాలీవుడ్ మీదే కేంద్రీకరించింది. ఆమె శ్రమ వృథా కాలేదు. హాలీవుడ్ మూవీలో నటించాలన్న కోరిక బాలీవుడ్ హీరోయిన్లందరికీ ఉంటుంది. కొన్ని సంవత్సరాల తరువాత కానీ వారి కల నెరవేరదు. కానీ దిశా పటాని మాత్రం చాలా తక్కువ కాలంలోనే హాలీవుడ్ మూవీలో అవకాశాన్ని దక్కించుకుంది. పైకి సౌమ్యంగా కనిపించినా, తనకు సిగ్గు, స్వార్థం, అన్నిటికి మించి అదృష్టం ఎక్కువ అంటున్న దిశా పటానితో...

# అన్నీ ఎక్కువే

## -దిశా పటాని

### సిగ్గరిని

చిన్నతనం నుంచీ సిగ్గు ఎక్కువ. దీని కారణంగానే నాకు పదహారు సంవత్సరాలు వచ్చే వరకూ స్నేహితులెవరూ ఉండేవారు కాదు. మా అక్కే నాకు బెస్ట్ ఫ్రెండ్. చూడ్డానికి టామ్‌బాయ్‌లా కనిపించేదాన్ని కానీ, ఎవరితోనూ కలిసే దాన్ని కాదు. స్కూల్లో నా ఈడు పిల్లలందరూ వార్షికోత్సవాల సమయంలో స్టేజి మీద డ్యాన్స్ చేసేవారు. నాకు మాత్రం సిగ్గుతో పాటు భయం వేసేది. అసలు అద్దం ముందు నిలుచుని నచ్చిన పాటకు డ్యాన్స్ చేయాలన్నా ఏదోలాగా ఉండేది. అలాంటి దాన్ని సినిమాల్లోకి వస్తానని కలలో కూడా అనుకోలేదు. నా సినీ ప్రవేశం ఓ మిరాకిల్‌లా జరిగిపోయింది.

### అదృష్టం తలుపు తట్టింది

అందాల పోటీల్లో పాల్గొనడానికి ఓసారి ముంబయి వచ్చాను. ఆ పోటీల గురించి ఎలాంటి అవగాహన లేదు. ఆ పోటీలో ఎన్ని రౌండ్లు ఉంటాయో కూడా తెలియదు. కేవలం ముంబయి చూడడం కోసమే వచ్చాను. నా అదృష్టం కొద్దీ ముంబయిలోనే సెటిలైపోయాను. మోడలింగ్ కానీ, సినిమా అవకాశాలు కానీ కష్టపడకుండానే వచ్చాయి. కొందరితో పోల్చుకుంటే నేను చాలా లక్కీ.

### ఇగో పాలు ఎక్కువే!

ఈ సంగతి నాతో పనిచేసే వారికీ, నా స్నేహితులకీ అందరికీ తెలుసు. సెట్లో నా పని ఏంటో చూసుకుంటాను తప్ప పక్కవారి గురించి అస్సలు పట్టించుకోను. నా పార్ట్ అయిపోగానే అక్కడి నుంచి వెళ్ళిపోతానే తప్ప హీరోతోనూ, యూనిట్ సభ్యులతోనూ కబుర్లు చెబుతూ కాలక్షేపం చేయను. ఇప్పుడు హీరోలు హీరోయిన్స్‌నూ, వారి క్యారెక్టర్ గురించి అస్సలు పట్టించుకోరు. మనం ఎందుకు వారిని పట్టించుకోవాలి? వారిలాగే చూడకుండా వెళ్ళిపోవాలి. అప్పుడే మన విలువ వారికి తెలిసి వస్తుంది. ఇలా ఆలోచిస్తాను కనుకే ఎవరితోనూ పెద్దగా కలవలేను.



### సోషల్ మీడియాకు దూరం

చాలామంది హీరోయిన్లు సోషల్ మీడియాలో చాలా యాక్టివ్‌గా ఉంటారు. వారి గురించీ, వారి సినిమాల గురించీ ఎప్పటికప్పుడు అప్‌డేట్ చేస్తుంటారు. నాకెందుకో నా వ్యక్తిగత విషయాలను అలా సోషల్ మీడియా ద్వారా అందరితో పంచుకోవాలని అనిపించదు. కొందరయితే వేసుకునే డ్రెస్సుల గురించి కూడా అడుగుతుంటారు. అలాంటి ప్రశ్నలకు సమాధానాలు ఇవ్వాలంటే ఇబ్బందిగా అనిపిస్తుంది. ఇవన్నీ ఫేస్ చేయలేకే నా వ్యక్తిగత విషయాలేవీ సోషల్ మీడియాలో పోస్ట్ చేయను. ఓ సినిమా ఒప్పుకుంటే ఆ విషయం ప్రకటన ద్వారా అందరికీ తెలిసిపోతుంది. ఆ సినిమా ఎప్పుడు రిలీజవుతుందో కూడా ఎప్పటికప్పుడు ప్రకటనలు వస్తూనే ఉంటాయి. నా అభిమానులకు ఆ సమాచారం తెలిస్తే సరిపోతుందని నా అభిప్రాయం. షూటింగ్‌లో ఏం చేశాను? ఏం తిన్నాను? ఎక్కడ పడుకున్నాను? లాంటివి వారికి అవసరం లేని సంగతులు.

### పుకార్లంటే చిరాకు

నా విషయాలేవీ బయటకు తెలీకుండా ఎంత జాగ్రత్త పడినా నా మీద పుకార్లు ఎందుకు వస్తున్నాయో నాకు అర్థం కాదు. ఒక్కోసారి వాటిని చదువుతుంటే చిరాకుగా అనిపిస్తుంది. కొన్నిసార్లు చాలా నీచంగా రాస్తుంటారు. ఏమీ లేకుండానే ఒక వ్యక్తి మీద అలాంటి పుకార్లు ఎలా పుట్టిస్తారో వారికే తెలియాలి. మొదట్లో వీటిని ఖండించేదాన్ని. కానీ అవి ఆగేటట్టు కనిపించలేదు. అందుకే ఇప్పుడు వాటిని పట్టించుకోవడం మానేశాను.

-కె. రామకృష్ణ

## నవ్య వీక్లీ-ఉపాధ్యాయుల భాస్కరరావు స్మృతిసాహితి సంయుక్త నిర్వహణలో

# కథల పోటీ

| | | |
|---|---|---|
| ప్రథమ బహుమతి | : | రూ. 10,000 |
| ద్వితీయ బహుమతి | : | రూ. 8,000 |
| తృతీయ బహుమతి | : | రూ. 7,000 |
| 7 విశేష బహుమతులు (కథ ఒక్కింటికి) | : | రూ. 5,000 |

### కథ: నిబంధనలు

A కథ తెలుగు వారి జీవితానికి అద్దం పట్టేలా ఉండాలి.

A ప్రపంచంలోని ఏ ప్రాంతమైనా కథకు నేపథ్యం కావచ్చు. అయితే అది తెలుగువారి జీవితానికి సంబంధించినదై ఉండాలి.

A కథలు అరటావు సైజులో **10** పేజీలకు మించకుండా ఒకవైపునే రాసి పంపాలి. దస్తూరి చక్కగా అర్థమయ్యేలా ఉండాలి. డి.టి.పి. చేసిన పక్షంలో అది **6** పేజీలకు మించరాదు.

A కథను పంపేటప్పుడు రచయిత/రచయిత్రి పేరు అందులో ఉండరాదు. పేరు, పూర్తి చిరునామా వేరే కాగితం మీద రాసి జత పరచాలి. అనుకరణ, అనుసరణ కాదని, బ్లాగుల్లోనూ, వెబ్ మాగజైన్స్‌లోనూ రాలేదని హామీ పత్రం విధిగా జత చేయాలి. కవరు మీద 'నవ్యవీక్లీ - ఉపాధ్యాయుల భాస్కరరావు కథల పోటీకి' అని స్పష్టంగా పేర్కొనాలి.

A విదేశాల నుంచి కథలు పంపించే రచయితలు/రచయిత్రులు మాత్రమే ఈ-మెయిల్ **(navyaweekly@andhrajyothy.com)**కి పంపగలరు.

A బహుమతి పొందిన కథలు 'నవ్య' వీక్లీలో ప్రచురితమవుతాయి.

A పోటీ గడువు తేదీని పొడిగించేందుకు కానీ, అర్హమైన రచనలు రాకపోతే బహుమతుల్లో మార్పులు చేసేందుకు కానీ 'నవ్య వీక్లీ' యాజమాన్యానికి సర్వహక్కులూ ఉన్నాయి.

A కథల ఎంపిక విషయంలో తుది నిర్ణయం నవ్య సంపాదక వర్గానిదే! ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలకు కాని, వాద ప్రతివాదాలకు కాని తావు లేదు. ప్రచురణకు అనర్హమైన కథలను తిప్పి పంపడం సాధ్యం కాదు.

M £ ¸$
‡˘ ‡—Ł flŁ
$flØ—Ł *
flŁ¯ —Ł ¯ M ˇ
B {«§ gZ¯
…˝z V
·°ˇs fl . 76,
˘ły fl 70
A Ł –

## కథలు చేరవలసిన ఆఖరు తేది

# 31 జనవరి 2017



## 44

### దడ పుట్టించే ప్రదేశాలు

**ఈ భూగోళంపై ఎన్నో మనోహర ప్రదేశాలూ, వింత ప్రదేశాలూ ఉన్నాయి. అలాగే భయంతో దడపుట్టించే ప్రదేశాలు కూడా ఉన్నాయట! అవేంటో ఒకసారి చదివేసేయండి!!**

## 8

### ఒకరికొకరు! మనకి మనం!

వైకల్యాన్ని అధిగమించి ఆత్మవిశ్వాసంతో, నైపుణ్యంతో అద్భుతాలు సృష్టిస్తున్నారు దివ్యాంగులు. కేవలం వారు గెలుపొందడమే కాదు తమలాంటి వారికి బాసటగా నిలిచేందుకు కృషిచేస్తున్నారు. అలాంటి వారిలో కొందరి గురించి...

## 72

### ఇంటర్వ్యూ

బహుభాషా నటి, నిర్మాత, దర్శకురాలు, నిండైన చీరకట్టులో కనిపించే తెలుగింటి ఆడపడుచు జీవిత. దర్శక నిర్మాతలు కనీస సామాజిక బాధ్యతతో వ్యవహరించాలంటున్న జీవిత ఇంటర్వ్యూ మీకోసం..

## సీరియల్స్


| | |
|---|---|
| వెట్టి | 16 |
| మహానంది | 32 |
| సినీవాలి | 46 |
| సాఫ్ట్‌వేర్‌లో సరిగమలు | 60 |


## కథలు


| | |
|---|---|
| పంజరం | 10 |
| అంతర్వాహిని | 24 |
| పసిడి పరువం | 38 |
| ముకుతాడు | 54 |
| కొట్టుకున్న ప్రాణం | 66 |


## ఫీచర్స్


ఆరోగ్యమే మహాభాగ్యం-14, తీన్‌మార్-15
రివ్యూ-22, సురభి-28
జీవితమే ఒక ప్రతిఘటన-30
పుస్తకసమీక్ష-51, క్రైమ్-52, రిటైర్మెంట్‌పై దిగులొద్దు-58,
వేడుకని ఇలా ఆహ్వానించండి-65
మనమీదేనర్రోయ్-67, సౌభాగ్యచక్రం-68
నవ్యసినిమా-69, ఉన్నమాటంటే ఉలుకెందుకు-70
ఇవన్నీ నిజాలే!, పదగారడి-74


ముఖచిత్రం: హెబ్బాపటేల్
ఫొటో: గోపీకృష్ణ


**రచనలు, కథలు పంపవలసిన చిరునామా**
*నవ్య వీక్లీ, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం.76, అశ్వనీ లేఅవుట్, హుడా హైట్స్, రోడ్ నెం.70, జూబ్లీహిల్స్, హైదరాబాద్-33.* email: navyaweekly@andhrajyothy.com





### టేకిట్ ఈజీ

**బా**ధగా ఉన్నాడతను. భయంగా ఉన్నాడు. ఏడుస్తున్నాడు. బార్‌లో ఒంటరిగా కూర్చుని, గ్లాసులో పోసుకున్న మందుకేసి తాగనా? వద్దా? అని చూస్తున్నాడు. మందుగ్లాసుని అతనలా చూడడాన్ని గమనించాడు పక్క సీటులోని తాగుబోతు. వచ్చి 'హాయ్' అంటూ పలకరించాడతన్ని. పలకరిస్తూనే గ్లాసులోని మందుని ఒకే ఒక్క గుక్కలో తాగేశాడు. అది చూసి మరింతగా గొల్లుమన్నాడతను.

"ఏంవైంది భయ్యా? ఎందుకేడుస్తున్నావు? ఏడ్చేవాళ్ళంటే నాకు అసహ్యం. ఏడవకు. నవ్వు భయ్యా! నవ్వు! నవ్వుతూ బతుకు." అన్నాడు తాగుబోతు.

"ఏంటి నవ్వేది? నా గురించి నీకు తెలీదు. తెలిస్తే ఇలా మాట్లాడవు." అన్నాడతను.

"టేకిట్ ఈజీ భయ్యా."

"ఏంటి టేకిట్ ఈజీ? నా జీవితంలో ఇలాంటి రోజు లేదు. ఈ రోజుని నేను మరచిపోలేను. భరించలేను. పొద్దున ఆఫీసుకి లేటయ్యాను. ఆసరికే మీటింగ్ స్టార్ట్ అయిపోయింది. లేటుగా వచ్చినందుకు బాస్ నోటికొచ్చినట్టుగా తిట్టాడు. సెలవు పెట్టి ఇంటికి పో అన్నాడు. సరేనని సెలవుపెట్టి, ఇంటికి వెళ్ళడానికి కారు కోసం పార్కింగ్ దగ్గరకొస్తే, అక్కడ నా కారు లేదు. ఎవరో దాన్ని దొంగతనం చేశారు. ఇన్స్యూరెన్స్ కూడా లేదు దానికి. క్యాబ్ బుక్ చేసుకుని ఇంటికెళ్ళాను. క్యాబ్ వెళ్ళిన తర్వాత తెలిసింది, అందులో నా పర్సు మరచిపోయానని. జరిగిందేదో జరిగిందని, ఓరవాకిలిగా వేసిన తలుపును తోసుకుని ఇంటిలోనికి వెళ్ళాను. చూస్తే అక్కడ నా ఫ్రెండ్‌తో నా భార్య...ఛి ఛీ! దానిని చూసి తట్టుకోలేకపోయాను. చచ్చిపోదామనిపించింది. విషం కొనుక్కుని, ఇక్కడకి వచ్చాను. మందు ఆర్డర్ చేసి, అందులో విషం కలుపుకుని తాగనా? వద్దా? అని ఆలోచిస్తోంటే దాన్ని నువ్వు తాగేశావు. పైగా నవ్వుతూ బతకాలంటున్నావు. ఎలా చెప్పు?" అడిగాడతను.

### ఏభైశాతం

**"మీ** వర్క్‌లోడ్‌ని ఈ కంప్యూటర్ ఏభైశాతం తగ్గిస్తుంది."

"అవునా? అయితే రెండు కంప్యూటర్లు ఇవ్వండి."

### మొబైల్‌ఫోన్

పెట్రోల్‌బంక్‌కి వెళ్లాడతను. అక్కడ బోర్డు మీద ఇలా రాసి ఉంది.

ఇక్కడ మొబైల్‌ఫోన్లలో మాట్లాడరాదు.

ముందే చెప్పి రక్షించారనుకున్నాడతను. వెంటనే జేబులోని మొబైల్‌ఫోన్ తీసి, తాను పెట్రోల్‌బంక్‌లో ఉన్నాననీ, ఫోన్ చెయ్యవద్దంటూ పేరు పేరునా అందరికీ ఫోన్లు చేయసాగాడు.

**-వైనతేయ**

www.navyaweekly.com

పుస్తక పఠనం ఎంతటి బాధనయినా మరపిస్తుంది.

నవ్య

సంపుటి: 13 సంచిక: 43

28-12-2016



మేనేజింగ్ డైరెక్టర్
వేమూరి రాధాకృష్ణ

ఎడిటర్
ఎ.ఎన్.జగన్నాథశర్మ

మొదటి పేజి

# మంచిమనసు

మంచి లేదు, మానవత్వం లేదు, జాలి, దయ, సానుభూతి కరువైపోయాయి. పట్టించుకోనితనం పెరిగిపోయింది. ఎవడెలా పోతే నాకేంటి? నేను బాగున్నాను కదా అన్న ధోరణిలో ఉన్నారంతా. నోట్లరద్దుతో సిటీలో చదువుకుంటున్న బాబుకి హాస్టల్లో ఇబ్బంది ఎదురైంది. క్యాషే కావాలంటున్నాడు హాస్టల్ మేనేజర్. బాబు దగ్గరేమో డబ్బు లేదు. ఎలా డాడీ? అని ఫోన్ చేశాడు. ఏం పర్వాలేదు, సుధీర్ అంకుల్ ఉన్నాడుగా! వాడికి ఫోన్ చేసి చెబుతాను, చూసుకుంటాడు అన్నాడు. సుధీర్‌కి ఫోన్ చేశాడు. బాబు సంగతి చెప్పాడు. నేను చూసుకుంటాను, నాకొదిలేయ్ అన్నాడు సుధీర్. అన్నాడేగాని చూసుకోలేదు. వెళ్లి బాబుని కలవనే లేదు. ఫోన్ చేసి చెప్పాడు బాబు. కంగారుపడ్డాడు. అయిదువేల రూపాయలు! ఆఫ్టరాల్ ఫైవ్ థౌజండ్ రుపీస్ అందుబాటులో లేవు. సుధీర్‌కి నాలుగైదుసార్లు ఫోన్ చేశాడు. రింగ్ అవుతోందిగాని, వాడు లిఫ్ట్ చెయ్యట్లేదు. తప్పదనుకున్నాడు. డబ్బు తీసుకుని, తానే సిటీకి కార్లో బయల్దేరాడతను.

దారిలో వేడిగా టీ తాగాలనిపించింది. కారాపాడతను. రోడ్డు పక్క టీ దుకాణం. వేడివేడిగా టీ అందజేస్తున్నాడు దుకాణ్‌దార్. టీ చెప్పి తాగాడు. బాగుంది టీ. ఎంతంటే ఆరు రూపాయలు అన్నాడు. పదిరూపాయలనోటిచ్చి, చిల్లర ఉంచుకోమన్నట్టుగా ముందుకు నడిచాడతను. పిలిచి మరీ అతని చేతిలో నాలుగురూపాయలు పెట్టాడు దుకాణ్‌దార్. ఇప్పుడీరోజులన్నీ చిల్లర మాలచ్మివే! మరిచిపోకండి అని నవ్వాడు. నాలుగు రూపాయి నాణెల్ని ఎగరేసి పట్టుకుంటూ కారు దగ్గరగా వచ్చాడతను. కారుని ఆనుకుని సిగరెట్ ముట్టించాడు. రెండు దమ్ములు లాగి రిలాక్సయ్యాడు. అప్పుడు చూశాడు అక్కడి స్తంభానికి అంటించి ఉన్న కాగితాన్ని. గాలికి రెపరెపలాడుతోందది. వెళ్లి దాని మీద రాసి ఉన్నది చదివాడు.



ఇక్కడ నా యాభైరూపాయల నోటును నేను పోగొట్టుకున్నాను! దొరికితే దయచేసి ఈ కింది అడ్రస్‌కు అందజేయగలరు.

నవ్వు వచ్చిందతనికి. నవ్వుతూ కారు స్టార్ట్ చేశాడు. కాగితంలో ఉన్న అడ్రస్‌కి బయల్దేరాడు. రెండు మూడు మలుపులు తిరిగి చేరుకున్నాడక్కడికి. చిన్న పూరిల్లు. చెప్పాలంటే గుడిసెలా ఉంది. ఆ గుడిసెలో మంచం మీద ఓ ముసలామె కూర్చుని ఉంది. దగ్గుతూ ఉంది. పాపం! పోగొట్టుకున్న యాభైరూపాయలు ఈ ముసలామెకు ఎంత అవసరమో అనుకున్నాడతను. జేబులోంచి యాభైనోటు తీసి, ఆమెకిచ్చాడు. అమ్మా! నువ్వు టీ దుకాణం దగ్గర పోగొట్టుకున్న యాభైనోటిది. నాకు దొరికిందని చెప్పాడు. నవ్విందామె. నవ్వుతోంటే దగ్గు తోసుకొచ్చిందామెకు. దగ్గి దగ్గి కాసేపటికి తేరుకుంది. నువ్వు నలభై అయిదోవాడివి. పొద్దున నుంచీ నా దగ్గరకి నలభై అయిదుమంది వచ్చారు. వచ్చిన ప్రతివ్యక్తీ యాభైనోటిచ్చి, ఇదే మాట చెబుతున్నారు. పైగా నా నోటు పోయిందని నేనక్కడ రాసిపెట్టానంటున్నారు. రాసిపెట్టిన కాగితాన్ని స్తంభానికి అంటించానంటున్నారు. అది ఎలా సాధ్యం? అన్నది ముసలామె. అతను ఆశ్చర్యపోయాడు.

నాకు చదువురాదు. నేను రాయలేను. ఒంటరిదాన్ని. పైగా గుడ్డిదాన్ని. ఇక్కణ్ణుంచి కదల్లేను. నా దీనస్థితి చూసి ఏ అయ్య కన్నీరు పెట్టుకున్నాడో, కరుణించి అలా రాసి పెట్టాడక్కడ. మీరంతా దయతలచి దానం చేస్తున్నారు. దండాలయ్యా అన్నది ముసలామె. అతడు ఇచ్చిన యాభైనోటుని మంచం కింది బొంత మడతల్లో దాచుకుంది. బొంత మడతల్లో యాభైనోట్లు చాలా ఉండడాన్ని గమనించాడతను. వెనుతిరిగాడు. లోకంలో మంచితనం, మానవత్వం లేకుండాపోలేదు. ఉన్నాయి. జాలి, దయ, సానుభూతి కూడా ఉన్నాయనుకున్నాడతను. సన్నగా నవ్వుకుంటూ రాసాగాడు. యాభైనోటుసార్! ఎవరో పోగొట్టుకున్నారక్కడ! నాకు దొరికింది. ఈ అడ్రస్ ఎక్కడో కొంచెం చెబుతారా? ఎదురుపడి ఎవరో అడిగారు. ముందుకెళ్లండన్నట్టుగా చేయి చూపించాడతను. అంతలో బాబు దగ్గర నుంచి ఫోన్! సుధీరంకుల్ కలిశాట్ట! హాస్టల్ మేనేజర్‌తో మాట్లాడాట్ట! ఇబ్బంది ఏమీ లేదట! వస్తోంటే సుధీరంకుల్‌కి చిన్న యాక్సిడెంట్ జరిగిందట! ఆ యాక్సిడెంట్‌లో అంకుల్ సెల్‌ఫోన్ కూడా పాడైందంటూ ఏంటేంటో చెబుతున్నాడు బాబు. అతని కళ్ళు చెమర్చాయి.




## అద్దెకు స్నేహితులు

స్నేహితులను అద్దెకు ఇవ్వడం ఏమిటి? అనుకుంటున్నారు కదూ! నిజమేనండీ... ఫ్రెండ్స్‌ని అద్దెకిస్తామంటూ వెబ్‌సైట్లు వచ్చేశాయి. దేశ రాజధానిలో ఈ ట్రెండ్ బాగా నడుస్తోంది. ఖాళీగా, మూడీగా, బోర్‌గా ఫీలయ్యేవారు ఈ వెబ్‌సైట్ల ద్వారా కొత్త స్నేహితులను సంపాదించుకోవచ్చు.

రెంట్‌ఏ ఫ్రెండ్.కామ్, రెంట్‌ఏలోకల్‌ఫ్రెండ్.కామ్ వెబ్‌సైట్లు స్నేహితులను అద్దెకు పంపిస్తున్నాయి. అమ్మాయయినా, అబ్బాయయినా ఈ వెబ్‌సైట్ల ద్వారా రిజిస్టర్ అయి కొత్త స్నేహితులను కలుసుకుంటున్నారు. ఒక్క కాఫీకే పరిమితం కాకుండా సినిమా, డిన్నర్ విత్ పేరెంట్స్ ఇలా చాలా రకాల సర్వీసులు అందిస్తున్నాయి ఈ వెబ్‌సైట్లు. సర్వీసును బట్టే చెల్లించాల్సిన అద్దె కూడా ఉంటుంది.

ప్రస్తుతం ఒక గంటసేపు కాఫీకి సమయాన్ని వెచ్చిస్తే 600 చెల్లించాల్సి వస్తోంది. ఈ కల్చర్‌పై ఆయా వెబ్‌సైట్ల ప్రతినిధులను సంప్రదించగా మోసాలకు అవకాశం లేకుండా కేవలం చెప్పిన సమయానికి మాత్రమే అద్దెకు స్నేహితులను కలిసే అవకాశం ఉంటుందని చెప్పారు. ఇందుకోసం వినియోగదారులు మొదట వెయ్యి నుంచి పదిహేను వందలు మెంబర్‌షిప్ కింద చెల్లించాల్సి ఉంటుంది. ఆ తర్వాతే వారి సేవలను వినియోగించుకోవచ్చు. అయితే కేవలం ఎంత సమయం, ఎక్కడ అనే వివరాలు మాత్రమే తీసుకుంటున్నామని, ఇతర వ్యక్తిగత వివరాల జోలికి వెళ్ళడం లేదని వెబ్‌సైట్ నిర్వాహకులు చెబుతున్నారు.



ఫేస్‌బుక్‌లో కూడా 'మీట్ ఫ్రెండ్స్', 'లవ్ ఆన్ ఫైర్', 'బీఎఫ్ఫ్ ఆన్ ఎన్నీఆర్' వంటి పేజీలు గంటల బేసిస్ మీద ఫ్రెండ్స్, లవర్స్‌ను అద్దెకు ఇస్తున్నాయి. వీటిలో 'లవ్ ఆన్ ఫైర్' అనే ఫేస్‌బుక్ పేజీని కొన్ని వేలమందికి పైగా ఫాలో అవుతున్నారు. కొత్త వ్యక్తుల పరిచయంతోపాటు వారితో మీటింగ్ ఎలా ఉంటుందోనన్న ఉత్కంఠ వల్ల కూడా ఈ కల్చర్‌ని ఫాలో అవుతున్నారు. యూత్‌లో ప్రస్తుతం పెరుగుతున్న ఈ కల్చర్ వారి స్వభావాలకు అద్దం పడుతోందని నిపుణులు అంటున్నారు. ఈ కల్చర్ వల్ల తమ సోల్‌మేట్‌ని కూడా నిర్ణయించుకోగలుగుతున్నారట. కల్చర్ పేరిట అనుసరిస్తున్న ఈ పద్ధతి వల్ల 'ఆపదల్లో ఆదుకునేవాడే నిజమైన స్నేహితుడు' అనే నానుడికి అర్థం లేనట్టే అని వాపోతున్నారు పెద్దలు.

# మెయిల్ బాక్స్

### నవ్య నవపథంలో సాగిపోతోంది

మతిమరుపుకు చెక్ పెట్టడానికి మీరిచ్చిన సూచనలు తప్పక పాటించదగినవి. ఉపయుక్తంగా ఉన్నాయి. "వింతవింతపూలు, అందమైన రూపాలు" వ్యాసం, ఫోటోలు అలరించాయి. లిప్‌స్టిక్ రాసున్న పెదవుల మాదిరి ఉన్న పూలు మరీ మరీ బాగున్నాయి. ప్రకృతిలో ఎన్ని వింతలో కదా? సీరియల్స్ అన్నీ అలరిస్తూ చకచకా సాగిపోతున్నాయి. కథల్లో శరత్‌చంద్ర తీర్పు బాగుంది. మంచి సీరియల్స్, అంతకు మించిన కథలు, ఉపయుక్త వ్యాసాలు, సినీ గాసిప్స్‌తో నవ్య ఎప్పుడూ నవనవోన్మేషంగా నిత్యనూతనంగా నవపథంలో సాగిపోతూనే ఉంది. కీప్ ఇట్ అప్!

*-లక్ష్మి, బృందావనం, తూర్పుగోదావరి జిల్లా*

### గుట్టు రట్టు చేస్తున్నాయి

సినీవాలి రచయితకు సినిమా రంగం ఆనుపానులన్నీ బాగా తెలిసినట్టుంది. ఆడిషన్ పేరు చెప్పి జరిగే అకృత్యాలు, రాజీపడడాలు, కథా చౌర్యాలు, దగాలు, మోసాలు చిత్రరంగం గుట్టు రట్టు చేస్తున్నాయి. "రాశి"పెట్టిన దాంపత్యాలు, రాశిపొంతనలు వివరించడం ఉపయుక్తంగా ఉన్నాయి. చీమలే మన తొలిరైతులు అంటూ చెప్పినవి ఆకట్టుకున్నాయి. చంద్రునిపై జావెలిన్ త్రో, గోల్ఫ్ మాత్రమే ఆడగలం అనడం నిజంగా నమ్మలేని నిజమే! అరవింద స్వామికి హేమచంద్ర గొంతు అరువివ్వడం కాదు అద్దెకిచ్చాడు.! ఫీజు వసూలు చేశాడు కదా!

*-గున్నేశ్, కొవ్వాడ, తూర్పుగోదావరి జిల్లా*

### సీరియల్స్ బాగున్నాయి

సీరియల్స్ అద్భుతంగా ఉన్నాయి. ప్రత్యేకించి మహానంది సీరియల్ చదువుతుంటే ఒక జానపద కథ చూస్తున్నంత అనుభూతి కలుగుతోంది. కథలన్నీ వేటికవే సాటి. ఒళ్ళంతా థ్రిల్లింతతో తాంబూల రాగ రంజితం చేసుకున్న రాధాగోపీల కథ బాగుంది. శంకరాభరణంతో ఊపిరిపోసుకున్న మంజుభార్గవి ఇంటర్వ్యూ హైలైట్.

*-మంగళంపల్లి సత్యనారాయణమూర్తి, విజయవాడ*

### నిత్యనూతనం 'నవ్య' సంచికలు

మన శరీరాన్ని నిత్యం ఆరోగ్యంగా ఉంచడంలో అల్లం, ఉల్లి, వెల్లుల్లి ఏవిధంగా సహకరిస్తుందో చక్కటి వివరణలు ఇచ్చారు వివేక్. మంచి ఆరోగ్యం కొరకు ఉత్తమ ఆహారపు విలువలు, అలవాట్లు సూచిస్తూ, చలికాలంలో అదనపు జాగ్రత్తలు అనుసరించతగినవి, నూతన జంటలకి ప్రత్యేక పాఠంగా సెక్సాలజిస్టులు సూచించిన ఆరోగ్యవంతమైన మిత శృంగారపు లెక్కలు గమనించతగినవి. పెద్దనోట్ల రద్దుకు ముందు జనం చిన్న సర్దుబాట్లకి అవకాశం ఇవ్వవలసింది అన్న రివ్యూ విశ్లేషణ బాగున్నది. దేశంలో బడాబాబులు నుంచి వేల కోట్ల రూపాయలు చెల్లింపులు కొరకు చక్రం తిప్పవలసిన తరుణం వచ్చింది. సోమసుందర్ లిటరరీ ట్రస్ట్ వారు కథాప్రక్రియకుగానూ, ఉత్తమ సంపాదకునిగా అవార్డు అందుకున్న ఎ.ఎన్.జగన్నాథ శర్మ గారికి అభినందనలు. కథాసాహిత్యంలో దశాబ్దాల కాలంగా ఉన్నత విలువల కోసం వారి తపనకి నిదర్శనం నవ్య వీక్లీలో వైవిధ్యమైన సామాజిక సేవ. నేటి జనరంజకమైన కళాభిమానానికి ఉదాహరణ. ఎందరో మహానుభావుల్ని జ్ఞప్తికి తేవడం, వర్ధమాన నటులు కోట, ఎమ్మెస్ వంటి వారి జీవిత కథనాలు, తారలతో ఇంటర్వ్యూలు చిత్రాలు, వారి సంక్షిప్త వార్తాకథనాలతో నిత్యనూతనంగా వెలుగు నింపుతున్నవి నవ్యసంచికలు.

*-తాళాబత్తుల సత్యనారాయణ మూర్తి, విశాఖపట్నం.*

### కోట జీవిత విశేషాలు బాగున్నాయి

డాక్టర్ చల్లా భాగ్యలక్ష్మిగారి సీరియల్ 'జీవితమే ఒక ప్రతిఘటన' మొదటి నుంచీ చదువుతున్నాను. చాలా ఆసక్తికరమైన తన సినీ జీవిత విశేషాలను పొల్లుపోకుండా కోట్ఠశ్రీనివాసరావుగారిచేత చక్కగా చెప్పిస్తున్నారు. ఒకవైపు బ్యాంకు



**జీవితమే ఒక ప్రతిఘటన**

(కోట శ్రీనివాసరావు కథాకథనం)

ఉద్యోగం, మరోవైపు సినిమా అవకాశాలతో కోట ఎటూ తేల్చుకోలేని పరిస్థితిని పూసగుచ్చినట్టు వివరిస్తున్న తీరు బాగుంది. సినిమా వేషాల కోసం ఆరాటపడే నేటి యువతీ యువకులకు ఆయన అనుభవాలు ఎంతగానో తోడ్పడతాయి.

విమానాశ్రయంలో అనుకోకుండా రామానాయుడుగారిని కోట కలవడం, ఆయన ద్వారా 'అహ నా పెళ్ళంట..!' సినిమాలో మంచి వేషం దొరకటం గురించి ఆయన వివరించిన విధానం బాగుంది. ఆ సినిమా చూసే అదృష్టం అప్పట్లో మాకు కలిగింది. బాగా ఎంజాయ్ చేశాం. ఈ వారం సరసిగారి ప్రత్యేక కార్టూన్‌తోపాటు ఇతర కార్టూన్లు కూడా సూపర్‌గా ఉన్నాయి.

*-శ్రీమతి దుగ్గరాజు లక్ష్మీపద్మజ, డి.డి.కాలనీ, హైదరాబాద్*

### జీవితమే ఒక ప్రతిఘటన ఆసక్తికరం

డాక్టర్ చల్లా భాగ్యలక్ష్మి రాస్తున్న 'జీవితమే ఒక ప్రతిఘటన' ఆసక్తికరంగా ఉంటోంది. కోట శ్రీనివాసరావుగారి జీవిత విశేషాలను చాలా చక్కగా అందిస్తున్నారు. రావుగోపాలరావు పాత్ర తన ఒడిలో పడడం కోట చేసుకున్న పుణ్యఫలం అనేచెప్పాలి. ప్రతిఘటన, మండలాధీశుడు ఆయన భవిష్యత్తుకు పునాది వేస్తే 'అహ నా పెళ్ళంట" ఆయన్ని ఎక్క డికో తీసుకుపోయింది. రచయిత్రికి అభినందనలు. ఈవారం కథలు, సీరియల్స్, ఆర్టికల్స్ అన్నీ అలరించాయి.

*-రమాకాంత్, విజయవాడ*

# సుఖవ్యాధులుంటే సుఖమెక్కడిది?

**హెచ్ఐవి :** చికిత్స లేని వ్యాధిగా హెచ్ఐవికి పేరుంది. నిజానికి హోమియోలో హెచ్ఐవి వైరస్‌ను కట్టడి చేసే మందులు ఉన్నాయి. హెచ్ఐవి ఎక్కువ విస్తరిస్తుండటానికి కారణం దీని లక్షణాలు కొన్ని ఏళ్ల తరువాత బయటపడటమే. రోగనిరోధక శక్తి తగ్గినపుడు వ్యాధి లక్షణాలు బయటపడతాయి. విరేచనాలు, బరువు తగ్గడం, అవకాశవాద వ్యాధులు విజృంభించడం, త్వరగా వ్యాధులు రావడం జరుగుతుంది.

**గనేరియా :** మూత్రంలో మంట, మూత్రనాళం దగ్గర దురద, జిగురుగా ద్రవం కారడం వంటి లక్షణాలు కనిపిస్తాయి. ఒక్కొక్కసారి రక్తపరీక్షలో గనేరియా బయటపడకపోవచ్చు. కానీ మూత్రనాళంలో బాధ, మూత్రంలో మంట ఉంటుంది. కొందరిలో పొత్తికడుపు నొప్పి, వీర్యంలో మంట, రక్తం రావడం కనిపిస్తాయి.

**వెనీరియల్ వార్ట్స్:** పురుషాంగం మీద చిన్న క్యాలిఫ్లవర్ తరహాలో పులిపిరులు వస్తాయి. ఇవి గుత్తులు గుత్తులుగా తయారవుతాయి.

**షాంకరాయిడ్ పుళ్లు:** ఇది కూడా లైంగిక వ్యాధే. లైంగిక సంపర్కం తర్వాత 3 నుంచి 5 రోజులలో ఈ వ్యాధి బయటపడుతుంది. జననాంగం మీద రెండు, మూడు పుళ్లు ఏర్పడతాయి. ఇది మొదట చిన్న నీటి బుడగలాగా వచ్చి చీము ఏర్పడి పగులుతుంది. పుండు ఎర్రగా మారి నొప్పి వస్తుంది.

**హోమియో చికిత్స :** రోగనిరోధక శక్తి బలపడటం ద్వారా హెచ్ఐవి రోగుల్లో అవకాశ వాద వ్యాధులన్నీ దూరమ వుతాయి. వైరల్‌లోడ్ బాగా తగ్గిపోతుంది. గనేరియా, వెనీరియల్ వార్ట్స్, షాంకరా యిడ్ పుళ్లు కూడా హోమియో మందులతో సమూలంగా దూర మవుతాయి.

# హెపటైటిస్, హెర్పిస్ ఇలా పోతాయి

**హెపటైటిస్** వైరస్ ఎప్పుడైతే కాలేయంపై దాడి చేస్తుందో అప్పుడు లక్షణాలు బయటపడతాయి. అంతవరకు ఇది సోకిన విషయం తెలియదు. హెపటైటిస్ వైరస్ శరీరంలోకి ప్రవేశించిన వెంటనే లక్షణాలు బయటపడవు. రోగలక్షణాలు కనిపించడానికి చాలా ఏళ్లు పడుతుంది. కొంతమందిలో వైరస్ సోకిన 4 వారాలు లేదా 12 వారాల తరువాత కొన్ని రోగలక్షణాలు బయటపడతాయి. ఆకలి తగ్గిపోవడం, వాంతులు, మూత్రం పచ్చగా రావడం, కళ్లు పసుపుపచ్చగా మారడం, జ్వరం, ఒళ్లు నొప్పులు అధికంగా ఉండటం వంటి లక్షణాలు కనిపిస్తాయి. వ్యాధి నిర్ధారణ కోసం హెపటైటిస్-బి(హెచ్‌బిఎస్ ఏజి) పరీక్ష చేయించాలి. హెపటైటిస్-బి ఉన్న కొందరిలో లివర్ ఫెయిల్యూర్‌కు దారితీస్తుంది. కొన్ని ఏళ్ల నుంచి వైరస్ ఉన్నవారిలో కాలేయం క్రమంగా దెబ్బతింటూ లివర్ సిర్రోసిస్‌కు దారితీయవచ్చు లేక లివర్ క్యాన్సర్‌గా మారవచ్చు.

**హెర్పిస్ సింప్లెక్స్ :** పురుషాంగంపైన చెమట పొక్కుల మాదిరిగా నీటి పొక్కులు కనిపిస్తాయి. నీటిపొక్కులు ఎర్రగా ఉండి దురద ఉంటుంది. నీటిపొక్కులు పగిలిపుండు పడుతుంది. ఈసమయంలో చికిత్స తీసుకోకపోతే ఇతరులకు సోకే ప్రమాదం ఉంది. లైంగిక కలయిక ద్వారా సంక్రమించే ఈ వ్యాధిని హెర్పిస్ అని అంటారు. స్త్రీలలో కూడా యోని మీద చిన్న చిన్న పొక్కులలాగా వచ్చి ఎర్రగా మారి నొప్పిని కలిగిస్తాయి.

**హోమియో చికిత్స :** హెపటైటిస్ బి, సి వ్యాధులను సమర్థవంతంగా అడ్డుకునే చికిత్స హోమియోలో ఉంది. వైరల్‌లోడ్‌ను పూర్తిగా తగ్గించడం ద్వారా ఆరోగ్యవంతమైన జీవనం గడిపే అవకాశం దక్కుతుంది.

**Dr. K Ravikirane**
M.D.,M.sc(psych), P.G(virology)LONDON
గోల్డ్‌మెడల్ ఫర్ ఎక్సలెన్సీ ఇన్ మెడిసిన్
మాస్టర్స్ హోమియోపతి
అమీర్‌పేట్, కూకట్‌పల్లి, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్,
విజయవాడ, కరీంనగర్, విశాఖపట్నం,తిరుపతి
ఫోన్ : 7842 106 106, 9032 106 106
V6లో ప్రతి మంగళవారం మధ్యాహ్నం 2:30కి
సాక్షిలో ప్రతి శనివారం మధ్యాహ్నం 2:30కి
10టీవీలో ప్రతి ఆదివారం మధ్యాహ్నం 3:30కి డాక్టర్‌గారి లైవ్ కార్యక్రమం ఉంటుంది.



# నొప్పులుంటే జీవితం నరకమేగా?

**మానవుని** శరీరంలో సుమారు ఆరువందల యాభై కండరాలు ఉంటాయి. ఇవి శరీర బరువులో సగభాగం ఉంటాయి. కండరాలు కట్టలుగా కట్టబడిన కొన్ని పీచునారలు(ఫైబర్)కలిగి ఉంటాయి. వీటివలన కండరాలకు కుదించుకుపోవడం, మళ్లీ తరువాత తమ పూర్వస్థితికి వచ్చే సామర్థ్యం ఉంటుంది. కండరాలు ఎముకలకు టెండాన్స్‌లో కలపబడతాయి. కండరాలు శ్రమించినపుడు లాక్టిక్ యాసిడ్ అనే రసాయనాన్ని విడుదల చేస్తాయి. ఈ రసాయనం వలన కండరాలు తొందరగా అలసటకు లోనవుతాయి. కండరాల నొప్పి సాధారణమైన సమస్య. ఈ నొప్పి లిగమెంట్స్, టెండాన్స్ ఎముకలు లేదా శరీరఅవయవాల వలన కూడా రావచ్చు.

**కారణాలు :** గాయాలు, కండరాలుపై ఎక్కువ ఒత్తిడి పడటం, వ్యాయామం, శారీరక శ్రమ అధికంగా ఉండటం, శరీరంలో పొటాషియం, కాల్షియం మోతాదు తగ్గడం, ఏసీఈ ఇన్‌హిబిటర్స్, బి.పి మందులు, కొకైన్, స్టాటిన్స్ అంటే శరీరంలో కొవ్వుని తగ్గించే మందులు వాడటం వలన రావచ్చు. ఇన్‌ఫ్లుయెంజా, మలేరియా, కండరాలపై గడ్డలు, పోలియో వంటి ఇన్‌ఫెక్షన్ల వల్ల రావచ్చు. ఫైబ్రోమయాల్జియా, డెర్మటోమైటోసిస్ వంటి వ్యాధుల వల్ల వచ్చే అవకాశం ఉంది.

**లక్షణాలు :** కండరాల వాపు, నొప్పి, తొందరగా అలసిపోవడం, నిద్రలేమి, తలనొప్పి, ఇతర ఇన్‌ఫెక్షన్ల వల్ల వచ్చినపుడు జ్వరం, దగ్గు, తలనొప్పి, ఆకలి మందగించడం, శరీరం సన్నబడటం వంటి లక్షణాలుంటాయి. కదలికలు కష్టంగా మారతాయి.

**హోమియో వైద్యం :** నొప్పి నివారణ మాత్రలు వేసుకోవడం వల్ల తాత్కాలిక ఉపశమనం ఉంటుందే తప్ప శాశ్వత పరిష్కారం లభించదు. హోమియో చికిత్స మూల కారణాన్ని తొలగిస్తుంది. కండరాల నొప్పులు శాశ్వతంగా తగ్గిపోతాయి.

# సంతానం కలగదని ఎవరన్నారు?

**సంతానం** కలిగినప్పుడే జీవితం పరిపూర్ణం అయిన భావన కలుగుతుంది. వాళ్ల ఆలనాపాలనా చూసుకోవడంలో తల్లిదండ్రులు ఎంతో సంతోషాన్ని పొందుతారు. కానీ ఏవో కారణాల చేత సంతానం కలగకపోతే..ఆ బాధ వర్ణనాతీతం. ఎన్ని ఆసుపత్రులు తిరిగినా, ఎన్ని మందులు వాడినా ఫలితం లేకపోవడంతో ఇక తమకు జీవితంలో పిల్లలు కలగరని నిర్ణయానికొస్తారు. అయితే హోమియో మందులు ఎలాంటి సంతానలేమి కారణాలైనా సరిచేసి పిల్లలు కలిగేలా చేయడంలో తోడ్పడతాయి.

**కారణాలు ఇవి కావచ్చు :** వీర్యకణాలు తక్కువగా ఉంటే సంతానం కలిగే అవకాశాలు తక్కువగా ఉంటాయి. వేరికోసిల్, హైడ్రోసిల్, మూత్ర సంబంధ వ్యాధులు, సుఖ వ్యాధుల వల్ల కూడా వీర్యకణాలు నశించి సంతానలేమికి కారణమవుతూ ఉంటాయి. దీర్ఘకాలంగా షుగర్ వ్యాధి ఉండటం, అధిక బరువు, వృషణాలకు దెబ్బలు తగలడం, ప్రమాదాల్లో వెన్నుకు గాయాలవడం, హార్మోన్ల అసమతుల్యత, క్రోమోజోముల లోపాలు, విపరీతంగా స్మోకింగ్ చేయడం వంటివి కూడా పురుషుల్లో సంతానలేమికి కారణమవుతుంటాయి. బిగుతైన దుస్తులు ధరించడం, ప్రతిరోజు వేడి నీళ్లతో స్నానం చేయడంవంటివి కూడా సంతానలేమికి కారణమవుతాయి.

**హోమియో చికిత్స :** సంతానలేమికి కచ్చితమైన కారణం తెలుసుకుని చికిత్స అందిస్తే సంతానసాఫల్యం తప్పక కలుగుతుంది. వీర్యకణాల లోపం ఉంటే హోమియో మందులు తీసుకోవడం ద్వారా వీర్యపుష్టి కలుగుతుంది. వీర్యకణాల కదలికలు పెరుగుతాయి. శారీరక ధర్మాలను, మానసిక లక్షణాలను పరిగణలోకి తీసుకుని మందులను అందించడం ద్వారా మంచి ఫలితం లభిస్తుంది. హార్మోన్ల సమస్యలు సైతం హోమియో చికిత్సతో తొలగిపోతాయి. అంగస్తంభనలు లేకపోవడం వంటి సమస్యను హోమియో మందులు దూరం చేస్తాయి. మొత్తంగా సంతానలేమి కారణాలన్నీ దూరమయిపోయి సంతానం సిద్ధిస్తుంది.

ADVT



# ఒకరికొకరు! మనకి మనం!

**కాలివేలుతో పెన్నుపట్టి చకచకా పరీక్షలు రాసేవారు కొందరు, నోటితో కుంచె పట్టుకుని తైలవర్ణ చిత్రాలు గీసేవారు మరికొందరు, ఒంటికాలితో పరుగుదీస్తూ అందరితో పోటీపడేవారు ఇంకొందరు... ఇలాంటివారు ఆత్మవిశ్వాసానికి ప్రతీకలుగా కనిపిస్తారు. బండరాతిని చీల్చుకుని ఎదిగిన మొక్కల్లా స్ఫూర్తినిస్తారు.**

**వైకల్యాన్ని అధిగమించి ఆత్మవిశ్వాసంతో గొప్ప నైపుణ్యంతో అద్భుతాలు సృష్టించే వీరిని వికలాంగులు అనడం అగౌరవం. దివ్యాంగులు అనడమే గౌరవ సంబోధన.**

పొందికైన దేహం, ఆరోగ్యం అన్నీ ఉన్నప్పటికీ, 'నేనెందుకూ పనికిరాను' అని ఫీలయ్యేవారు మనలో ఎందరో! గొప్ప అవకాశాలుండీ తమలోని టాలెంట్ గుర్తించలేక మనోవైకల్యంతో జీవితాన్ని వృధాచేసుకుంటారు కొందరు. ఇలాంటివారికి దివ్యాంగుల జీవితమే ఆదర్శం.

తల్లిదండ్రులు లేదా ఎవరో ఒకరి సహాయం లేకుండా జీవించే దివ్యాంగులు 30 శాతానికి పైగా ఉన్నారు. వారిలో శక్తిసామర్థ్యాలకు లోటులేదు కానీ వారిని పట్టించుకునే నాథుడే ఉండడు. ఐనవారే చులకనగా చూస్తూ, నిర్లక్ష్యంచేస్తుంటే టాలెంట్ ఉన్నా గుర్తింపు లేక జీవచ్ఛవాల్లా బతికేవారెందరో.

శారీరకంగానే కాదు. మానసికంగా కూడా ఇలాంటి వాళ్లు చేయూతలేక అసహాయులుగా మిగిలి పోతున్నారు. వారికి చేయూతనిచ్చి, మార్పు తెచ్చేందుకు చిత్తశుద్ధితో అంకితమై కృషి చేస్తున్న దివ్యాంగుల గురించి, టాలెంటెడ్ దివ్యాంగుల గురించి చదవండి.

## దివ్యాంగులకు పెళ్లి యాప్

*పెళ్లంటే ఎన్నో ఆలోచిస్తాం. అందం, ఆరోగ్యం, ఐశ్వర్యం ఉన్నవారికే ఇవాళరేపు పెళ్లిళ్లు జరగడం కష్టంగా ఉంది. మరి దివ్యాంగుల పరిస్థితేంటి? దీనికి ఓ పరిష్కారాన్ని కనుక్కుంది ఓ అమ్మాయి. ఆమె పేరు కల్యాణిఖోన. మన దేశంలో దాదాపు ఎనిమిదికోట్లమంది దివ్యాంగులున్నారు. అందులో ఐదుశాతం మందికే పెళ్లిళ్లు జరుగుతున్నాయని భారతప్రభుత్వం సర్వేలో తేలింది. 'వాంటెడ్ అంబ్రెల్లా' పేరుతో వారికోసం ఒక యాప్ తయారు చేసింది. దివ్యాంగుల కోసం తయారు చేసిన మొట్టమొదటి మ్యాట్రిమోని ఇది. 2014లో మొదలైన ఈ యాప్‌కి ఎంతో మంచి స్పందన వస్తోంది. ఈ యాప్ మొదలైన ఆరు నెలల్లోనే 4,500 మంది సభ్యత్వం పొందారు.*



*ఈ యాప్‌లో కేవలం వంద రూపాయలతో పేరు రిజిస్ట్రేషన్ చేసుకోవచ్చు. దివ్యాంగులకు ప్రేమ అందించాలనీ, వారందరికీ మంచి జీవితం దొరకాలనే సంకల్పంతో ఈ యాప్‌ని రూపొందించినట్లు చెబుతోంది కల్యాణి.*

### వారికి ఆమే ఆశాజ్యోతి

జీవితంలో ఎదురైన కష్టాలను చిరునవ్వుతో ఎదిరించడమే కాదు ఎంతోమంది చీకటి జీవితాల్లో వెలుగుదివ్వెగా మారింది పూనమ్ శ్రోతి. జీవితంలో ఎదుగుదలకు శారీరక వైకల్యం అడ్డుగా భావించి లోలోపల కుమిలిపోయే దివ్యాంగులకు ఆశాజ్యోతి ఆమె. గ్రామీణ ప్రాంత అభివృద్ధి మహిళా సాధికారతతో పాటు దివ్యాంగులు ఉన్నత చదువులు చదివేందుకు తోడ్పాటు అందిస్తూ వారిలో ఆత్మవిశ్వాసాన్ని పెంపొందిస్తోంది.

పూనమ్ శ్రోతి భోపాల్‌కి చెందిన 31 ఏళ్ల అమ్మాయి. ఆస్టియో జెనెసిస్ ఇంపర్ఫెక్టా. ఈ పేరు వింతగా ఉండొచ్చు కానీ ఇదొక వ్యాధిపేరు. ఎముకలు గుల్లబారే అరుదైన వ్యాధి. లక్షమందిలో ఏ ఒక్కరికో ఇద్దరికో వచ్చే వ్యాధి. చిన్నదెబ్బ తగిలినా చాలు శరీరంలో ఎముకలు పటపటా విరిగిపోతాయి. చిన్నప్పుడే ఈ వ్యాధి బారినపడింది శ్రోతి. ఎన్నోసార్లు ఆమె ఎముకలు విరిగాయి. వాటిని అతికించేందుకు ఎన్నో ఆపరేషన్లు చేశారు. ఈ వ్యాధి వల్ల ఆమె రెండడుగుల ఎనిమిది అంగుళాలకు మించి ఎత్తు ఎదగలేదు. అయినా సరే కుంగిపోలేదు శ్రోతి. తను సంతోషంగా బతకడమే కాదు ఇతరులు కూడా ఆనందంగా బతికేందుకు జీవితపాఠాలు నేర్పుతోంది. తన తలరాతను తిట్టుకోకుండా సమాజహితం కోసం పాటుపడుతోంది. అక్షరాస్యత అంతగా అభివృద్ధి చెందని ప్రజల్లో అవగాహన కలిగిస్తోంది.

### అందరిలాగే తానూ

'ఆస్టియో జెనెసిస్ ఇంపర్ఫెక్టా' వ్యాధి కారణంగా బిడ్డ ఎదుగుదల లోపం చూసి పూనమ్ తల్లిదండ్రులు మొదట బాధపడ్డారు. అయితే తమ కూతురులో టాలెంట్ గ్రహించి ప్రోత్సహించారు, భోపాల్ కేంద్రీయ విద్యాలయం నుంచి 12వ తరగతి పూర్తిచేసిన పూనమ్, ఆ తర్వాత డిగ్రీ, ఫైనాన్స్‌లో ఎంబీఏ పూర్తి చేసింది. ఎంబీఏ అనంతరం దూరవిద్య ద్వారా హెచ్.ఆర్ కూడా పూర్తి చేసింది పూనమ్ శ్రోతి. చదువు సాఫీగా సాగినా ఉద్యోగం విషయంలో మాత్రం కష్టాలు ఎదుర్కొంది. మెరిట్ ఉన్నప్పటికీ ఏదో ఒక సాకుతో ఉద్యోగాన్ని ఇచ్చేందుకు నిరాకరించేవారు. కేవలం

శారీరక వైకల్యం కారణంగానే అవకాశం దొరక లేదు. ఎట్టకేలకు ఒక కంపెనీ ఆమెను ఎగ్జిక్యూటివ్‌గా అపాయింట్ చేసుకుంది. అర్హతకు తగిన ఉద్యోగం కాకపోయినా పూనమ్ దాన్నో సవాల్‌గా స్వీకరించింది. అందరిలాగే తానూ కష్టపడి పనిచేయగలనని నిరూపించింది. ఐదేళ్లపాటు అదే కంపెనీలో పనిచేసి డిప్యూటీ జనరల్ మేనేజర్ స్థాయికి ఎదిగింది!

ఉద్యోగం చేస్తుండగా ఎన్నో కష్టాలు ఎదుర్కొని నిలదొక్కుకుంది పూనమ్. తనలాంటి కష్టాలు మరెవ్వరికీ రాకూడదని అప్పుడే నిర్ణయించుకుంది. అందుకోసం ఏదైనా చేయాలని ఆలోచించింది. ఆ లక్ష్యం కోసమే తను చేస్తున్న ఉద్యోగ్యాన్ని త్యాగం చేసింది.

### సోషల్ వెల్ఫేర్ సొసైటీ స్థాపన

తనలాంటి దివ్యాంగులకు బాసటగా నిలిచేందుకు 2014లో ఉద్దీప్ సోషల్ వెల్ఫేర్ సొసైటీ ఏర్పాటు చేసింది పూనమ్. దివ్యాంగులు మనసుకు నచ్చిన పనిచేసి సమాజంలో తమకంటూ ప్రత్యేక గుర్తింపు తెచ్చుకునేందుకు సాయం చేయాలన్నదే ఆమె లక్ష్యం. ఈ ఉద్దీప్ సమాజ సేవ సంస్థ కేవలం దివ్యాంగులకు మాత్రమే కాదు, మహిళా సాధికారత, గ్రామాల అభివృద్ధి లాంటి పనులు కూడా నిర్వహిస్తోంది. అయితే రెండేళ్లుగా మాత్రం దివ్యాంగులలో సాధికారత పెంపొందించేందుకు కెన్ డూ అనే ప్రోగ్రామ్ నిర్వహిస్తోంది.

దివ్యాంగులు చదువుల్లో ముందున్నప్పటికీ సరైన ప్రోత్సాహం లేకపోవడం వల్ల వారిలో ఆత్మవిశ్వాసం కొరవడుతోందని, వారికి ఉద్యోగం లభించడం కూడా కష్టంగా మారిపోయిందని పూనమ్ గుర్తించింది. అందుకోసమే కెన్ డూ ప్రోగ్రామ్ ప్రారంభించింది.

తమలో లోపం ఉందనివారు బాధపడకుండా, ఇతరులపై ఆధారపడకుండా స్వశక్తితో ముందుకు సాగేలా ప్రోత్సహించడం, అవసరమైన శిక్షణ, అవగాహనా తరగతులు నిర్వహించడం, వారికి ఉద్యోగాలిప్పించడం పూనమ్ శ్రోతి సంస్థ ప్రధాన లక్ష్యం. ఈ సేవలకుగానూ వందమంది ప్రముఖ మహిళల్లో ఒకరుగా ఆమెకు గుర్తింపు లభించింది. అందుకుగానూ రాష్ట్రపతి ప్రణబ్‌ముఖర్జీ చేతుల మీదుగా అవార్డును కూడా అందుకుంది. కుంగిపోకుండా సమస్యలను ధైర్యంగా ఎదుర్కొని నిలబడి ఎందరికో ఆదర్శప్రాయంగా నిలుస్తున్న పూనమ్ కృషి ప్రశంసనీయం.






## మిస్ ఇండియన్ వీల్ చైర్

ఆమె రూపం దివ్యమైనది. చురుకుదనం, టన్నులకొద్దీ ఎనర్జీ, కాన్ఫిడెన్స్ ఆమె సొంతం. కానీ తనకు రెండేళ్ల వయసు ఉన్నప్పుడు ఊళ్లో ఓ డాక్టర్ చేసిన పనివల్ల పోలియో డ్రాప్స్ వికటించి కాళ్లు చచ్చుబడ్డాయి. ముద్దులొలికే పసిపాపాయి ఈ భూమిని కాళ్లతో ముద్దాడిన సందర్భమే లేదు. ఆ అమ్మాయే వసుంధర కొప్పుల. ఊరు అనంతపురం జిల్లా, చెట్టూరు మండలం. పోస్ట్ గ్రాడ్యుయేషన్ చేసిన ఈ అమ్మాయి దివ్యాంగుల్లో ఏదైనా మార్పు తెచ్చేందుకు మీడియాలో పనిచేసింది. తర్వాత ఓ న్యూస్ ఛానల్‌లో 'బి ఏ స్టార్' అనే కార్యక్రమం ప్రారంభించింది. అలా అది కొనసాగిస్తూనే మోడల్ ఇండస్ట్రీలోకి వచ్చి *2013* సంవత్సరంలో మిస్ వీల్ ఛైర్ కాంటెస్ట్‌లో పాల్గొంది. ఇలా తనలో ఉండే ప్రతిభ ద్వారా నలుగురిలో ధైర్యం నింపేందుకు కృషి చేస్తానంటోంది వసుంధర.

### డిష్యుం డిష్యుంలో మేటి!

కండలు తిరిగిన ఒక దుర్మార్గుడి దాష్టీకాన్ని మరో యోధుడు ప్రతిఘటించి ఓడించి అడ్డుకోవడం సర్వసాధారణ విషయం. కానీ అదే ఒక విలన్ దౌర్జన్యాన్ని, దుర్మార్గాన్నీ దివ్యాంగులు తిప్పి కొడితే..? ఆశ్చర్యంగానూ, అద్భుతంగానూ అనిపిస్తుంది కదూ! టాలీవుడ్ మూవీ 'సుప్రీం' చూశారు కదా. అందులో విలన్‌ని ఏడుగురు దివ్యాంగులు శారీరకంగా ప్రతిఘటించి పోరాడి ఓడిస్తారు. ఆ సినిమాలో వారందరికీ టీమ్‌లీడర్ ఆనంద్ ఆర్నాల్డ్. కదలలేని నిస్సహాయస్థితి అతడిది. కాళ్లు లేవని బాధపడలేదు ఆనంద్ ఆర్నాల్డ్. వ్యాయామం చేసి దేహదారుఢ్యం సంపాదించాడు. ఒకనాటి అసహాయుడే కండలవీరుడుగా అవతరించాడు. తన కండల ద్వారానే ఖండాలు దాటి తన ప్రతిభ చాటిచెబుతున్నాడు.

పంజాబ్‌కు చెందిన ఆనంద్ ఆర్నాల్డ్ వీల్ చెయిర్ మోడల్, యాక్టర్. అదెలా సాధ్యమైందంటే...

ఒకప్పుడు అందరిలానే బాగుండేవాడు ఆనంద్ ఆర్నాల్డ్. 14 ఏళ్ల వయసులో బాడీబిల్డింగ్ ప్రారంభించాడు. ఉన్నట్టుండి ఒకరోజు విపరీతమైన వెన్నునొప్పి వచ్చింది. హాస్పిటల్‌కి వెళితే, వెన్నుముక కేన్సర్‌గా నిర్ధారించారు డాక్టర్లు. దాంతో క్రమంగా ఒళ్లంతా చచ్చుబడిపోయింది. ఒకానొక దశలో తన జీవితం నిరర్థకం అనే డిప్రెషన్‌కి వెళ్లిపోయాడు. కానీ తిరిగి ఆత్మస్థైర్యంతో జిమ్‌కి వెళ్లడం ఆరంభించాడు. అలా మొదలైంది అతని ప్రస్థానం. ఇప్పుడు ఆనంద్ దేశంలోనే మొదటి వీల్ చెయిర్ బాడీ బిల్డర్.

### సినిమాల్లోకి

బాడీబిల్డింగ్‌పై ప్రత్యేక శ్రద్ధపెట్టిన ఆనంద్ మూడుసార్లు మిస్టర్ ఇండియాగా, 12సార్లు మిస్టర్ పంజాబ్ విజేతగా నిలిచాడు. 27 ఇతర పతకాలు కూడా సాధించాడు. అంతేకాదు ఆనంద్ జీవిత చరిత్ర ఆధారంగా ఇంగ్లిష్‌లో వెయిట్‌లెస్ అనే పుస్తకం వెలువడింది. ఏ ట్రూ స్టోరీ ఆఫ్ కరేజ్ యాన్ డీ ఇన్‌స్పిరేషన్ అనేది ఆ పుస్తకం ఉపశీర్షిక. ఆనంద్ ప్రతిభ దేశవ్యాప్తంగా అందరికీ తెలిసింది. దాంతో సినిమాల్లో కూడా అనేక అవకాశాలు వచ్చాయి. మొదట నటించకూడదు అనుకున్నాడు. కానీ తనను చూసి ఎవరైనా స్ఫూర్తి పొందుతారనే ఆలోచనతో బాలీవుడ్, టాలీవుడ్, పంజాబ్ చిత్రాల్లో నటించాడు.

'అంగవైకల్యం ఉండొచ్చు, కానీ మా మనో నిబ్బరానికి ఎలాంటి వైకల్యం లేదు' అని ప్రపంచానికి చాటిచెబుతున్నారు ఇలాంటివారంతా. అందుకే వారు దివ్యాంగులయ్యారు. మనచుట్టూ ఇలాంటి దివ్యాంగులు ఎందరో! వారందరినీ మనతో సమానంగా తోటి పౌరులుగా గుర్తిద్దాం, వారందరికీ బాసటగా నిలుద్దాం!

**- సంతోషి దహగాం**




**"అబ్బా వదలండీ...అవతల పిల్లాడు..." గింజుకుంది శ్యామల.**

**మధుమూర్తి అప్పటికే ఓ ముద్దిచ్చేశాడు.**

**శ్యామల కళ్ళు పెద్దవిచేసి కోపంగా చూసింది. ఈ వ్యవహారమంతా పదేళ్ల కిట్టూ చూసీ చూడనట్టు చూసేశాడు. వాడు హోంవర్కు చేసుకుంటున్నట్టు నటిస్తున్నాడు. వాడి మనసంతా ఆటమీద ఉంది. వీధిలోంచి క్రికెట్ గోల వినిపిస్తోంది. అరిచే వాడు పక్కింటి అఖిల్.**

"అవుట్..." ఈ కేక సుందర్‌ది.

ఎవరు అవుటై ఉంటారు?! కిట్టూ ఆలోచిస్తున్నాడు. కలం సాగటంలా.

"ఏమిట్రా ఆలోచిస్తున్నావ్?!" తండ్రి గద్దింపు.

ఉలిక్కిపడి "ఏం లేదు. లెక్క ఆలోచిస్తున్నా..." అబద్ధం ఆడాడు.

"ఏదీ ఇటు పట్రా.."

పుస్తకం తీసుకెళ్ళాడు.

"ఇదేమిటి? ఇంగ్లీషు నోట్సు తెచ్చి లెక్కలు అంటావ్?!"

దొరికిపోయాడు.

"అదీ...అదీ..." తడబడ్డాడు.

"మైండ్ ఆబ్సెంట్ బాడీ ప్రజెంట్. ఇలాగైతే రేపు పరీక్షల్లో ఎలా పాసవుతావురా?"

కిట్టూ బిక్కమొహం వేసి నిలబడ్డాడు.

"ఇంటికొచ్చినదగ్గర్నుంచీ ఆటలు, టీవీలో కార్టూన్ సీరియల్స్... ఇవెప్పుడైనా ఉంటాయి. చదువుకునే అవకాశం మళ్ళీ వస్తుందట్రా...నువ్వు బాగా చదువుకుని, ఏ ఇంజనీరో, డాక్టరో అయి, అమెరికా వెళ్ళి బోలెడు సంపాదించాలని మీ అమ్మా నేనూ తెగ కలలు కంటుంటే నువ్విలా టైమంతా ఆటలతో వేస్టు చేస్తున్నావ్..."

దీనికీ కిట్టూ బిక్కమొహమే జవాబు!

'అబ్బ...వాణ్ణలా కోర్టుమార్షల్ చెయ్యకండి. కిట్టూ... ఇలారా...నీ చేత హోంవర్కు చేయిస్తాను" అంది శ్యామల చాపమీద కూర్చుంటూ.

'అమ్మయ్య' అనుకుంటూ తల్లి దగ్గరకెళ్ళాడు కిట్టూ.

అంతలో క్రికెట్ టీమ్ కుర్రాడొకడు మేడ మీదకి వచ్చాడు.

"కృష్ణవంశీని పంపిస్తారా ఆంటీ? మాకొక హ్యాండ్ తక్కువైంది."

"హోంవర్కు చేసి వచ్చేస్తాడు. ఈ లోగా మీరు ఆడుకోండి. నువ్వు తియ్యరా పుస్తకాలు" అంటూ కొడుకుని గద్దించింది.

కిట్టూ గబగబ పుస్తకాలు తీసి తల్లికిచ్చాడు.

•••

"నువ్వు కాదనకు బావా! నీ కెప్పుడూ తీరిక ఉండదు. కనీసం మా చెల్లెల్నీ, కిట్టూనీ దసరా పండక్కి పంపించు. ఆడపిల్లలకి పుట్టింటి మీద మనసుంటుంది బావా! పుట్టింటి వాళ్ళకీ ఆడపిల్లల మీద ఉంటుంది. మగవాళ్ళం అర్థం చేసుకోవాలి."

పండగ పూట ఇంట్లో ఎవరూ లేకుండా ఏమిట్రా? మీ చెల్లెలేమన్నా చిన్నపిల్లా? పెళ్ళై పన్నెండేళ్లైంది. ఇంకా పండగలూ పబ్బాలూ ఏమిట్రా?" విసుగ్గా అన్నాడు మధుమూర్తి.

"పండగలే జీవితానికి సంబరాలు బావా! పండగ చేసుకోని జీవితాలు దండగ. జీవితంలో ఎప్పుడూ సమస్యలు, చీకాకులు ఉంటూనే ఉంటాయి. పండగలు వచ్చినప్పుడైనా సరదాలు, సంబరాలు, కొత్త బట్టలు, ఇవన్నీ లేకపోతే మనిషి పిచ్చోడైపోతాడు..." ఆనందరావు మరింతగా ఒత్తిడిచేశాడు.

"ఇంట్లో ఎవరూ లేకపోతే తోచదురా.." ఓరగా శ్యామలకేసి చూస్తూ అన్నాడు. ఆమెకి ఆ చూపులో మర్మం అర్థమైంది. ఆమె బుగ్గలు ఎర్రబడ్డాయి. మొగుడికి తను లేకపోతే రాత్రి గడవదని ఆమెకి బాగా తెలుసు.

"ఊc ఏమిటా చూపు?" అన్నట్టు కళ్ళతోనే మందలించింది మొగుణ్ణి.

"సరే...ఓ పని చెయ్యి. అందరూ వచ్చెయ్యండి."

"మరి ఆఫీసో?"

"సెలవుపెట్టెయ్"

"మా బాస్ సెలవు అనగానే ఆ ఒక్కటీ అడక్కు అనేస్తాడు. నీలాగా స్కూలు మాస్టరైతే సెలవులే సెలవులు."

"చివరగా ఒక విషయం చెబుతాను. కాదనొద్దు."

"ఏమిటది?"

"ముందు కృష్ణవంశీని తీసుకెళతాను. తర్వాత

పండక్కి మీరిద్దరూ తీరిగ్గా రండి..."

కిట్టూ కళ్ళు సంబరంతో మెరిశాయి.

"నేను మావయ్యతో వెళ్తాను డాడీ..." మారాం చేస్తూ అన్నాడు.

మధుమూర్తి భార్యకేసి చూశాడు.

"వెళ్ళనీయండి" అంది శ్యామల.

●●●

పచ్చటి పొలాలమధ్య నుండి రైలు వేగంగా వెళ్తుంటే కిట్టూ తదేకంగా చూస్తున్నాడు. కిటికీ పక్కనే కూర్చున్న కిట్టూని పైరగాలి పలకరిస్తోంది. చెట్లు దోబూచులాడుతున్నాయి. చూస్తూ, చూస్తూ నిద్ర పోయాడు.

తట్టి లేపుతుంటే తుళ్ళిపడి లేచాడు.

"స్టేషనొచ్చింది లే..." మేనమామ చెయ్యి పుచ్చుకుని జాగ్రత్తగా రైలు దింపాడు.

దిగిన కొద్దిక్షణాలకే కూతవేసి వెళ్ళిపోతున్న రైలుకేసి బెంగగా చూశాడు. ఇంతసేపూ అమ్మ ఒడిలో పడుకున్నట్టే ఉంది. ప్రయాణం చేసినట్టే లేదు.

జనాన్ని తప్పించుకుంటూ బైటకి దారి తీశారు. ఆహ్వానిస్తున్న ఆటోవాళ్ళని కాదని, ఎదురుచూస్తున్న ఎడ్లబండిలో ఎక్కించాడు ఆనందరావు.

కిట్టూకి ఎడ్లబండి ఎక్కటం ఇదే మొదటిసారి.

లోపల మెత్తటి పరుపులున్నాయి.

ఎడ్లు తెల్లగా అపర నందీశ్వరుల్లా ఉన్నాయి.

మీద చెయ్యి వెయ్యగానే చురుగ్గా కదిలాయి. కిట్టూ ఎడ్లకి సమీపంగా కూర్చున్నాడు. వాటి కదలిక ల్ని ఆసక్తిగా చూస్తూ కూర్చున్నాడు. ఆనందరావు మేనల్లుణ్ణి వాడి చదువు గురించి, స్నేహితుల గురించి ప్రశ్నలు వేస్తుంటే పరధ్యానంగా జవాబులు చెబుతున్నాడు.

కిట్టూ పరధ్యానం గమనించి, వాడి ఆసక్తిని అర్థం చేసుకున్నాడు ఆనందరావు. "ఎడ్లు నీకు నచ్చాయిరా?"

"చాలా బావున్నాయి మామయ్యా..."

"అయ్యగారు బండి నడుపుతారా?!" అన్నాడు పగ్గాలు పట్టుకున్న పాలేరు.

"ఊఁ....ఊఁ..." అన్నాడు ఉత్సాహంగా.

"ఇట్టా రండి..." అని తన ముందు కూర్చోబెట్టుకుని పగ్గాలు చేతికిచ్చాడు. కిట్టూ ఆనందానికి అంతులేదు. పాలేరు సూచనలు పాటిస్తూ ఇంటిదాకా బండి నడిపాడు. పగ్గాలు పాలేరు తీసుకున్నాడు.

మేనల్లుడి చురుకుదనానికి ఆనందరావు సంతోషించాడు.

మెల్లిగా కిట్టూని బండిమీద నుండి దింపాడు.

అంతలో "హాయ్ కిట్టూ..." అంటూ పరుగున వచ్చింది బిందు.

"హాయ్ బిందూ..." చెట్టాపట్టాలేసుకుని కేరింతలతో ఇంట్లోకి పరుగులు తీశారిద్దరూ. నవ్వు మొహంతో స్వాగతించింది బిందూ తల్లి తులసి.

●●●

"ఇవేంటి?"

"వీటిని తేగలంటారు. తిను చాలా బావుంటాయి."

"ఎలా తినాలి?"

"ఇలా..." పైపొట్టు తీసి మధ్యకు విరిచేసింది. చిన్న చిన్న ముక్కలుగా విరిచి, పీచుతీసి పారేస్తూ కిట్టూకి అందించింది బిందు.

"అబ్బో...చాలా బావుంది" అన్నాడు తేగ ముక్కల్ని ఆప్యాయంగా నములుతూ కిట్టూ.

"ఇంకా మా ఊళ్ళో చాలా దొరుకుతాయి" కళ్ళు తిప్పుతూ చెప్పింది బిందు.

"ఏమేం దొరుకుతాయి?" ఆసక్తిగా అడిగాడు కిట్టూ.

"వేసవికాలం వస్తే తాటి ముంజెలు, ఈత పళ్ళు, మామిడిపళ్ళు, సపోటా పళ్ళు, సీమ చింత కాయలు.. తిండే తిండి" అంది నవ్వుతూ బిందు.

"జామకాయలు దొరకవా?"

"ఎందుకు దొరకవు? దొరుకుతాయి. కలకత్తా జామ కూడా దొరుకుతుంది."

"కలకత్తా జామకాయలో ఏమిటి స్పెషల్?"

"పైన తెల్లగా లోపల ఎర్రగా ఉంటుంది. చాలా రుచిగా ఉంటుంది."

"అవి కూడా తెప్పించుకోవాలి."

"సాయంత్రం మనమే జామతోటకి వెళ్ళి కోసుకుందాం"

"భలే..భలే...అలాగే చేద్దాం.." సంబరంగా అన్నాడు కిట్టూ.

●●●

"వాణ్ణి చూశావా ఎంత ఉల్లాసంగా ఉన్నాడో..." కిట్టూ కేసి చూస్తూ అన్నాడు ఆనందరావు.

తులసి నవ్వింది.

"ఉల్లాసంగాక ఏముంది? బస్తీలో పిల్లలకి స్వేచ్ఛ ఎక్కడిది?"

**కిట్టూకి రైలు ప్రయాణం కొత్తగా అనిపించింది. పచ్చటిపైర్లు, పరుగెత్తే చెట్లు అతణ్ణి అబ్బురపరిచాయి. పల్లెటూరు వెళ్ళి హాయిగా ఎంజాయ్ చేశాడు. తిరుగు ప్రయాణంలో బిక్కముఖం వేశాడు. కానీ రైల్లో అతడికో అనుభవం ఎదురైంది. అతడికో విచిత్ర వ్యక్తి పరిచయమయ్యాడు. అతనితో మాట కలిపి ఎన్నో విషయాలు తెలుసుకున్నాడు కిట్టూ. అప్పుడే ఓ నిర్ణయానికొచ్చాడు. ఏమిటా నిర్ణయం?**

"అవును! మా బావ అయితే మరీ బంధించేస్తాడు. కిట్టూగాడిది పంజరం బతుకే. వాళ్లింటికి ఎప్పుడు వెళ్ళినా కిట్టూని కదలకుండా కూచోబెట్టి చదివించటమే కనిపిస్తుంది. వీడికి ఆటలు పిచ్చి."

"అదేమన్నమాట లెండి. ఆటలాడే వయసులో ఆడుకోవాలి. లేకపోతే బుద్ధి పెరగదు..."

"ఎక్కడ ఆడుకుంటాడు?! దగ్గర్లో ఎక్కడా ప్లేగ్రౌండ్ ఉండదు. ప్రైవేటు స్కూళ్ళలో కూడా ఆటస్థలాలు ఉండడం లేదు. పాపం వీడు ఇంటి ముందు రోడ్డు మీదనే క్రికెట్ ఆడుకుంటూ ఉంటాడు. ఆ రోడ్డుమీద మహా ట్రాఫిక్. నిముష నిముషానికి రోడ్డుమీదకి చూస్తూ కిట్టుగాడికి జాగ్రత్తలు చెబుతుంటారు. ఆ గోల చూస్తుంటే నవ్వొస్తుంది."

"నవ్వెందుకు? ఒక్కగానొక్క పిల్లాడు కదా? వాళ్ళ భయం వాళ్ళది."

"నిజమేలే! ఒక మాటు నేను చూస్తుండగానే క్రికెట్ ఆడుతున్న పిల్లాణ్ణి స్కూటర్ డీ కొట్టింది."

"మరందుకే వాళ్ళు భయపడేది!"

"భయంతో పిల్లల్ని బందీలు చేస్తే ఎలా ఎదుగుతారు? జీవితమంతా భయం వెన్నాడుతూనే ఉంటుంది."

"పిల్లల హక్కుల గురించి ప్రభుత్వాలు పట్టించుకోవటం లేదు. ప్రతి పేటకి తప్పనిసరిగా ఒక పార్కు ఉండాలి. పిల్లలు ఆడుకునేందుకు స్థలాలు ఉండి తీరాలి."

"నాయకులు తమ పార్టీని, కుర్చీని కాపాడుకునేందుకే సమయమంతా వెచ్చిస్తోంటే, ఇవన్నీ పట్టించుకునే సమయం ఎక్కడుంది? తల్లి దండ్రులే అవన్నీ చూసుకోవాలి."

మాటల మధ్య ఇంటిముందు ఆటోలోంచి శ్యామల, మధుమూర్తి దిగారు. చప్పున ఎదురు వెళ్ళి లగేజ్ అందుకున్నాడు ఆనందరావు.

తులసి శ్యామలని ఆప్యాయంగా పొదువుకుని ఇంట్లోకి తీసుకు వెళ్ళింది.

పిల్లలు సంబరంగా గెంతులు వేశారు.

పండుగ వాతావరణం ముందుగానే వచ్చేసింది.

ఆ ఇంట్లోకి ప్రవేశించిన శ్యామలకి పాత జ్ఞాపకాలన్నీ మనసులో మెదిలాయి. బాల్యం, స్నేహితురాళ్లతో ఆట పాటలు... అమ్మా, నాన్నల ఆప్యాయత, పెళ్లిసందడి... తొలిరేయి మధుర స్మృతులు..

శ్యామల మనసు సంతోషంతో నిండిపోయింది.

రాత్రి భోజనాలయ్యాక, తులసి ప్రత్యేకంగా శ్యామల దంపతులకి తమ బెడ్‌రూమ్‌లో పడక ఏర్పాటు చేసింది.



# మాలీవుడ్ బాగుంది

‘ఆనంద్’ సినిమా తరువాత ఆ రేంజ్‌లో కమలినీ ముఖర్జీ సినిమాలు చేయలేదు, సక్సెస్ రాలేదు. మొన్నామధ్య ‘గోవిందుడు అందరి వాడేలే’ సినిమాలో కనిపించినా ఆ తరువాత తెలుగుకు కమలిని దాదాపు దూరమైపోయింది. ఇక్కడ మాయం అయిన కమలిని మాలీవుడ్‌లో తేలింది. అక్కడ మోహన్‌లాల్‌తో చేసిన ‘పులి మురుగన్’ కలెక్షన్ల సునామీ సృష్టించింది. అంతే కాకుండా ఈ సినిమాలో కమలిని నటనకు మంచి మార్కులు పడ్డాయి. దర్శకనిర్మాతలు ఆమె ఇంటి ముందు క్యూ కడుతున్నారట. వస్తున్న ఆఫర్ల వెల్లువ చూసి మాలీవుడ్‌లోనే సెటిల్ అవ్వాలని కమలిని నిర్ణయించుకుందట! తెలుగులో వచ్చిన ‘మన్యం పులి’ మంచి టాక్ తెచ్చుకుంది. దాంతో కొందరు తెలుగు దర్శకనిర్మాతలు ఆమెను సంప్రదిస్తే తనకు మాలీవుడ్ బాగుందనీ, ఇక్కడి సినిమాలకే ఫస్టు ప్రయార్టీ ఇస్తానని చెప్పిందట! తెలుగులో చేయనని నేరుగా చెప్పకుండా ఇలా డొంక తిరుగుడు సమాధానం చెప్పిందని సినీజనాలు అంటున్నారు.



“మేము పిల్లల దగ్గర పడుకుంటాంలే వదినా...” అంది శ్యామల.

మధుమూర్తికి ఒళ్ళు మండిపోయింది.

కోపంగా పెళ్లాంకేసి చూశాడు. శ్యామల చూపులు తిప్పుకుంది. ‘కోరికలు ఆడవాళ్ళకి ఉండవా? మగవాళ్ళని ఊరించి ఏడిపిస్తే గానీ ఆడమనసుకి ఆనందం కలగదా?’ లోలోపల ఉడికిపోతూ అనుకున్నాడు మధుమూర్తి.

“హాయిగా ఏసి రూమ్‌లో పడుకోమంటే బెట్టు చేస్తావేంటి వదినా... మాట్లాడకుండా ఆ గదిలో పడుకో” అంది తులసి చనువుగా.

మధుమూర్తికి తులసి మాటలు పన్నీటి జల్లుల్లా తగిలాయి.

‘నీకు శతకోటి ధన్యవాదాలు చెల్లెమ్మా’ అనుకున్నాడు మనసులో. మరి ఆలస్యం లేకుండా ముందుగానే బెడ్‌రూమ్‌లోకి వెళ్ళి దర్జాగా శోభనం పెళ్లి కొడుకులా పడుకున్నాడు.

శ్యామల వెంటనే లోపలికి రాకుండా తులసితో ఆ కబుర్లు ఈ కబుర్లు చెప్పి ఎప్పటికో వచ్చింది. అంతసేపూ పెళ్లాన్ని తిట్టుకుంటూనే ఉన్నాడు మధుమూర్తి.

గది తలుపు వెయ్యటాని క్కూడా సంకోచిస్తూ దగ్గరగా వేసింది.

బెడ్‌లైట్ తీసి మంచం మీదకు చేరిన శ్యామలని మీదకి లాక్కుంటూ ‘ఎంతసేపూ’ అన్నాడు విసుగ్గా.

“మీకేం తెలుస్తాయి ఆడవాళ్ళ ఇబ్బందులు. అవతల ఏమనుకుంటారు?”

“ఏమనుకుంటారు? మనం భార్యాభర్తలం. రహస్య ప్రేమికులం కాదు..”

“కావచ్చు...కానీ...”

“ఇంకేం మాట్లాడకు...” ఆమెను మాట్లాడనియ్యకుండా ఆమెను చుట్టేశాడు! పెళ్ళయ్యాక వాళ్ళ తొలిరాత్రి జరిగింది ఆ గదిలోనే.

ఇప్పుడు అతనికి మళ్ళీ ఆ తొలిరాత్రి తిరిగి వచ్చినట్లనిపించింది.

●●●

“అన్నయ్యా.. అన్నయ్యా...” శ్యామల కేకలకి కంగారుగా లేచాడు ఆనందరావు. తులసి కూడా లేచి పెద్ద లైటు వేసింది.

“ఏంటమ్మా..ఏమైంది?” ఆదుర్దాగా అడిగాడు.

“ఆయన గుండెనొప్పితో బాధపడుతున్నారు..” భయంతో వణికిపోతూ అంది. “ఆఁ...” గబగబ మధుమూర్తి దగ్గరకు పరుగు తీశాడు.

మధుమూర్తి ఛాతిని చేత్తో అదుముకుని బాధ పడుతున్నాడు. ఆనందరావుకి భయం వేసింది. ‘హార్ట్‌ఎటాక్’ అయితే...ఈ అర్ధరాత్రి ఎలా? ఎక్కడికి తీసుకు వెళ్ళగలడు?

హారి భగవంతుడా.. ఎలాంటి సమస్య తెచ్చిపెట్టావు?

ఇప్పుడు ఏం చెయ్యాలి? ఎవర్ని పిలవాలి? ఆచార్లు గారు గుర్తొచ్చాడు. “శ్యామలా! ముందు కాస్త అమృతాంజనం రాయి. నేను వెళ్ళి ఆచార్లుగారిని పిలుచుకొస్తాను” జవాబు కోసం ఎదురు చూడకుండా టార్చిలైటు తీసుకుని బైటకి పరుగెత్తాడు.

శ్యామల అమృతాంజనం వేళ్ళకి తీసుకొని మధుమూర్తి గుండెలమీద రాసింది. ఆమెకు లోలోపల భయం తొలిచేస్తోంది. ఏదన్నా జరగరానిది జరిగితే... లేదు లేదు అలా జరగకూడదు... భగవంతుడా... నువ్వే దిక్కు నా భర్తని రక్షించు.

అంతలో ఆచార్లుగారు వచ్చారు. ఆయన ఆయుర్వేద వైద్యంలో సిద్ధహస్తుడు. ఆ ఊళ్ళో ఆయనే ధన్వంతరి!

రాగానే నాడి పరీక్ష చేశాడు. పొట్ట నొక్కి చూశాడు. ఒక మాత్ర తీసి, “దీనిని మంచి నీళ్ళతో తాగించండి..” అంటూ చేతికిచ్చాడు.

శ్యామల మాత్ర మింగించింది.
"పొట్టకి కాస్త ఆముదం పట్టించండి..."
పల్లెటూరు గనుక ఆముదం ఇళ్లలో ఉంటుంది. తులసి ఆముదం తెచ్చి ఇచ్చింది. శ్యామల భర్త పొట్టకి పలచగా పట్టించింది. పది నిమిషాల్లో బాధ తగ్గింది.
"ఎలా ఉంది?" అడిగారు ఆచార్లుగారు.
"బాగానే ఉంది.." అన్నాడు మధుమూర్తి.
"ఇంతకీ ఏమిటి అనారోగ్యం ఆచార్లుగారూ? హార్ట్ ప్రాబ్లమ్ ఉందా?" ఆందోళనగా అడిగాడు ఆనందరావు.
"ఇది గ్యాస్ట్రబుల్ వల్ల వచ్చిన గుండెనొప్పి! మరేం కంగారులేదు. ఈ మాత్రలు రోజుకి రెండు చొప్పున భోజనం తర్వాత వాడమనండి. వేడి పదార్థాలు ఎక్కువ తినకూడదు."
'అదీ విషయం! రాత్రి ఆవకాయ రెండుసార్లు కలుపుకుని తిన్నాడు మా బావ." అన్నాడు ఆనందరావు నవ్వేస్తూ.
ఆచార్లుగారు మందహాసం చేస్తూ "నేను వస్తాను" అంటూ నిష్క్రమించాడు. దిగబెట్టటానికి వెంట నడిచాడు ఆనందరావు.

•••

"మామయ్యా! మమ్మల్ని ఎడ్లబండిలో స్టేషన్ దగ్గర దింపమను" కిట్టూ కోరిక విని ఆనందరావు నవ్వాడు.
"అలాగే లేరా అల్లుడూ...." అంటూ ఆ ఏర్పాటు చేశాడు.
మధ్యలో కాస్త ఆందోళన కలిగించినా, దసరా పండుగ సరదాగా గడిచిపోయింది. కిట్టూకైతే కొత్త ప్రపంచంలోకి అడుగుపెట్టినట్టు రోజులు నిమిషాల్లా గడిచిపోయాయి. ప్రయాణం అనగానే వాడికి బెంగ పట్టుకుంది. మళ్ళీ పాత ప్రపంచం... బందిఖానా బతుకు.
బిందూ కూడా కిట్టూ వెళ్ళిపోతుంటే బిక్క మొహం వేసింది.
"పండగలకి వస్తూండండి. పిల్లలకి పల్లెటూర్లో బాగా కాలక్షేపం అవుతుంది" అంది తులసి.
"అవును బావా! మీరు మళ్ళీ మళ్ళీ రావాలని నా కోరిక" అన్నాడు ఆనందరావు. "అలాగే లేరా..." అన్నాడు మధుమూర్తి ఎడ్లబండి వైపు నడుస్తూ. శ్యామల, కిట్టూ అనుసరించారు.

•••

రైలులో మళ్ళీ కిటికీ పక్కనే కూర్చున్నాడు కిట్టూ.
వచ్చేటప్పుడు లాక్కున్న పొలాలన్నిటినీ రైలు తిరిగి ఇచ్చేస్తున్నట్టు, ఒక్కో దృశ్యం దూరమైపోతోంది.
మళ్ళీ తమ ఊరికి తిరిగి వెళ్ళటం కిట్టూకి కష్టంగా అనిపించింది. కిటికీ బయట దృశ్యాలు చూడడం విసుగనిపించి రైలులోకి దృష్టి మరల్చాడు.
తల్లీ తండ్రీ చెరొక పుస్తకం చదువుకుంటున్నారు.
రైలు ఏదో స్టేషనులో ఆగింది.
జనం దిగుతున్నారు. కొత్తవాళ్ళు ఎక్కుతున్నారు.

## భూదేవి

ఓ భూగ్రహమా, నాగ్రహమా, నాస్థానమా
రోదసిసముద్రంలో తేలియాడే
అనిశ్చితచంచల పదార్థమా-
నువ్వు
తేలిపోతున్న ఒక ధూళిమేఘానివో
పేలిపోతున్న ఒక చిన్నగ్లోబువో
తుప్పుపట్టనున్న చిన్న లోహపు ముక్కవో
అనంతశూన్యంలో ఒక అనామక కణానివో
ఒంటరి వ్యోమనౌకవో, మహానక్షత్ర ఖండానివో
జిగురుతో అతికించిన
శీతలశిలవో శిలాశీతలానివో...
కాదు, ఇది నిజం కాదని
నా లోపల యేదో పలుకుతోంది!

నువ్వు
సుతిమెత్తని నా ప్రియతమవి;

నీకు తెలుసా,
మృదుపవనాలతో, సంగీతహవనాలతో
తొణికిసలాడే నా హృదయాంతరంగంలో
నా ఆత్మని వెన్నంటి నువ్వు వున్నావని!
నా రక్తనాళాలలో
కెరటాల వలె, వరదలవలె పోటెత్తుతున్న
కాలపుకారిడార్ల కాళ రహస్యాలనీ
చరిత్ర గ్రంథాలనీ
యుగయుగాల జీవనగీతాలనీ
నేను అనుభవిస్తున్నాను-

నీ పొగమంచు మబ్బులూ, విద్యుత్ తుఫానులూ
నాలోపల చెలరేగిన ప్రళయ ప్రభంజనాలు-




వేడి వేగం వాంఛ తారసిల్లిన ప్రతిసారీ
ఉప్పునీ తీపినీ చేదునీ రుచి చూశాను నేను-



నీ అద్భుతవర్ణాలూ, నీ పరిమళాలూ, నీ రుచీ
నా జ్ఞానేంద్రియాలను ఉక్కిరిబిక్కిరి చేశాయి-

నీ సౌందర్యంలో
ఆనందప్రసన్నతని ఈ క్షణం కనుగొన్నాను-
భూగ్రహమా, నా గ్రహమా
నేను నిన్ను
హృదయపూర్వకంగా
ప్రేమిస్తున్నాను!

(మైఖేల్ జాక్సన్ ఆంగ్ల గీతానికి అనువాదం)

-దేవిప్రియ

కిట్టూ ఎదురుగా ఉన్న సీట్లో ఒక విచిత్ర వ్యక్తి, వచ్చి కూర్చున్నాడు. చేతిలో చెక్క పంజరం. అందులో రెండు చిలకలు! చిలకల్ని అంత దగ్గరగా చూడటం కిట్టూకి అదే మొదటిసారి. విచిత్రంగా చూస్తున్నాడు కిట్టూ. ఆకుపచ్చ రెక్కలు, ఎర్రని ముక్కు, జామగింజ లాంటి కళ్ళు, మెడ మీద గీత. మధ్య మధ్య అరుపులు.
మెల్లగా ఆ విచిత్ర వ్యక్తితో కిట్టూ మాటలు కలిపాడు.
కిట్టూ ప్రశ్నలు వేసి జవాబులు రాబట్టాడు. అతనికిలా అర్థమైంది. అతను చిలక చేత జ్యోతిషం కార్డులు తీయిస్తాడు. కోరిన వారి అదృష్టం ఆ కార్డులో ఉంటుంది. రెండు చిలకల్లో ఒకటి సీనియర్. రెండోది ట్రైనింగ్‌లో ఉంది. కొత్తగా పట్టుకున్నాడు. ఇంటికి వెళ్ళాక రెక్కలు కత్తిరించి ట్రయినింగ్ ఇస్తాడు. రెక్కలు కత్తిరించకపోతే ఎగిరిపోతుంది. గతంలో ఒకటి అలాగే ఎగిరిపోయింది.
"నేను చిలకని ముట్టుకోవచ్చా?"
"పట్టుకో...కానీ ముక్కుతో పొడవకుండా చూసుకో.." అన్నాడు జ్యోతిష్కుడు. కిట్టూ మెల్లగా కొత్త చిలకతో స్నేహం చేశాడు. అది మాలిమి అయింది. వేళ్లని మృదువుగా ముక్కుతో రాసింది. కిట్టూకి సంతోషమనిపించింది.
పంజరంలో ఉన్న చిలుక కేసి చూస్తూండిపోయాడు.
వాడికి తనే చిలుక రూపంలో పంజరంలో కూర్చున్నట్టు అనిపించింది. తమ ఇంట్లో పరిస్థితి అదే! బందిఖానా బ్రతుకు. చదువు-చదువు-చదువు... తనకేమో ఆటలు-ఆటలు-ఆటలు! హాయిగా గాల్లో తేలిపోతూ ఆడుకోవాలి. పచ్చిక మైదానాల్లో...చెట్ల చాటున దోబూచులాడుతూ..
"నేను చిలుకని ముద్దెట్టుకోవచ్చా?" దీనంగా అడుగుతున్న కిట్టూ అభ్యర్థన కాదనలేకపోయాడు జ్యోతిష్కుడు.
పంజరంలోంచి కొత్త చిలుకని బైటకి తీసి చేతికిస్తూ "గట్టిగా పట్టుకో" అన్నాడు. కిట్టూ దానిని మురిపెంగా ముద్దు పెట్టుకున్నాడు. చేతిమీద కూర్చోబెట్టుకొని కిటికీ దగ్గరికి తీసుకెళ్ళాడు. మనసులో "ఎగిరిపో ఎగిరిపో" అనుకున్నాడు. అది నిజంగానే ఎగిరిపోయింది. జ్యోతిష్కుడు గొడవ మొదలుపెట్టాడు. మధుమూర్తి జేబులోంచి వంద కాయితం తీసి ఇచ్చాక ఊరుకున్నాడు!
రైలుతో పాటు సమంగా చిలుకల గుంపు ఎగురుతోంది. తప్పించుకున్న చిలుక వాటిలో కలిసింది. కిట్టూ ఖాళీ పంజరం కేసి నవ్వుతూ చూశాడు.

సెల్: 98495 68901

# అరగంట చాలు






తల్లులు తమ పిల్లలతో రోజుకి అరగంటసేపు గడిపితే చాలు వారిలో తెలివితేటలు పెరుగుతాయి అంటున్నారు పరిశోధకులు. నాలుగు సంవత్సరాల నుంచి ఏడు సంవత్సరాలలోపు పిల్లలతో తల్లులు హోంవర్క్ చేయించడం, చదివించడం లాంటివి చేసి నట్టయితే వారి తెలివితేటలు మరింత వృద్ధి చెందడమే కాకుండా చురుకుగా తయారవుతారని వారు చెబుతున్నారు. సుమారు ఎనిమిది వేల మంది పిల్లల మీద వీరు అధ్యయనం నిర్వహించారు. పిల్లలతో కలిసి తల్లులు కూడా ప్లే గ్రౌండ్‌కి వెళ్లాలని వారు సూచిస్తున్నారు. వారితో కలిసి ఆడడం, నడవడం వంటివి చేయడం వలన పిల్లల్లో సోషల్ స్కిల్స్ బాగా పెరుగుతాయని వారు అంటున్నారు.

# చాక్లెట్‌తో సంతోషం



చాక్లెట్ తినడం వలన కలిగే లాభాలు, ప్రయోజనాల గురించి గతంలో చాలా పరిశోధనల్లో వెల్లడైంది. ఇప్పుడు దీనిని రోజులో ఒకసారన్నా తినడం వలన మానసిక ఆనందం కలుగుతుందన్న విషయం ఇటీవల నిర్వహించిన పరిశోధనల్లో వెల్లడైంది. అంతే కాకుండా జ్ఞాపకశక్తి కూడా పెరుగుతుందని వీరు అంటున్నారు. ఆందోళన, ఒత్తిడితో బాధపడుతున్న సుమారు 50 మంది మీద వీరు పరిశోధనలు నిర్వహించారు. వీరిని రెండు గ్రూపులుగా విభజించి ఒక గ్రూపు వారికి మందులతో పాటు ప్రతి రోజూ చాక్లెట్, చాక్లెట్ ఆధారిత ఉత్పత్తులు అందించారు. రెండో గ్రూపు వారికి కేవలం మందులు మాత్రమే అందించారు. కొన్ని రోజుల అనంతరం వీరిని పరిశీలించగా చాక్లెట్ తిన్నవారిలో ఒత్తిడి, ఆందోళన వంటివి తగ్గుముఖం పట్టడంతో పాటు మునుపటికన్నా సంతోషంగా ఉండడాన్ని గమనించారు. రెండో గ్రూపువారిలో ఎలాంటి మార్పునూ గమనించలేదు. వీరి సంతోషానికి కారణం చాక్లెట్ అని పరిశోధకులు స్పష్టం చేస్తున్నారు.



# మద్యంతో మెదడుకు దెబ్బ

టీనేజ్‌లో మద్యానికి అలవాటు పడిన వారిలో కాలక్రమేణా మెదడు పెరుగుదల ఆగిపోతుంది అంటున్నారు ఫిన్‌లాండ్ పరిశోధకులు. సుమారు 62 మంది టీనేజర్ల మీద వీరు పరిశోధనలు నిర్వహించారు. వీరిలో కొందరికి మద్యం తాగే అలవాటు బాగా ఉండగా, మరికొందరికి ఆ అలవాటు కొద్దిగా మాత్రమే ఉంది. వీరందరూ 14 నుంచి 18 సంవత్సరాల మధ్య యువత. కొన్ని సంవత్సరాల అనంతరం వీరి మెదడు పనితీరును పరిశీలించారు. మద్యం అలవాటు బాగా ఉన్న వారిలో మెదడులో ఉండే 'గ్రే మేటర్' అనే పదార్థం తగ్గినట్లు గుర్తించారు. ఈ పదార్థం మెదడును చురుకుగా ఉంచడమే కాకుండా జ్ఞాపకశక్తిని పెంచుతుంది. అదే మందు తాగని వారిలో 'గ్రే మేటర్'లో హెచ్చుతగ్గులు కనిపించలేదు. మద్యం కారణంగానే ఈ పదార్థంలో మార్పులు సంభవిస్తాయన్న విషయం వీరి పరిశోధనల్లో రుజువైంది. పిల్లల అలవాట్ల మీద పెద్దలు ఓ కన్నేసి ఉంచాలనీ, వారిలో మద్యం అలవాటును గుర్తించిన వెంటనే మానిపించే ప్రయత్నం చేయాలని వారు సూచిస్తున్నారు.

# కేరట్ ఎక్కువైతే కష్టమే!



కేరట్ ఆరోగ్యానికి మంచిదన్న ఉద్దేశంతో చాలా మంది ఎక్కువ తీసుకుంటారు. ఇలా ఎక్కువ తీసుకోవడం మంచిది కాదు అన్న విషయం పలు పరిశోధనల్లో రుజువైంది. కేరట్‌ను మామూలుకన్నా ఎక్కువ మోతాదులో తీసుకోవడం వలన అందులో ఉండే కార్బోహైడ్రేట్లు, ఫైబర్ జీర్ణం కాక ఎసిడిటీ సమస్య తలెత్తే ప్రమాదం ఉందని నిపుణులు హెచ్చరిస్తున్నారు. అదే విధంగా షుగర్ వ్యాధిగ్రస్థులు వైద్యుల సలహా లేకుండా కేరట్‌ను ఎక్కువ తీసుకోవడం మంచిది కాదని వారు సూచిస్తున్నారు. కేరట్‌లో షుగర్ శాతం కొద్దిగా ఎక్కువగానే ఉంటుంది. దీని వలన రక్తంలో గ్లూకోజ్ స్థాయి పెరిగి బ్లడ్ షుగర్ వచ్చే అవకాశం ఉందని నిపుణులు చెబుతున్నారు. అదే విధంగా పాలు ఇచ్చే తల్లులు కూడా ఎక్కువగా కేరట్ తీసుకోకూడదనీ మోతాదుకు మించి తీసుకుంటే పాలు కేరట్ ఫ్లేవర్‌లోకి మారే ప్రమాదం ఉందని వారు అంటున్నారు.

# బరువు తగ్గాలంటే...

చిలగడదుంప (స్వీట్ పొటాటో)ను ఉడికించిన నీటిని తాగితే బరువు తగ్గవచ్చు అంటున్నారు జపాన్ పరిశోధకులు. ఇదే విషయం పై 32 ఎలుకల మీద వీరు పరిశోధనలు నిర్వహించారు. వీటికి ప్రతిరోజూ చిలగడదుంప ఉడికించిన నీటిని ఆహారంగా ఇచ్చారు. కొన్ని రోజుల అనంతరం వీటి బరువును పరిశీలించగా అంతకుముందు కన్నా తక్కువ బరువు ఉండడాన్ని పరిశోధకులు గుర్తించారు. ఈ నీటిని తాగిన ఎలుకలు ఆహారాన్ని తక్కువ తీసుకోవడం వీరి దృష్టికి వచ్చింది. ఈ నీరు ఆకలిని మందగించేటట్టు చేస్తుందని, అందుకే వీటి బరువు తగ్గి ఉండవచ్చని పరిశోధకులు అభిప్రాయపడుతున్నారు. మనుషుల మీద కూడా ఇంచుమించు ఇదే ప్రభావం ఉండవచ్చని వారు అంటున్నారు. కేవలం చిలగడదుంప నీటిని తాగితే బరువు తగ్గుతారా? అన్న విషయాన్ని వారు స్పష్టం చేయలేకపోతున్నారు. దీని మీద ఇంకా పరిశోధనలు నిర్వహించాల్సి ఉందని వారు స్పష్టం చేస్తున్నారు.

-అవినాష్



## సరదాగా....

### నా దగ్గరే ఉంది

ఒక పిచ్చాసుపత్రిలో రోగులు ఎక్కువైపోయారు. ఆసుపత్రిలో వైద్యులంతా కలిసి పిచ్చి కొంచెం నయమైనా సరే వారిని డిశ్చార్జి చేద్దామని నిర్ణయించుకున్నారు. రోగులందరికీ ఒక పరీక్ష పెట్టాలనుకున్నారు. అందర్నీ ఒక పెద్దగదిలో కూర్చో బెట్టారు. ఒక డాక్టర్ వెళ్లి గదిలో ఒక పెద్ద బ్లాక్ బోర్డు పైన నిజంగా తలుపేనా అనిపించేలా సుద్దముక్కతో అందంగా ఒక చిత్రం గీశాడు. తర్వాత ఆ డాక్టర్ అందర్నీ ఉద్దేశించి "మీలో ఎవరు వెళ్లి ఆ తలుపు తెరుస్తారో వాళ్లకు మంచి ఐస్‌క్రీం బహుమానంగా దక్కుతుందని" ప్రకటించాడు. అలా చెప్పడమే తరువాయి అందరూ ఒకరితో ఒకరు పోటీపడుతూ వెళ్లి బోర్డు మీద పడసాగారు. డాక్టర్లందరూ ఒక్కసారిగా డీలా పడిపోయారు. కానీ ఒక్క వ్యక్తి మాత్రం కుర్చీలో ఒంటరిగా కూర్చుని మిగతా వాళ్లని చూసి ముసిముసి నవ్వులు నవ్వుతున్నాడు.

డాక్టర్లు "హమ్మయ్య! కనీసం ఒక్కడైనా దొరికాడు, పిచ్చిలేనివాడు" అనుకుని,

ఆ రోగి దగ్గరకు వెళ్లి "ఏం బాబూ! అందరూ ఐస్‌క్రీం కోసం తలుపు తెరవడానికి ప్రయత్నిస్తుంటే నువ్వు మాత్రం తీరిగ్గా కూర్చున్నావు?" అని అడిగాడు ఓ డాక్టర్.

"ఓ అదా, మీకో విషయం తెలుసా! దాని తాళం నాదగ్గరే ఉంది. అది తెలియక పిచ్చి వెధవలు తెగ ఆరాటపడిపోతున్నారు" అని సమాధానమిచ్చాడు ఆ రోగి!!

### ఒక ప్రశ్న?

రామాపురంలో నివసించే ప్రసాద్‌కి మంచి ఉద్యోగం ఉంది. దానికి తోడు అందం, గుణం, తెలివితేటలు అన్నీ ఉన్నాయి. ప్రసాద్‌కి మంచి సంబంధం చూసి పెళ్లిచేయాలనేది తల్లిదండ్రుల కోరిక. తనలాగే తెలివి, అందం ఉన్న అమ్మాయిని చూసి పెళ్లి చేసుకోవాలనేది అతని కోరిక. పెళ్లిచూపులకు వెళ్లినప్పుడు అమ్మాయిని ప్రశ్నలు అడగడం, సమాధానం చెప్పలేని వాళ్లని రిజెక్ట్ చేయడం... ఇదే తంతు! దాంతో అతనికి పెళ్ళి సంబంధం అంటేనే అందరూ బెంబేలెత్తిపోసాగారు. అందరూ అతన్ని పెళ్లికాని ప్రసాద్ అని పిలవడం మొదలుపెట్టారు. ఇలా ఉండగా ఒకరోజు పక్కూరిలో రాధ అనే తెలివి కల అమ్మాయి ఉందని వారికి తెలిసింది. ఓ శుభ ముహూర్తం చూసుకుని పెళ్లిచూపులకు వెళ్లారు. అప్పుడు ప్రసాద్ రాధని సంవత్సరంలో ఒకసారి, వారంలో రెండుసార్లు వచ్చేది ఏమిటి? అని అడిగాడు. తెలివైన రాధ దానికి తగిన సమాధానం చెప్పింది. వారింట్లో పెళ్లిభాజాలు మోగాయి. ఇంతకీ రాధ ఏం సమాధానం చెప్పిందో ఊహించగలరా?

### సమాధానం

పై ప్రశ్నకు సమాధానంగా రాధ బాగా ఆలోచించి ఆంగ్ల అక్షరమైన E అని చెప్పింది. సంవత్సరాన్ని ఇంగ్లీషులో YEAR అంటాం. అందులో ఒక E ఉంది. అలాగే వారాన్ని WEEK అంటాం. అందులో రెండుసార్లు E ఉంది. కాబట్టి ప్రసాద్ అడిగినట్లు సంవత్సరంలో ఒకసారి, వారంలో రెండుసార్లు వచ్చింది కాబట్టి E సరైన సమాధానం అవుతుంది.











# వెట్టి (ది వారియర్)




-మధుబాబు

**పిరికివాడు కాదు శంకరయ్య. దమ్ము ధైర్యం గల మొండి ఘటం. అయినాసరే తన ఎదుట భూతం ఏదో ప్రత్యక్షం అయినట్టు కంగుతిన్నాడు ఒక్కసారిగా. జీవితంలో ఆటుపోట్లు ఎన్నింటినో ఎదుర్కొన్న మనిషి కావటం వల్ల వెంటనే తేరుకున్నాడు. తన తడబాటు బైటికి కనిపించకుండా చాలా నేర్పుగా కప్పి పెట్టేసుకున్నాడు.**

**'వచ్చావా? ఇందాకటినించీ ఆ సంపంగి కోసం అరిచి అరిచి నాలుక తడారిపోయింది. మీ పనోళ్ళకు ఈ మధ్య బుద్ధనేది లేకుండా పోతోంది' అంటూ జేబులో చేయిపెట్టి కరెన్సీ నోట్లు రెండింటిని బైటకు తీశాడు. 'పో పోయి మందు బాటిల్ తీసుకొచ్చి పెట్టు...' అంటూ కింద వెతకటం మొదలు పెట్టాడు.**

'ఏంటి సారూ... వెతుకుతున్నారు?' ఒక అడుగు ముందుకువేసి వినయంగా అడిగాడు బాజిరెడ్డి డ్రైవర్.

'ఇదిగో... ఇక్కడ దాక్కుంది. ఇదే..' అంటూ తాము పుచ్చుకుంటున్నట్టు బిల్డప్ ఇచ్చిన ఖాళీ బాటిల్ని కిందినించి తీశాడు శంకరయ్య.

'ఇదే. ఇదేకావాలి... అర్జంటు' దాన్ని, చేతిలోని నోట్లను ముందుకు జాస్తూ చెప్పాడు.

'ఇది ఫారిన్ బ్రాండు సారు. మన దగ్గర దొరికే సరుకు కాదు' బాటిల్ అందుకుని అటూ ఇటూ తిప్పి చూస్తూ అన్నాడు డ్రైవర్.

'అది కాకపోతే దాని తాతనో, తాతమ్మనో ఏదో ఒక దాన్ని తీసుకురా.. అర్జంటు' రెట్టించాడు శంకరయ్య.

'ప్రణవమ్మతో వచ్చిన అబ్బయ్య ఏమంటాడో.. అసలు కనిపించటం లేదు. ఏడి?' చుట్టూచూస్తూ అడిగాడు డ్రైవర్.

అతను దయ్యం మాదిరి సడన్గా ఎందుకు ప్రత్యక్షమయ్యాడో అర్థం అయిపోయింది శంకరయ్యకి - ఎప్పుడో!

'ఓయ్ అబ్బయ్యా... ఈ మందు మనూళ్ళో దొరకదట. ఇంకోటి తెప్పిస్తున్నా. సరేనా?' బాత్రూమ్ వైపు చూస్తూ బిగ్గరగా అరిచాడు.

'ఎక్కడ ఉన్నాడు? బాత్రూమ్లో ఉన్నాడా? నేను పోయి అడగనా?' అంటూ అటుకేసి కదలబోయాడు బాజిరెడ్డి డ్రైవర్.

గొంతు ఎండుకుపోయినంత పని అయింది శంకరయ్యకి. కూర్చున్న చోటునుంచి లేచి, అతన్ని గుమ్మం కేసి నెట్టాలని అనిపించింది కాని, లేచిన మరుక్షణం తను ఆడుతున్న నాటకం బట్టబయలు అయిపోతుందేమోనన్న అనుమానం కలగటం వల్ల, ఆ పని చేయలేకపోయాడు.

'బాత్రూమ్లో ఎంత సేపు ఉంటావు అబ్బయ్యా... బాజిరెడ్డి సారు డ్రైవర్ వచ్చాడు. నువ్వు ఇంట్లో ఉన్నావో, ఎక్కడికయినా పారిపోయావో చూడటం కోసం అనుకుంటా' నాలుక మడతవేసి నిజమైన తాగుబోతు మాదిరి అరిచాడు.

అడుగు ముందుకు వేయబోతున్న డ్రైవర్ అదిరిపడి, పాదాన్ని వెనక్కి తీసేసుకున్నాడు. 'అవేం మాటలు శంకరయ్యసారూ. నేను చూడటం కోసం రావటం ఏమిటి?' అన్నాడు.

'బైటికి వచ్చి ఈ అయ్యకి కనిపించు అబ్బయ్య. బజారుకు పోయి మందు బాటిల్

### జరిగిన కథ

గూండాల నుంచి తప్పించుకు తిరుగుతూ ఉంటాడు వెట్టి. అతడి అసలు పేరు విఠల్రెడ్డి. అన్యాయాన్ని ఎదిరించినందుకు బాజిరెడ్డి మనుషుల నుంచి తప్పించుకుంటూ, కారణాంతరాలవల్ల వెట్టిగా మారతాడు. ఆ నేపథ్యంలో మళ్ళీ బాజిరెడ్డికి తారసపడిన వెట్టి అతడి పెత్తనాన్ని సవాలు చేస్తాడు. తనని చంపేందుకు ప్రయత్నించిన బాజిరెడ్డి మనుషులని ఆస్పత్రిపాలు చేస్తాడు. దాంతో వెట్టిపై ప్రతీకారేచ్ఛతో రగిలిపోతూ ఉంటాడు బాజిరెడ్డి. వెట్టిని చౌడేశ్వరి ఆలయానికి వెళ్ళి రమ్మంటాడు. శివారెడ్డిని హాస్పిటల్ నుంచి డిశ్చార్జ్ చేస్తారు. పనిమనిషి సంపంగిపై అనుమానమొస్తుంది వెట్టికి. బాజిరెడ్డి డ్రైవర్నీ, సంపంగిని మాయచేసి, గుడికి బయలుదేరతాడు వెట్టి. అక్కడ పిచ్చమ్మి కంగారుపడుతూ ఉంటుంది.

ఆ తర్వాత......

తెచ్చిపెట్టమంటే, మేకు మాదిరిగా నిలబడి ఆరాలు తీస్తున్నాడు. నువ్వు వచ్చి కనిపించకపోతే ఇక్కడి నుంచి కదిలేటట్టు లేడు' అతని మాటలు తనకు వినిపించనట్టు మళ్ళీ అరిచాడు శంకరయ్య.

మరింతగా కంగారుపడిపోయాడు డ్రైవర్. 'అలాంటిది ఏమీలేదు సారు. మీరు చెప్పిన తర్వాత చెయ్యకుండా ఎందుకుంటాను? చతుర్లు వద్దు సారూ... ఇటివ్వండి' అంటూ శంకరయ్య చేతిలో నోట్లను గబుక్కున తీసుకుని గుమ్మంలోకి పోయాడు. కాని అవతలికి మాత్రం కదలలేదు.

అతని అనుమానాలు నివృత్తి కాలేదని తెలిసిపోయింది శంకరయ్యకి. ఏంచేస్తే ఆ గండం నుంచి గట్టెక్కటం జరుగుతుందో ఆలోచించటానికి సిద్ధం అవుతూ ఉండగా - ఆలోచన అయితే సఫలం కాలేదుగాని, గంయ్‌మని మోతలు చేయటం మొదలు పెట్టింది జేబులో ఉన్న ఫోను.

బైటికి తీసి చెవికి ఆనించుకున్నాడు.

'నీకసలు బుద్ధి అనేది ఉందా? అక్కడికి పోయిన తర్వాత నువ్వు ఎక్కడివాడివో మర్చిపోయావా' ఖంగుమంటూ చెవికి చేరింది పెద్దమ్మ కంఠం.

కరెంటు షాక్ కొట్టినట్లు జలదరించింది అతని శరీరం. ఆ షాకులో నుంచే బైటికి వచ్చింది, అప్పుడు ఉన్న డిఫికల్ట్ సిచ్యుయేషన్‌ని ఫేస్ చేసే ఆలోచన.

'ఇస్తున్నా... అబ్బయ్యకే ఇస్తున్నా.. అబ్బయ్యకి కొంచెం మందు ఎక్కువై బాత్‌రూమ్‌లోనే మకాం పెట్టాడు. ఇప్పుడే ఇస్తున్నా' అంటూ ఫోన్‌తో అటుకేసి బయలుదేరాడు.

వాయిస్ రిసీవ్ చేసుకునే ప్రదేశాన్ని అతడి చేతివేళ్ళతో గట్టిగా క్లోజ్‌చేసి మాట్లాడిన సంగతి బాజిరెడ్డి డ్రైవర్‌కి కనిపించలేదు. శంకరయ్య లేచి, తూలుకుంటూ బాత్‌రూమ్ వైపు కదిలిన వెంటనే మటుమాయం అయిపోయింది అతని అనుమానం. గిరుక్కున వెనక్కి తిరిగి బైటికి పరిగెత్తాడు.

గుండెలమీది నుంచి కొండంత బరువు దిగిపోయినట్టు తేలికగా నిట్టూర్చి, వెనక్కి వచ్చాడు శంకరయ్య.

ప్రస్తుతానికి గండం గడిచిపోయింది. అర్జంటుగా పోయి మరింత అర్జంటుగా బాటిల్‌తో తిరిగివస్తాడు అతను. ఈసారి మాత్రం అబ్బయ్యని చూపందే అవతలికి పోడు.

'హల్లో... హల్లో' కరకరమంటూ క్వశ్చన్ చేస్తూనే ఉన్నది పెద్దమ్మ కంఠం.

'క్షమించాలి తల్లీ. చిన్నప్రాబ్లం వచ్చింది. మాట్లాడటానికి లేట్ అయింది' సోఫాలో కూర్చుంటూ సమాధానం ఇచ్చాడు.

'ప్రాబ్లమా? బతుకంతా సమస్యలమయం అయిపోయింది. ఏమిటది?' కోపంగా అడిగింది పెద్దమ్మ.

'అమ్మా....చెప్పకపోవటం దేనికి? చాలాకాలం తర్వాత కొంచెం కక్కుర్తిపడ్డాను. మత్తు ఎక్కువై ఫోను చేతిలో నుంచి జారి కిందపడిపోయింది' చెప్పాడు అతను.

'నేను నమ్మను. నువ్వు నాకు కథలు చెప్పద్దు. సంగతేమిటి?' మరింత కరుకుగా అడిగింది ఆమె.

'తల్లీ.. మీకు చెప్పకూడనివి, చెప్పకుండా దాచుకునేవి ఏమీ ఉండవు. కాని ఇప్పుడు మాత్రం అందుకు సమయం లేదు. చిన్నమ్మ కదిరి స్వామి గుడికి పోయింది.



శివారెడ్డి చాలాకాలం తర్వాత తనంతట తనే కోలుకుంటున్న లక్షణాలు కనిపిస్తున్నాయి. మన వెట్టి ఆయన పాలిట దేవుడు అయ్యాడు తల్లీ..' అంటూ అంతకుముందు జరిగిన సంఘటనల్ని చకచకా వివరించాడు అతను.

'మరి మరి ఆ వీరభోజుడి సంగతేమిటి? వాడు, వాడి కొడుకు..' తన ఆందోళన కొంచెంగా ఉపశమించింది కాబోలు, చిన్నగా అడిగింది పెద్దమ్మ.

'ఇప్పుడు అదే సీను నడుస్తోంది తల్లీ. ఒకటి రెండు రోజుల్లో ఒక కొలిక్కి వచ్చేస్తుంది. విషయం ఏమిటంటే...' అంటూ బాజిరెడ్డికి, వెట్టికి మధ్య జరుగుతున్న రగడ గురించి క్లుప్తంగా వివరించటం మొదలుపెడుతుండగా - రయ్‌మంటూ దూసుకువచ్చింది ప్రత్యూష డ్రైవ్ చేస్తున్న కారు.

సోఫాలోనే కూర్చుని ఉన్న శంకరయ్య ఆ ఇంజన్ శబ్దం వినగానే గుర్తు పట్టేశాడు. 'అదిగో వచ్చేసింది ప్రణవమ్మ. కదిరి స్వామికి పూజలు చేయించి వచ్చేసింది' అంటూ సోఫాలో నుంచి లేచాడు.

'ఇస్తావా.. చిన్నాడికి ఒకసారి ఫోను ఇస్తావా?' ఆశగా అడిగింది పెద్దమ్మ.

అదే మాట ఇంకేదైనా సమయంలో అడిగి ఉంటే ఆఘమేఘాలమీద పోయి ఉండేవాడు అతను. ఇప్పుడు తను పోషిస్తున్న పాత్ర అటువంటి పనులు చేయలేదని తెలుసు కాబట్టి, 'ముందు వాళ్ళు శివారెడ్డి దగ్గరికి పోయి వస్తారు తల్లీ... రాగానే నేను చేయిస్తాను ఫోను' అన్నాడు.

అంతకుముందు తను చెప్పి తీరవలసిన వీరభోజుడి కథను గురించి చెప్పకుండా పోస్ట్‌పోన్ చేసే అవకాశం లభించిందని సంతోషం ఒకపక్క, బాజిరెడ్డి డ్రైవర్ ఇప్పుడు మందు బాటిల్‌తో వచ్చినా కూడా, ఎటువంటి ప్రాబ్లమూ ఉండదన్న హుషారు ఇంకో పక్క - కుదురుగా కూర్చోనీయలేదు అతన్ని. ఫోన్‌ని తనే డిస్కనెక్ట్ చేశాడు. అవసరం అయితే తిరిగి తను మొదలుపెట్టిన నాటకాన్ని వెంటనే కంటిన్యూ చేయటానికి రెడీ అవుతూ, గుమ్మం దగ్గర నిలబడ్డాడు.

•••

తీసుకువచ్చిన స్వామివారి కుంకుమను శివారెడ్డి నుదుట బొట్టుగా పెట్టింది ప్రణవి. ప్రసాదం కూడా చేతిలో పెట్టబోతుండగా - కేర్‌టేకర్స్‌గా వచ్చిన నర్సు, డాక్టరు ఇద్దరూ ఒకేసారి అడ్డుకున్నారు.

'నథింగ్ డూయింగ్ మేడమ్.. కావాలంటే నమస్కారం చేసుకోవచ్చు. మెడికేటెడ్ పదార్థాలు తప్ప ఫారిన్ పార్టికిల్స్ ఏవీ ఇప్పుడు సారు శరీరంలోకి ఎంటర్ కాకూడదు. చదువుకున్న వాళ్ళు మీరు. అర్థం చేసుకోండి' అంటూ వాదించారు.

ఎదిరించలేదు ఎవరూ. కామ్‌గా తలలు ఊపి వెనక్కి జరిగారు.

'వెట్టిని కాస్తంత ఎడ్వాన్సుగా నిద్రలేపి బయలుదేరమని చెప్పండి' మరోసారి అందరికీ గుర్తు చేశాడు శివారెడ్డి.

'అన్నయ్యకి భక్తి ఉంది. కాని ఇంతగా గుర్తు చేసేంతటి భక్తి ఉందని మాత్రం తెలియదు..' ఆ గదిలో నుంచి ఇవతలికి వస్తూ కామెంట్ చేసింది ప్రణవి.

ఆమె పక్క నుంచి నడుము ఊపుకుంటూ అవుట్‌హౌస్ వైపు బయలుదేరిన సంపంగిని మొట్టమొదటగా ప్రత్యూష గమనించింది.

'ప్రణవీ.. ముందు అర్జంటుగా సంపంగిని ఆపాలి' అంటూ హెచ్చరించింది.

'సంపంగీ... ఓయ్ సంపంగి' బిగ్గరగా అరిచింది ప్రణవి.

వెనక్కి తిరిగి చూసింది సంపంగి.

'మజ్జిగ కావాలి.. ఉన్నయ్యా?'

'పెరుగు ఉన్నదమ్మా. కాసిని నీళ్ళుపోసి గిలకరిస్తే సరిపోతుంది కదా' సమాధానం ఇచ్చింది ఆమె.

'సరిపోతుంది. వచ్చి రెండు గ్లాసులు గిలకరించు. మేము వెళ్ళి మా బాబాయ్‌ని, ఆ అబ్బయ్యని పలకరించి కూర్చోబెడతాము. తలకు ఎక్కింది కొంచెమైనా దిగితే కాని తెల్లారుజామున తేలికగా లేవడం కుదరదు' అంటూ అవుట్‌హౌస్ వైపు బయలుదేరింది ప్రణవి.

తల ఊపింది సంపంగి. వెనుతిరిగి కిచెన్‌వైపు వెళ్ళిపోయింది.

●●●

'సారూ, ఈ ఊళ్ళో ఇదే మంచిబ్రాండు. మీరిచ్చిన డబ్బులు చాలలేదు. ఇంకో వెయ్యి అదనంగా ఇవ్వాలి' అంటూ ఖరీదైన బాటిల్‌తో అవుట్‌హౌస్ ద్వారం దగ్గర ప్రత్యక్షమై, సోఫాలో ఉన్న ప్రణవిని చూసి, బ్రేకులు పడినట్టు ఆగిపోయాడు బాజిరెడ్డి డ్రైవరు.

'అర్జంటు పని ఉందని చెప్పి ఇక్కడ మందు బాటిల్స్‌ని మోయటానికి వచ్చావా?' కనులు ఎర్ర చేస్తూ కోరగా అడిగింది ఆమె.

తత్తరపడ్డాడతను. 'అదీ... అదికాదు మేడమ్... అసలు ఏమైందంటే, నేను వెళ్ళి..' అంటూ అర్ధంపర్ధం లేని వివరణలు మొదలుపెట్టేసరికి, అతని చేతుల్లో ఉన్న బాటిల్ తను తీసుకున్నది ప్రత్యూష.

'నీ సంగతి మాకు బాగా తెలుసు. వచ్చిన అతిథులకు తాగబోయించి లేనిపోని రచ్చ చేయించటం మీకు బాగా అలవాటు అయింది' కీచుగా అంటూ ఆ బాటిల్‌ని బయటికి విసిరి కొట్టింది.

'అమ్మా.. అది చాలా ఖరీదు... పగిలిపోతుంది' కంగారుగా చెప్పబోయాడు అతను.

పగలనే పగిలింది బాటిల్. గప్పుమంటూ పైకి లేచింది లిక్కర్ వాసన. నాలుగు పక్కలకు చెల్లాచెదరైనాయి సీసా అవశేషాలు.

'సంపంగి వస్తుంది... శుభ్రం చేయించు' తెరిచిన నోరు తెరిచినట్టుగానే ఉంచి, బొమ్మలా నిలబడిపోయిన అతన్ని హెచ్చరించింది.

'శభాష్ తల్లీ.. ఒకేదెబ్బకు రెండు పిట్టలు.. భలే చేశావు' సోఫాని ప్రణవికి వదిలి ఒక కుర్చీలో తూలుతూ కూర్చున్న శంకరయ్య చిన్నగా మెచ్చుకున్నాడు.

'నువ్వు కుర్చీలో కూర్చుని కనపడితే మళ్ళీ లేనిపోని అనుమానాలు.. పోయి బెడ్‌రూమ్‌లో పడుకో' తండ్రిని హెచ్చరించింది ప్రత్యూష.

శంకరయ్య కుర్చీలో నుంచి లేవకముందే మజ్జిగ గ్లాసులతో ప్రత్యక్షం అయింది సంపంగి. నువ్వు ఆ బాటిల్ ముక్కలు శుభ్రం చెయ్" అంటూ గుమ్మంలో ఉండగానే ఆ గ్లాసుల్ని తాను తీసుకుంది ప్రత్యూష.

ప్రణవి తీవ్రంగా చూసింది శంకరయ్య వంక. ఆకలితో నకనకలాడిపోతున్నాడు అతను. కూతురు చేతిలో నుంచి గ్లాసు అందుకోవటానికి ఆత్రంగా లేవబోతున్నాడు. ఆమె చూపు దెబ్బకి ఎలా ఉన్న వాడు అలాగే బిగుసుకుపోయాడు.

'అందుకే చెప్పారు నీ వంటి పెద్దవాళ్ళు. ఏదైనా ఒక ఆలోచన చేసేటప్పుడు అందుకు సంబంధించిన వాళ్ళందర్నీ కలుపుకుని పోవాలని. బలవంతంగా పంపించేశారు నన్ను, పొద్దున. అలా పంపించకుండా ఉంటే- ఇప్పుడు ఎదురవుతున్న ఈ ఇబ్బందులన్నీ లెక్కలోకి వచ్చేసేవి. పరిష్కారం కూడా అప్పుడే కుదిరిపోయి ఉండేది' తనకు ఇష్టం లేకపోయినా పొద్దస్తమానం తమ చుట్టూ తిరగవద్దని అవుట్‌హౌస్‌లో నుంచి పంపించేసిన సన్నివేశాన్ని గుర్తుచేసి, శంకరయ్య మొఖం చిన్నబోయిన తర్వాత, తనే స్వయంగా మజ్జిగ గ్లాసును అందించింది ఆమె.

రెండో గ్లాసు కూడా ఇచ్చింది ప్రత్యూష. అతను ఆత్రంగా ఖాళీ చేయగానే ఖాళీ గ్లాసులను పట్టుకుని గుమ్మం దగ్గర నిలబడింది.

పావుగంట తర్వాత పని పూర్తిచేసి చేతుల్ని పమిటె చెంగుకు తుడుచుకుంటూ వచ్చింది సంపంగి.

'బాటిల్‌కి ఇంకా ఇవ్వాల్సిన డబ్బులు రేపు పొద్దున్నే ఇస్తామని అతనికి చెప్పు' దూరంగా నిలబడిన డ్రైవర్‌కి వినబడేలా చెప్పి గ్లాసుల్ని అందించింది ఆమె. 'పంతులుగారు అమ్మగారి దగ్గరే ఉన్నారు. రమ్మని చెప్పు. మాకు ఆకలి దంచేస్తోంది. ఆయన్ని వాళ్ళకి కాపలా పెట్టాలి' అని కూడా చెప్పింది.

'మరి వాళ్ళకి?' తలతోనే లోపలికి చూపిస్తూ అడిగింది సంపంగి.

'తాగిన మజ్జిగే బైటికి వచ్చేటట్టుంది. ఇంక తిండి ఎక్కడ ఎక్కుతుంది?' ఎదురు ప్రశ్న వేసింది ఆమె.

ఆ హెచ్చరికను వెంటనే అర్ధం చేసుకున్నాడు శంకరయ్య. పరమ వికారంగా మొఖం పెట్టి భయంకరంగా శబ్దం చేశాడు, వాంతి వస్తున్నట్టు.

'తట్టుకోలేని వాళ్ళు తాగి తూలటం దేనికో నాకయితే అర్ధం కావటం లేదు' తనలో తనే గొణుగుకుంటూ వెళ్ళిపోయింది సంపంగి.

మెరుస్తున్న కనులతో ఒకరివంక ఒకరు చూసుకుంటున్న బిడ్డల వంక తను కూడా సగర్వంగా చూశాడు శంకరయ్య.

**బుల్లెట్ బండి మీద చౌడేశ్వరి ఆలయానికి చేరుకున్నాడు వెట్టి. చిమ్మచీకటి. చుట్టూ పరికించి చూశాడు. ఎటు వెళ్ళాలా అని ఆలోచిస్తుండగానే, ఎండుటాకుల మీద బరబరమనే శబ్దం వినిపించింది. ఏదో స్ఫురించి వెంటనే అప్రమత్తమయ్యాడు వెట్టి. చెట్టుచాటున నక్కాడు. రెండు వాహనాలు కొంచెం ముందుకు వెళ్ళి ఆగాయి. అందులో నుంచి ఒకరి వెనుక ఒకరు దిగారు కండలు పెంచిన వీరులు. ఆఖరున దిగిన వ్యక్తిని చూడగానే అప్రయత్నంగా వెట్టి పిడికిళ్ళు బిగుసుకున్నాయి. ఆ దిగిన వ్యక్తి ఎవరు? వాళ్ళందరూ అక్కడికెందుకొచ్చారు?**

●●●

బిజీగా ఉండే రోడ్లమీద ఎటువంటి వెహికల్ అయినా అరవైని మించి వేగంగా నడపటం కష్టం. ఎవరూ కనిపించని ప్రదేశాల్లో అయితే వందకు కొంచెం అటు ఇటుగా మేనేజ్ చేయవచ్చు.

సాధారణంగా నూట పదికి మించని బుల్లెట్‌ని యకాయకీన నూట ముప్ఫయ్‌కి తీసుకుపోయాడు వెట్టి. తుపాకీ తూటాలు పేలినట్టు టప్పుటప్పుమని అది చేస్తున్న శబ్దాన్ని వింటూ, కళ్ళ వెంట నీళ్ళను తెప్పిస్తున్న గాలిని ఎంజాయ్‌చేస్తూ, నరమానవుడు కనిపించని ఆ అడవి రోడ్డు మీద అతి వేగంగా ప్రయాణం చేశాడు.

మిణుకుమిణుకుమంటూ వెలుగు కనిపించిన తర్వాత స్లో అయింది బండి. మరో అర కిలోమీటరు పోయిన తర్వాత పూర్తిగా ఆగింది.

ఇంజన్ ఆఫ్ చేసి, బండి రోడ్డు పక్కనే ఒక చెట్టు చాటుకు నెట్టాడు అతను. కదిరిలో రిక్షా ఎక్కక ముందు పర్చేజ్ చేసిన సిగరెట్ పాకెట్‌లో నుంచి సిగరెట్ తీసి వెలిగించుకున్నాడు. అది పూర్తి అయ్యేసరికి సర్దుకుంది, టూవీలర్ మీద వేగంగా రావటం వల్ల అతనిలో అడుగు పెట్టిన అదో రకమైన ఎగ్జయిట్‌మెంటు.

సిగరెట్ కిందపడేసి కాలిమడమతో మట్టిలోకి నెట్టేశాడు. పాంటు జేబుల్లో చేతులు పెట్టుకుని ముందుకు బయలుదేరాడు.

రోడ్డు దిగి రెండువందల గజాల దూరం పోయిన తర్వాత కనిపిస్తుందిట, ఎప్పుడు కట్టబడిందో ఎవరికీ సరిగ్గా తెలియని ఆ చౌడేశ్వరి ఆలయం. నాగదేవత రూపంలో దర్శనం ఇస్తుందిట అమ్మవారు. ఆలయం చుట్టూ ఉండే పుట్టలను డిస్టర్బ్ చేయరట ఎవరూ!

'నిజమైన భక్తులు ఎవరైనా వస్తే నిజంగానే ఎదుట ప్రత్యక్షం అవుతుందిట పెద్ద నాగుపాము. కోరిన కోరికలు తీరుతాయట. జీవితం సుఖమయం అయిపోతుందిట.. పిల్లాపాపలతో కుటుంబం చల్లగా ఉంటుందిట' గుడిగురించి చెపుతున్నప్పుడు అన్నాడు రమణయ్యపంతులు.

వెంటనే వచ్చింది అప్పుడు వెట్టికి ఒక పెద్ద అనుమానం.

'శివారెడ్డి సారు నాన్నగారికి ఈ దేవత అంటే వల్లమాలిన భక్తి అన్నారు. బాగానే ఉంది. మరి ఆయన కుటుంబం పరిస్థితి ఇలా తయారవటమేమిటి?'

గట్టిగా నిట్టూర్చి భుజం మీది పైపంచెతో ముఖం తుడుచుకున్నాడు పంతులుగారు. నాకు



కూడా అదే అనుమానం వచ్చింది అబ్బాయ్యా. సమాధానం మాత్రం లభించలేదు' అన్నాడు.

'మీరు గట్టిగా ప్రయత్నించలేదు. ప్రయత్నించి ఉంటే తప్పకుండా ఏదో ఒకటి తెలిసి ఉండేది' అన్నాడు వెట్టి.

'ప్రయత్నాలకు పురిటిలోనే సంధి కొట్టేసింది అబ్బాయ్యా. ఆ బాజిరెడ్డి మూలంగా నేను ఎక్కడికీ కదలలేక పోయాను. శివారెడ్డి నాన్నగారితో కలిసి ఎన్నోసార్లు గుడికి వెళ్ళాలని ప్రయత్నం చేశాను. వాడు పడనిచ్చేవాడు కాదు. అందరికంటే ముందుగా తానే తయారయ్యేవాడు' కచ్చగా అన్నాడు పంతులుగారు.

'ఆయన పోయిన తర్వాతయినా అక్కడికి వెళ్ళ లేదా?' అడిగాడు వెట్టి.

'ఒకసారి కాదు. కనీసం వందసార్లయినా వెళ్ళి ఉంటాను. గుడి, గుడి చుట్టూ ఉన్న పుట్టలు తప్ప నాకు ఏమీ కనిపించలేదు. అందరూ చెప్పుకునే ఆ నాగుపాము వాసన కూడా తగలలేదు' చెప్పాడు ఆయన.

రోడ్డు పక్కనే గుడికి దారితీసే కంకరరోడ్డు లీలగా కనిపించేసరికి అంతం అయిపోయాయి వెట్టి ఆలోచనలు. ఒకసారి చుట్టూచూసి ఆ రోడ్డు మీద కాలు పెట్టబోతుండగా అతని చెవులకు చేరింది బరబరమని ఎండు తాటాకును కిందపడేసి ఈడుస్తున్న శబ్దం.

ముందుకు వేయబోతున్న పాదాన్ని చటుక్కున వెనక్కి తీసేసుకుని, కనులు చిట్లించి చూశాడు అతను.

మూడు బారల దూరంలో కనిపించింది, పడగెత్తి మెలికలు తిరుగుతూ కంకర రోడ్డును క్రాస్ చేసి అవతలి పక్కకు పోతున్న ఆ పాము.

గుబగుబలాడటం మొదలు పెట్టాయి అతని గుండెలు. రోడ్డుకు అడ్డంగా కనిపించిందంటే తన రాకకు సంతోషిస్తున్నట్టా, లేక రావద్దని హెచ్చరిస్తున్నట్టా??

రెండు... రెండంటే రెండు నిమిషాలు అలాగే కదలకుండా నిలబడిపోయాడు అతను. ఏం చేయాలో అతను నిశ్చయించుకోక ముందే, అతను వచ్చిన దిశలో సుస్పష్టంగా కనిపించింది ఒక వెలుగు.

జీపు కారు వంటి వెహికల్ ఏదో వేగంగా వస్తున్న శబ్దం కూడా వినవచ్చింది.

ఏం చేయాలో నిర్ణయించుకునే అవకాశం తనకు లేదని అర్థమై, వేగంగా కదిలాడు అతను. కంకరరోడ్డు మీద పది అడుగుల దూరం పోయి, పక్కనే ఉన్న ఒక పెద్ద చింతచెట్టు చాటున నిలుచున్నాడు.

చూస్తూ ఉండగానే దగ్గరికి వచ్చేసింది అతను గమనించిన వెహికల్. కీచుధ్వనులు చేస్తూ సరిగ్గా కంకరరోడ్డు దగ్గరే ఆగింది.

'తీసుకుపోయి దూరంగా నిలబెట్టండి. గుడి దగ్గరికి వచ్చేవాళ్ళకి ఎవరికీ కనిపించకూడదు. మనం ఇక్కడికి వచ్చామని తెలియకూడదు' అంటూ ముందు సీట్లో నుంచి దిగాడు పఠాన్.

బిగుసుకున్నాయి వెట్టి పిడికిళ్ళు. దవడలు టైట్ అయిపోయాయి. వేడిగా వెలువడటం మొదలు పెట్టింది నాశికాపుటాల నుంచి వెలువడుతున్న గాలి. తనకు తెలియకుండానే అడుగు ముందుకు వేయబోయాడు.

ఛట్‌మంటూ కళ్ళ ముందు మెదిలింది పిచ్చమ్మి స్వరూపం. రమణయ్యపంతులుగారికి ఆమె చెప్పి పంపించిన మాటలు ఢంకా దెబ్బల మాదిరి చెవుల్లో మార్మోగాయి.

మాట ఇచ్చాడు తను, ఆమె అనుమతి లేకుండా అవతలికి పోవటం జరగదని. ఇప్పుడు పఠాన్‌మీద కలబడితే, అవతలికే పోవాల్సి వస్తుంది. పట్టుబడి పోలీసుల దగ్గరికో, లేక దూరంగా పారిపోవటమో ఏదో ఒకటి చేయక తప్పదు.

పెద్దగా పరిచయం లేని మనిషికి ఇచ్చిన మాట గౌరవించేందుకు తన గుండెల్ని పిండేస్తున్న పగను పక్కకు పెట్టాల్సి రావటం - బాధగానే అనిపించినా, అడుగు ముందుకు వేయాలన్న కోరికను బలవంతంగా అదుముకుని, కదలకుండా ఉండిపోయాడు.

'రండి.. త్వరగా రండి.. తెల్లవారేలోపు మనకు సరయిన స్పాట్‌ని వెతికి సిద్ధంగా ఉండాలి' అంటూ గుడి దగ్గరకి బయలుదేరాడు పఠాన్.

ఒకరి వెనుక ఒకరుగా పదిమంది అజానుబాహులు వెహికల్ వెనుక భాగంలో నుంచి కిందికి దూకి, అతన్ని అనుసరించారు. నక్షత్రాల వెలుగుతప్ప మరేవిధమైన కాంతీ లేకపోయినా, స్పష్టంగానే కనిపించాయి వెట్టికి వారి చేతుల్లో ఉన్న ఆయుధాలు.

అవేమీ అతన్ని ఆశ్చర్యానికి గురి చేయలేదు. అందరికంటే ఆఖర్లో నడుస్తున్న ఒక మనిషి దగ్గర ఎటువంటి ఆయుధమూ లేదు. సన్నగా ఉన్నాడు. చకచకా అడుగులు వేస్తున్నాడు.

కనులు చిట్లించి చూస్తున్న వెట్టి ఒళ్ళు ఝల్లుమన్నది. ఒక్కసారిగా హైపిచ్‌కి వెళ్ళి పోయింది అతని బ్లడ్‌ప్రెజర్.

బసవప్ప!

కాలికి తగిలిన దెబ్బకు ట్రీట్‌మెంట్ తీసుకోవటానికి వెళ్ళిన తనను నేర్పుగా పట్టి తీసుకుపోయిన గ్రానైట్‌మైన్స్ లేబర్ ప్రొక్యూరర్.

చెమటలు ప్రత్యక్షం అయ్యాయి వెట్టి ముఖం మీద. వేడిగాలులు నాశికారంధ్రాలలో నుంచే కాదు, ఈసారి చెవుల్లో నుంచి కూడా వెలుపలికి వస్తున్న అనుభూతి కలగటం మొదలయింది.

తను పతనమైపోవటానికి కారకులైన వాళ్ళలో ఇద్దరు ఇంపార్టెంట్ పర్సన్స్ కళ్ళ ఎదుట ఒకేసారి ప్రత్యక్షం అయ్యారు. అంతకంటే మంచి అవకాశం మరోమారు లభించదుగాక లభించదు. ఆలస్యం చేయటం అనవసరం.

పిడికిళ్ళు పాంటుకేసి రుద్దుకుంటూ ముందుకు అడుగు వేయబోయిన అతని ముఖానికి మూడు అడుగుల దూరంలో, కిందికి వంగి ఉన్న ఒక కొమ్మ మీది నుంచి జర్రున జారి దబ్బుమని శబ్దం చేసింది - ఒక పాము.

పడిన వెంటనే పడగ పైకెత్తి మిటుకుమిటుకుమంటూ అతనికేసి చూసి, అర్జంటుగా పక్కనే ఉన్న పొదల్లో దూరి మాయమైపోయింది.

'చూడండిరా.. ఆ చప్పుడేమిటో చూడండి' ఎక్కడివాడక్కడ ఆగిపోయి చిన్నగా ఆర్డర్ ఇచ్చాడు పఠాన్.

ఒకేసారి వెనక్కి తిరిగారు అతన్ని అనుసరిస్తున్న వారందరూ. పాము కిందపడి అతని అటెన్షన్‌ని డైవర్ట్ చేసి ఉండకపోతే, రోడ్డుమీదికి వెళ్ళిపోయి ఉండేవాడు వెట్టి. ఆ ఒక్కక్షణం డిలే అతని ఆవేశాన్ని అదుపు చేసేసింది. అతన్లోని జాగ్రత్తను ఎలర్ట్ చేసింది.

పదిమంది ఉన్నారు వాళ్ళు. పఠాన్‌తో కలిపి పదకొండు. ఎంతమందిని పడగొట్టగలడు? ఎంతమందిని తల్లక్రిందులు చేసినా, పఠాన్‌మీద చేతులు వేయగలడా? వాడు, ఆ బసవప్ప... ఇద్దరూ దూరంగా పరి

## మళ్ళీ తగ్గుతోంది

నయన సినిమాల్లోకి వచ్చిన కొత్తల్లో కాస్త బొద్దుగా ఉండేది. ఆ బొద్దుతనం టాలీవుడ్‌కి అస్సలు నచ్చలేదు. దాంతో అవకాశాలు వెనక్కి వెళ్ళడం మొదలెట్టాయి. ఈ సంగతిని త్వరగానే గ్రహించిన నయన యుద్ధప్రాతిపదికన బరువు తగ్గి సన్నగా మారిపోయింది. నిన్న మొన్నటి వరకూ సన్నగానే ఉన్న నయన ఇప్పుడొక సినిమా కోసం జీరో సైజుకి ప్రయత్నిస్తోందట! కాకపోతే ఆపరేషన్లతో కాకుండా కేరళ వైద్యాన్ని ఆశ్రయించిందట! తన జీరో సైజుతో ఎలాంటి ఇబ్బందులూ రావని నయన గట్టిగా చెబుతోందట కూడా! సెకండ్ ఇన్నింగ్స్‌లో అవకాశాలు రావడమే గగనం అయితే వరుసగా అవకాశాలు అందిపుచ్చుకుంటూ సినిమా కోసం ఎలా కావాలంటే అలా తయారవుతోంది. నయనలో ఉన్న ఈ అంకిత భావమే ఆమెకు అవకాశాలు ఇప్పిస్తున్నాయి అంటున్నారు సినీజనాలు.



గెత్తితే?

బిగపట్టి ఉంచిన ఊపిరిని బైటికి వదిలేస్తూ, చెట్టు దగ్గరికి వస్తున్నవారిని చూసి, బుస్సున ఒక శబ్దం చేశాడు.

తన మానాన తాను తన పని చూసుకుంటున్న కోడెనాగు, అనవసరంగా తనను డిస్టర్బ్ చేసేవారిని చూసి, హెచ్చరించేందుకు చేసే శబ్దం మాదిరి ఉన్నది అది.

చకచకా వస్తున్న వారందరినీ వెంటనే ఆపేశాడు వారిలో ఒకతను.

'ఏంట్రా? ఏమయింది?' అసహనంగా వినవచ్చింది పఠాన్ కంఠం.

'పాము ఏదో ఉంది సారూ. బుసకొడుతోంది. బహుశా చెట్టు మీది నుంచి కిందపడి ఉంటుంది' అన్నాడు అతను, అంతకుముందు వినవచ్చిన శబ్దానికి అర్థం చెపుతూ.

'నిజమే సారూ... ఇది చౌడేశ్వరి గుడి. ఇక్కడి పాముల జోలికి పోవటం మంచిది కాదు' దేవుడి మీద, దైవశక్తులమీద నమ్మకం ఎక్కువ కాబోలు, తాను కూడా ఆ మాటలు బలపరిచాడు బసవప్ప.

'సరేసరే - వచ్చేయండి' విసుగ్గా అంటూ మళ్ళీ నడక మొదలుపెట్టాడు పఠాన్.

ఒకటి నుంచి వందవరకూ లెక్కబెట్టి, వాళ్ళు వెళ్ళిన దిశలోనే తను కూడా అడుగులు వేశాడు వెట్టి.

●●●

సరిగ్గా నాలుగు గంటలు అవుతుండగా, బెడ్ మీద లేచి కూర్చున్నాడు శివారెడ్డి. కునికిపాట్లు పడుతున్నారు ఆ గదిలోనే కుర్చీల్లో ఉన్న నర్సు, ఆమెతో పాటుగా వచ్చిన డాక్టరు' ఏమైంది సార్? ఏం కావాలి??' గబగబా లేచి బెడ్ దగ్గరికి పోతూ అడిగారు.

శివారెడ్డి సమాధానం చెప్పకముందే పక్కగదిలో నుంచి వచ్చింది అతని భార్య. 'వెట్టి నిద్ర లేచాడో లేదో చూడాలి. పంతులుగారు ఇంటికి వెళ్ళిపోయారా?' ఆమెను అడిగాడు శివారెడ్డి,

'నేను కనుక్కుంటాను. మీరు ఆత్రపడకండి. వెట్టిని నేను లేపించి, ప్రయాణం చేయిస్తాను' అంటూ అతనికి చెప్పి, ఆ గదిలోనుంచి ఇవతలికి వచ్చింది ఆమె.

నిద్ర కళ్ళు నులుముకుంటూ ఆమె ఎదుట ప్రత్యక్షమైంది సంపంగి.

'పోయి అబ్బయ్యను రెడీ అవమని చెప్పు. కాఫీనో, టీనో తీసుకుపో' ఆర్డర్ ఇచ్చింది శివారెడ్డి భార్య,

వంట ఇంట్లోకి పోయి రెండు నిమిషాల్లో కాఫీ రెడీ చేసింది సంపంగి. సెగలు వెలువరిస్తున్న కప్పు ట్రేలో పెట్టుకుని అవుట్‌హౌస్ వైపు నడిచింది.

తెరిచే ఉన్నాయి తలుపులు. సోఫాలో కూర్చుని ఏదో మాట్లాడుకుంటున్నారు రమణయ్య పంతులుగారు, శంకరయ్య.

'అబ్బయ్యని-' అంటూ చెప్పబోయిన సంపంగిని మధ్యలోనే అడ్డుకున్నాడు రమణయ్యపంతులు. 'ఇంతకుముందే బయలుదేరి వెళ్ళిపోయాడు' అని చెప్పాడు.

'కారు తీసుకుపోలేదా?' భుజం మీది నుంచి వెనక్కి చూస్తూ అడిగింది ఆమె.

'నిన్న బాగా పుచ్చుకున్నాడు కదా.. మత్తు పూర్తిగా దిగలే... కార్లో వెళితే కళ్ళు మూతలు పడతాయని మోటార్ బైకు మీద పోయాడు. నాకు తెలిసినవాళ్ళ బండి తెప్పించి ఇచ్చా' వివరాలు ఆమె అడగకపోయినా సవివరంగా చెప్పాడు పంతులుగారు.

తను తీసుకువచ్చిన కాఫీ కప్పును టీపాయ్ మీద పెట్టి, అంతకుముందు రోజు అక్కడ పెట్టబట్టిన చద్ది పదార్థాలన్నిటినీ ట్రేలో పెట్టుకుని వెనుతిరిగింది.

'నోరు తెరిచి చిన్నపాటి శబ్దం కూడా చెయ్యలేదు. మన సమాధానం సరిగ్గానే ఉందంటారా పంతులుగారూ?' మెల్లిగా అడిగాడు శంకరయ్య.

'చెప్పేశాము. ఒక పని అయిపోయింది. సరిగ్గా ఉన్నా లేకపోయినా ఇప్పుడు చేయగలిగింది ఏమీ లేదు' అంటూ సంపంగి తెచ్చిన కప్పులో కాఫీని సాసర్‌లో సగం పోసి అతనికి అందించి, మిగిలిన సగం తాను పుచ్చుకోవటం మొదలుపెట్టాడు పంతులుగారు.

●●●

నిట్టనిలువుగా ఉన్న రాజగోపురానికి వంద అడుగుల దూరంలో భక్తుల కోసం ఏర్పాటుచేసిన రేకుల షెడ్లో, సిమెంట్ బెంచీల మీద కూర్చున్నారు పఠాన్, అతని అనుచరగణం.

'తెల్లవారటానికి ఇంకా చాలా టైము ఉంది. ఎందుకైనా మంచిది మనవాళ్ళు ఇద్దరిని రోడ్డుమీద నిలబెడదాం' అంటున్న బసవప్పని ఆగమని సైగ చేసి, పాంటు జేబులో నుంచి ఫోన్‌ని బయటికి తీశాడు పఠాన్.

'అయ్యగారూ.. నేను సంపంగిని మాట్లాడుతున్నాను' స్పష్టంగా వినవచ్చింది మాట.

'చెప్పు సంపంగీ... వాడు బయలుదేరి ఎంతసేపు అయింది?' అడిగాడు పఠాన్.

'సరిగ్గా మూడున్నర టైములో బయలుదేరాడు. కారులో రావటం లేదు. మోటార్ బైకు మీద వస్తున్నాడు. నిన్న తాగింది ఇంకా దిగలేదట. మత్తుమత్తుగానే ఉందిట' చెప్పింది సంపంగి.

'నీకు ఎలా తెలిసింది? తాను నీకు చెప్పాడా?' విసురుగా అడిగాడు పఠాన్.

'రమణయ్యపంతులుగారు చెప్పాడు. ఆయనే తనకు తెలిసిన వాళ్ళ బండిని తెప్పించి ఇచ్చాడట'.

'సరే... నువ్వుపెట్టేయ్' అంటూ ఫోన్‌ని కిందికి దించి బసవప్ప వైపు చూశాడు పఠాన్.

'నా అనుమానం నిజమే అయి ఉంటుందని అనిపిస్తోంది. మా ఉచ్చులో నుంచి తప్పించుకున్న సన్నాసికి కూడా మోటార్ బైకులంటే మహా ఇష్టం. పందెపు గుర్రం లాంటి బుల్లెట్ బండిని మెయింటైన్ చేసేవాడు' గడ్డిపరక నొకదాన్ని నములుతూ చెప్పాడు బసవప్ప.

'వాడు... ఆ విఠల్‌రెడ్డి దగ్గర ఉండే బుల్లెట్‌ని నువ్వు చూశావా?' అడిగాడు పఠాన్.

చిన్నగా నవ్వాడు బసవప్ప. 'చూడటమేమిటి సారూ? వాడిని వాడితోపాటుగా రూమ్‌కిపోయి వాడి బండిని కూడా పట్టేసుకున్నాము. నంద్యాలలో అమ్మేశాను. ఎనభై వేలు వచ్చింది' అన్నాడు.

రేకులషెడ్ వెనుక భాగంలో ఉన్న బండరాయి మీద కూర్చొని ఉన్న వెట్టి ఒంట్లోని రక్తం మళ్ళీ సలసలమని మరగటం మొదలయింది.

తను గుడికి వచ్చి లోపల ఉన్న దేవతకు పూజ చేయించేలోపు చుట్టుముట్టి కాళ్ళు చేతులు విరగదీసి బసవప్పకి అప్పచెప్పటమే బాజిరెడ్డి ప్లాను. అందులో ఎటువంటి సందేహం లేదు.

ప్రణవిగాని, శివారెడ్డిగాని ఎవరైనా అడిగితే, తనకేమీ తెలియదని చెప్పటమే అతని లక్ష్యం. ఆ విషయం తేటతెల్లం అయిపోయిన తర్వాత తను ఇంకా వెయిట్ చేయవలసిన అవసరం ఏముంది? ఎవరెవరు ఎక్కడెక్కడ కూర్చొని ఉన్నారో తనకు తెలిసిపోయింది. ఎవరి దగ్గర ఎటువంటి ఆయుధాలు ఉన్నాయో కూడా బట్టబయలు అయింది. వెలుగు రాకముందే చీకటిని ఆసరాగా చేసుకుని వాళ్ళని మర్దించేస్తే ఒక పని అయిపోతుంది కదా.

ఆలోచించిన కొద్దీ మహా పసందుగా ఉంది ఆ ప్లాను అనిపించి, అధికమైపోయింది అతని ఉత్సాహం.

ఒకే ఒక కరెంటు బల్బు, గుడ్డిగా వెలుగుతున్నది షెడ్ లోపల. నేలను తడిమి, ఒక లావుపాటి రాయిని అందుకున్నాడు అతను. హాస్పిటల్ దగ్గర లైటును పగలగొట్టి రెచ్చిపోయినట్లే ఇప్పుడు కూడా వాళ్ళమీద విరుచుకు పడాలని అనుకుంటూ గుండెల నిండా గాలి పీల్చుకున్నాడు.

చేతిని పైకెత్తి షెడ్ ముందుభాగంలో వెలుగుతున్న బల్బు కేసి గురి చూడబోతుండగా - చిన్న శబ్దంతో యాక్టివేట్ అయింది పఠాన్ దగ్గర ఉన్న ఫోను.

'అరెరే.. నాగులు ఫోన్ చేస్తున్నాడు. ఈ టైములో వాడికి నాతో పనేమిటి?' అంటూ లేచి ఫోన్ చెవికి ఆనించుకుంటూ షెడ్‌లో నుంచి బయటికి పోయాడు పఠాన్.

**(ఇంకా వుంది)**






డా॥ జి. సతీష్ రెడ్డి
MS. M.Ch. (Ortho) (UK)
Orthopedics & Joint Replacement Specialist
ప్రైమ్ హాస్పిటల్స్, హైదరాబాద్
ఫోన్. 98495 63360 / 040-4959 4959


# భుజం కీలుకు మెరుగైన చికిత్సా విధానాలు

## రొటేటర్ కఫ్ సమస్యను ముందుగా గుర్తిస్తే ముప్పు తక్కువ

మన బరువునంతా కాళ్లు మోస్తే... మన బాధ్యతలన్నీ భుజాలు మోస్తాయి. భుజం పని చేయకపోతే అసలు ఏ పనీ జరుగదు. ఎవరికైనా బాధ్యతలు అప్పగించాలంటే అవి వారి భుజస్కంధాలపై పెడుతున్నామంటారు. ఎవరైనా నమ్మకస్తులు, దగ్గరి వారు దూరమైతే భుజం విరిగినట్లయిందంటారు. ఇంతటి ప్రధానమైన భుజానికి ఏదైనా సమస్య తలెత్తితే ఎన్నో పనులు వెనుకబడిపోతాయి.




### భుజం కీలే కీలకం

మన శరీరంలో రకరకాల కీళ్లు ఉన్నాయి. అవి కొన్ని అవయవాల కదలికలకు తోడ్పడుతుంటాయి. కీళ్లన్నింటిలోకి ఎక్కువగా కదిలేది భుజం కీలు. చేతుల కదలికల్లో భుజం కీలుదే కీలక పాత్ర. దాదాపుగా మనం చేతులతో చేసే ప్రతి పనిలోనూ భుజం కీలును ఉపయోగించాల్సి ఉంటుంది. ప్రస్తుతం పెద్ద వారిలో రొటేటర్ కఫ్ సమస్య సాధారణంగా మారింది. ఈ సమస్య ప్రారంభమైతే రోజువారీ పనులన్నీ కష్టమవుతాయి. తల దువ్వుకునే సమయంలో.బట్టలు వేసుకునే సమయంలో నొప్పి వస్తుంటుంది

### భుజం నిర్మాణం

భుజం అనేది బంతి గిన్నె ఆకారంలో ఉండే కీలు. ఇది మూడు ఎముకలతో తయారై ఉంటుంది.అవి అప్పర్ ఆర్మ్ బోన్ (హుమెరస్), షోల్డర్ బోన్ బ్లేడ్ (స్కపుల), కాలర్ బోన్ (క్లావికల్),బాలు, సాంకేట్ జాయింట్‌తో భుజం నిర్మితమై ఉంటుంది. రొటేటర్ కఫ్‌తో షోల్డర్ సాకెట్ చేయి ఉంచబడుతుంది. రొటేటర్ కఫ్ అనేది నాలుగు కండరాల సముదాయం. ఈ కండరాలు భుజం కదిలేందుకు సహాయపడతాయి. ఇది షోల్డర్ బ్లేడ్‌కు హుమెరస్‌కు జోడించబడి ఉంటుంది.

### రొటేటర్ కఫ్‌కు ఎందుకంత ప్రాధాన్యం

భుజంలో రొటేటర్ కఫ్ ముఖ్యమైనది. భుజం కీలును జాగ్రత్తగా పట్టి ఉంచడానికిరొటేటర్ కఫ్ కండరాలు, టెండాన్స్ కలిసి ఉంటుంది. ఇది దెబ్బ తింటే భుజం కీలు పని చేయదు.

### కారణాలు

దెబ్బలు తగలడం, ప్రమాదాలకు గురికావడం వల్ల రొటేటర్ కఫ్ సమస్య ఉత్పన్నం కావచ్చు. కాలర్ బోన్ విరిగిపోవడం, డిస్‌లొకేటెడ్ షోల్డర్ వంటి భుజం గాయాల వల్ల ఈ సమస్య తలెత్తవచ్చు. ఎటువంటి గాయం కాకపోయినా వయసు పెరిగే కొద్దీ భుజం కండరాలు దెబ్బతినవచ్చు. కాబట్టి పెద్ద వారిలో ఈ సమస్య ఎక్కువగా కనిపిస్తుంది. కండరాలు బలహీనం కావడం వల్ల భుజం కదిలించినప్పుడల్లా నొప్పితో బాధపడతారు. ఒక భుజంలో సమస్య ఉత్పన్నమైతే మరో భుజంలో నొప్పి లేకపోయినా కూడా ఈ సమస్య ఉత్పన్నమయ్యే అవకాశాలు ఎక్కువగా ఉంటాయి. ఒత్తిడి, రక్తప్రసరణ తగ్గడం, బోన్ స్పర్స్ వంటి కారణాల వల్ల కూడా రోటేటర్ కఫ్ సమస్య ఉత్పన్నం కావచ్చు.




### లక్షణాలు

- విశ్రాంతి సమయంలో, రాత్రి సమయాలలో భుజం నొప్పి రావడం
- నిర్దిష్టమైన కదలికలు చేస్తున్న సమయంలో నొప్పి వస్తుండటం
- చేయి తిప్పుతున్న సమయంలో బలహీనంగా అనిపించడం
- భుజాన్ని కదిలిస్తున్న సమయంలో చిటపట శబ్దాలు రావడం

### ముందుగా గుర్తిస్తే ముప్పు తక్కువ

రొటేటర్ కఫ్ సమస్యను ప్రారంభ దశలో గుర్తిస్తే ముప్పు తక్కువగా ఉంటుంది. నిర్లక్ష్యం చేస్తే సమస్య మరింత పెరిగే అవకాశం ఉంటుంది. ఈ దశలో పారాసిటమాల్ వంటి మందులు వాడితే నొప్పి నుండి ఉపశమనం కలుగుతుంది. తర్వాత దశలో విశ్రాంతిలో ఉన్నా నొప్పి ఉంటుంది. మందులు వాడినా ప్రయోజనం కనిపించదు. రాత్రి సమయాలలో కూడా నొప్పి బాధిస్తుంటుంది. భుజం నొప్పి, బలహీనంగా ఉండడం వల్ల రోజువారీ పనులన్నీ కష్టమవుతాయి.

### సమస్యను కనుగొనడం ఎలా..?

ఎక్స్-రే, మాగ్నెటిక్ రీసొనెన్స్ ఇమేజింగ్ (ఎంఆర్ఐ) లేదా అల్ట్రాసౌండ్ ద్వారా రొటేటర్ కఫ్ సమస్యను కనుక్కోవచ్చు. పరీక్షల కంటే ముందు రోగి లక్షణాలను ఇతర ఆరోగ్య సమస్యల గురించి తెలుసుకుని, వైద్యులు భుజాన్ని పరీక్షిస్తారు. భుజం కదలికలను, చేయి బలాన్ని పరీక్షించిన తర్వాత వైద్య పరీక్షలు నిర్వహించి సమస్యను నిర్ధారిస్తారు.

### చికిత్స

రోటేటర్ కఫ్ సమస్యకు మెరుగైన చికిత్సా విధానాలు అందుబాటులోకి వచ్చాయి. రోగి వయసు, ఆరోగ్య పరిస్థితి, రోగి ఎలాంటి రొటేటర్ కఫ్ సమస్యతో బాధపడుతున్నారో తదితర అంశాలపై చికిత్స ఆధారపడి ఉంటుంది. 50 శాతం రోగుల్లో సర్జరీ లేకుండా నొప్పి తగ్గడంతో పాటు భుజం పనితీరు మెరుగుపడుతుంది. విశ్రాంతి, కార్యాచరణలో మార్పులు చేసుకోవడం, నాన్-స్టెరాయిడల్ యాంటి ఇన్‌ఫ్లమేటరి మందులు, భుజాన్ని పటిష్టపరిచే వ్యాయామాలు, ఫిజికల్ థెరపీ వంటి శస్త్ర చికిత్సలేని చికిత్సా ప్రక్రియలలో చికిత్స అందిస్తారు. ఈ చికిత్సా విధానాలతో నొప్పి నుండి ఉపశమనం కలుగకపోతే సర్జరీ నిర్వహించవలసి ఉంటుంది. శస్త్ర చికిత్సలో హుమెరస్‌కు టెండాన్‌ను తిరిగి జోడిస్తారు. వీటి మధ్య గ్యాప్‌ను సరిచేస్తారు. రోటేటర్ కఫ్‌ను రిపేర్ చేయడంలో కొన్ని పద్ధతులు ఉన్నాయి. మీ ఆర్థోపెడిక్ వైద్యులు మీతో చర్చించిన తర్వాత మీ సమస్యకు అవసరమైన విధానంలో సర్జరీ నిర్వహిస్తారు.






# చక్రం తిప్పబోతున్న శశికళ

**జయలలితకు సన్నిహితురాలన్న అర్హత తప్ప రాజకీయంగా, పాలనాపరంగా మరో అర్హత లేని శశికళ తమ పార్టీకి దిశానిర్దేశం చేయబోతున్నారు.**



అఖిల భారత అన్నా డీఎంకె అధినేత, తమిళ నాడు ముఖ్యమంత్రి జయలలిత కన్నుమూసిన తర వాత ఏమైంది? పెద్ద కుట్రే జరిగినట్టు కనిపిస్తోంది. ఈ కుట్ర చడీ చప్పుడూ లేకుండా, ఒక్క చుక్క రక్తం చిందకుండా, చురుకుగా, వేగంగా, మెత్తగ్గా జరిగిపోయింది. జయలలిత సన్నిహితురాలు శశికళ డిసెంబర్ 5వ తేదీ అర్ధరాత్రి ముఖ్యమంత్రిగా ఓ. పన్నీర్ సెల్వంతో ప్రమాణ స్వీకారం చేయించేశారు. మూడో కంటికి తెలియకుండా పార్టీ వ్యవహారాలను చేజిక్కించుకున్నారు. పార్టీ యంత్రాంగమంతా చేష్టలు డిగి చూస్తుండగానే జరగవలసినదంతా చకచకా జరిగిపోయింది. జయలలిత మృతితోనే మాటా పలుకూ లేకుండా విషాదంలో కూరుకుపోయి ఉన్న పార్టీ శ్రేణులు శశికళను ఏ విషయంలోనూ ప్రశ్నించే సాహసం చేయలేకపోయారు.

తెల్లవారేసరికి అందరికీ ప్రభుత్వ, పార్టీ పరిస్థితి ఏమిటో అర్థమైపోయింది. అందరి గొంతులూ పెగిలాయి. కానీ, ఏ ఎండకు ఆ గొడుగు పట్టడమే శ్రేయస్కరమన్నట్లు అంతా శశికళ వైపే మొగ్గు చూపించడం ప్రారంభించారు. అంతమాత్రాన పార్టీ యావత్తూ మనస్ఫూర్తిగా శశికళకే మద్దతు ఇస్తోందని అనుకోవడానికి వీల్లేదు. చాలామంది మంత్రులు, శాసనసభ్యులకు తమ పదవులు కోల్పోవడం ఇష్టం లేదు. అందరూ ఎదురు తిరిగితే ప్రభుత్వం పడిపోవడం మినహా ఒరిగేదేమీ ఉండదు. ఈ ప్రభుత్వం ఏర్పడి ఆరు నెలలు కూడా పూర్తి కాలేదు. 2021 వరకూ మళ్లీ ఎన్నికలు జరిగే అవకాశం లేదు. ఈ పరిస్థితుల్లో శశికళతో వైరం పెట్టుకోవడం తెలివైన పని కాదు. వారంతా ఇప్పటికి కలిసికట్టుగానే ఉంటున్నారు. శశికళకు పార్టీలోనూ, కొందరు మంత్రుల్లోనూ పట్టు ఉంది. పైగా పార్టీ నిధుల గురించి, ఆర్థిక వ్యవహారాల గురించి కూడా ఆమెకు పూర్తి అవగాహన ఉంది. రెండు మూడేళ్లుగా జయలలిత అనారోగ్యంతో ఉండడంతో అటు పార్టీ వ్యవహారాలు, ఇటు ప్రభుత్వ వ్యవహారాలను కూడా శశికళే చూసుకుంటున్నారు.

మంత్రుల్లో కొందరు బాగా సీనియర్లు. జయలలిత ప్రవేశానికి ముందు నుంచీ ఎం.జి. రామచంద్రన్‌కు సన్నిహితంగా ఉంటూ వచ్చారు. పైగా, ఈ సీనియర్లలో కొందరు తమ తమ ప్రాంతాల్లో, తమ తమ కులాల్లో బాగా శక్తి సంపన్నులు. అందువల్ల పార్టీని అదుపులో ఉంచుకోవడం శశికళకు అంత తేలిక కాదు. ప్రస్తుతం పైకి కనిపిస్తున్న ప్రశాంతత 2021 వరకూ కొనసాగుతుందా అన్నది కూడా చెప్పడం కష్టమే. శశికళకు కూడా ఈ సంగతి బాగా తెలుసు. ఈ మొత్తం నాటకంలో శశికళ చేసిన పొరపాటు ఒక్కటే. జయలలిత అంతిమయాత్రలోనూ, అంత్యక్రియల సందర్భంగానూ ఆమె తన 20 మంది కుటుంబ సభ్యులనూ (బంధువులనూ) జయలలిత భౌతిక కాయం చుట్టూ వలయంగా నిలబెట్టి ఆమె పెద్ద తప్పే చేసి ఉండొచ్చు. ఆమె కుటుంబ సభ్యులలో ఒక్కరికీ రాజకీయంగా, సామాజికంగా మంచి పేరు లేదు.

## తప్పటడుగు వేస్తారా?

అయితే, శశికళ తనకు అనుకూలంగా కొన్ని మంచి పనులూ చేసినట్టు కనిపిస్తోంది. మొదటిది- ఆమె ముఖ్యమంత్రి పదవిని ఆశించకపోవడం. ఆమె గనుక ఈ పదవిని చేపట్టి ఉంటే, ఆరు నెలల్లో శాసనసభకు పోటీ చేసి గెలవాల్సి వచ్చేది. తాను పదవుల కోసం ఆశపడేదాన్ని కాదని నిరూపించుకునే ఉద్దేశంతో ఆమె ఈ పదవిని ప్రస్తుతానికి ఆశించలేదు.

రెండవది - ఆమె పన్నీర్ సెల్వంనే ముఖ్యమంత్రి పదవికి ప్రతిపాదించారు. ఈ చర్యకు అంతగా ప్రతిఘటన ఎదురు కాదని ఆమెకు తెలుసు. జయలలిత హయాంలో కూడా ఆయన రెండుసార్లు తాత్కాలిక ముఖ్యమంత్రిగా పనిచేశారు. ఆమె కన్నుమూసేముందు కూడా ఆయన ముఖ్యమంత్రిగా వ్యవహరించారు. మూడవది-శశికళ, పన్నీర్ సెల్వంల మధ్య ఎటువంటి ఒప్పందం కుదిరిందో కానీ, జయలలిత మంత్రివర్గాన్ని యథాతథంగా కొనసాగించారు. మంత్రుల్లో కొందరిని తొలగించి, తమకు సన్నిహితులైనవారితో నింపి ఉంటే పార్టీ లుకలుకలు ఒక్కసారిగా బయటపడేవి. నాలుగవది- అంత్యక్రియలను తన అదుపాజ్ఞలలోకి తీసుకున్న శశికళ చివర్లో మాత్రం జయ కుటుంబ సభ్యులలో కొందరికి అంత్యక్రియల్లో పాల్గొనే అవకాశం ఇచ్చారు. ఇక ప్రధాని నరేంద్ర మోదీ వచ్చి శశికళను ఊరడించడం ఆమెకు ఓ సానుకూలమైన అంశం.

మొదటి నుంచీ ఆమె ప్రయోగిస్తున్న రాజకీయ ఎత్తులన్నీ ఓ కరుడుకట్టిన రాజకీయ నాయకురాలికి తగ్గట్టుగానే ఉన్నాయి తప్ప ఓ గృహిణికి తగ్గట్టుగా లేవు. తన ఇంటిని చక్కదిద్దడానికి సుమారు 30 ఏళ్ల క్రితం శశికళను జయలలిత తన ఇంటికి ఆహ్వానించారు. ఆ సమయంలో జయలలిత పూర్తిగా రాజకీయాల్లో తలమునకలుగా ఉన్నారు. గత పదేళ్ళ నుంచి శశికళ ఇంటి వ్యవహా

రాలను పక్కనపెట్టి జయ ఇంటికి ఎవరు రావాలో, ఎవరు రాకూడదో నిర్ణయించే స్థాయికి ఎదిగారు. అంతేకాదు, ఎన్నికల్లో నిలబడే అభ్యర్థులలో కొందరి పేర్లను ఎంపిక చేయడం కూడా మొదలు పెట్టారు. 2016 ఎన్నికల్లో ఆమె ఎంపిక చేసిన అభ్యర్థుల జాబితానే జయలలిత ఆమోదించారు. ఈ ఎన్నికల్లో అన్నా డీఎంకే మంచి మెజారిటీతో గెలిచింది కూడా. ఇక ఆమె భాగస్వామ్య పక్షాలతో సీట్ల పంపిణీ గురించి చర్చించే దశకు కూడా చేరుకున్నారంటే ఆమె రాజకీయ పరిణతి ఏ స్థాయిలో ఉందో అర్థం చేసుకోవచ్చు. బహుశా జయలలిత ఉద్దేశపూర్వకంగానే శశికళను రాజకీయాలకు తీర్చిదిద్దుతున్నారేమో, తన ఏకైక వారసురాలిగా చేస్తున్నారేమో తెలియదు. ఆమె ఏనాడూ ఈ సంగతిని బహిర్గతం చేయలేదు. అయితే, ఆమె జయలలిత వారసురాలు కాబోతోందన్న సంగతిని కొందరు నాయకులు, మంత్రులు ఊహించకపోలేదు.

### జయ అడుగుజాడల్లో.....

తన గురువు ఎం.జి. రామచంద్రన్ దగ్గర కూడా జయలలిత ఈ విధంగానే రాజకీయ శిక్షణ పొందారు. ఆయన జయలలితను మొదట ప్రచార కార్యదర్శిగా నియమించారు. ఆ తరువాత రాజ్యసభ సభ్యురాలిని చేశారు. ఎందుకంటే ఆమె ఇంగ్లీషు మాట్లాడడంలో దిట్ట అని నిరూపించుకున్నారు. జయలలిత కూడా ఎంజీఆర్ మరణించేవరకూ తాను ఆయన వారసురాలిననే సంగతిని ఎక్కడా బయటపెట్టలేదు. ఎంజీఆర్ మరణం తరువాత జయలలితకు, ఎంజీఆర్ భార్య జానకికి మధ్య ఆధిపత్య పోరు మొదలైంది. ఈ పోరాటంలో జయలలిత తనదే పైచేయి అని రుజువు చేశారు. ప్రస్తుత విషయానికొస్తే ఇక్కడ శశికళ ఒక్కరే రంగంలో ఉన్నారు. ఆమె జయలలితకు అత్యంత సన్నిహితులు. ఆమెకు పోటీ లేరు. వారసురాలు అయ్యే అవకాశం ఉందని అందరూ భావిస్తుండగానే ఆమె వారసురాలిగా అవతారమెత్తారు. ప్రస్తుతానికి అన్నీ ఆమెకు అనుకూలంగానే ఉన్నాయి.

నిజానికి ఎంజీఆర్ తన పార్టీలో ద్వితీయ శ్రేణి నాయకత్వం ఎదగడానికి అవకాశం ఇచ్చారు. కానీ జయలలిత అటువంటి అవకాశం ఏదీ ఇవ్వలేదు. అటు ప్రభుత్వంలోనూ, ఇటు పార్టీలోనూ అన్నీ తానై వ్యవహరించారు. తనకంటూ ఓ బ్రాండ్ ఇమేజ్‌ను ప్రత్యేకంగా సృష్టించుకున్నారు. పన్నీర్ సెల్వంను కూడా రిమోట్‌తో నడిపించారు. ఆయనకు ఎటువంటి పరిస్థితుల్లోనూ పూర్తి స్థాయి అధికారాన్ని ఇవ్వలేదు. కానీ, చివరి నాలుగైదు సంవత్సరాల్లో శశికళ మాత్రమే ఆమె దగ్గర స్వతంత్రంగా వ్యవహరించగలిగారు. జయలలిత నుంచి శశికళ తమిళ రాజకీయాలను బాగానే వంటబట్టించుకున్నారు. ఏ నాయకుడు ఎటువంటివారో బాగా తెలుసుకున్నారు. కాలక్రమంలో జయలలితకు మరో రూపం అన్నట్టుగా మారిపోయారు. జయలలితకు బాగా సన్నిహితురాలుగా ఉండడం తప్ప శశికళకు పార్టీ, ప్రభుత్వ వ్యవహారాల్లో కీలక పాత్ర పోషించడానికి మరో అర్హత ఏమీ లేదు.

ముఖ్యమంత్రి పదవిని పన్నీర్ సెల్వంకు అప్పగించిన శశికళ ఇక పార్టీ వ్యవహారాలను చేజిక్కించుకునే పనిలో పడ్డారు. అన్నా డీఎంకే ప్రధాన కార్యదర్శిగా జయలలిత వ్యవహరించేవారు. ఇప్పుడా పదవి మీద శశికళ దృష్టి పడే అవకాశం ఉంది. ఈ పదవిలో తాను కూర్చోవాలా లేక పన్నీర్ సెల్వంను కూర్చోబెట్టాలా అన్నది ఇప్పుడు ఆమె ముందున్న ప్రశ్న. ఈ విషయంలో ఆమె ఆచితూచి అడుగులు వేస్తున్నారు. ఒకవేళ పన్నీర్ సెల్వం కాకపోతే, తనకు బాగా నమ్మకస్తుడైన రాజకీయ నాయకుడు ఎవరున్నారని కూడా ఆమె శోధిస్తున్నారు. శశికళలాగే పన్నీర్ సెల్వం కూడా దేవర్ కులానికి చెందిన వ్యక్తి. తాను మళ్లీ దేవర్ కులానికి చెందిన

లలిత అడుగుజాడల్లో నడుచుకుంటే పార్టీకి, ప్రభుత్వానికే కాక, తనకు వ్యక్తిగతంగా కూడా పెద్ద దెబ్బే తగులుతుంది. ఆ తరువాత విచారించినా ఫలితం ఉండదు. ఇక సుప్రీం కోర్టులో జయలలితతో పాటు శశికళ మీద కూడా ఆదాయానికి మించిన ఆస్తుల కేసు విచారణలో ఉంది. జయలలిత, శశికళతో పాటు, ఇళవరసి (జయ సోదరుడు జయకుమార్ భార్య), వి.ఎన్. సుధాకరన్ (శశికళ సోదరి వనితామణి కుమారుడు, ఒకప్పుడు జయలలితకు దత్త పుత్రుడు) కూడా ఈ కేసులో ఉన్నారు.

'మన్నార్‌గుడి మాఫియా'గా గుర్తింపు పొందిన శశికళ కుటుంబం ఇక ముందు నుంచీ ప్రతి అడుగూ జాగ్రత్తగా వేయాల్సి ఉంటుంది. స్వప్రయోజనాల

**జయలలిత మొదటినుంచీ అటు ప్రభుత్వంలోనూ, పార్టీలోనూ అన్నీ తానై వ్యవహరించారు. తనకంటూ ఓ బ్రాండ్ ఇమేజ్‌ను సృష్టించుకున్నారు. పన్నీర్ సెల్వంను కూడా రిమోట్‌తో నడిపించారు కానీ పూర్తి స్థాయి అధికారాలు ఇవ్వలేదు. అయితే చివరి నాలుగైదు సంవత్సరాలలో తమిళనాడు రాజకీయాలలో శశికళ హవా కొనసాగిందనే చెప్పవచ్చు. ఆమె జయలలితకు మరోరూపంగా పార్టీని శాసించే స్థాయికి ఎదిగారు. మరి జయలలిత వారసురాలిగా ఆమె సీఎం పీఠం ఎక్కబోతోందా? లేక పార్టీ కార్యదర్శిగా పగ్గాలు చేపట్టబోతోందా?**



వ్యక్తినే పార్టీ ప్రధాన కార్యదర్శి పదవికి ఎంపిక చేస్తే పార్టీ శ్రేణులకు తప్పుడు సంకేతాలు పంపించినట్టవుతుంది. ఒక్క తప్పటడుగు వేసినా ప్రభుత్వానికి, పార్టీకి చెరుపు చేసినట్టవుతుంది.

### జాగ్రత్త అవసరం

పార్టీలో ఇది వరకు తనకు సన్నిహితంగా మెలిగినవారికే పదవులు కట్టబెట్టాలని ఆమె గనుక భావిస్తే మంచి కన్నా చెడే ఎక్కువగా జరుగుతుంది. పార్టీ అనేది జయకు వ్యక్తిగత సంస్థ గనుక ఆమె తన ఇష్టం వచ్చినట్టు కొందరిని అందలం ఎక్కించారు, మరి కొందరిని అథఃపాతాళానికి అణచేశారు. శశికళ ఈ విషయంలో జయ

కోసం ఒక్క అడుగు పొరపాటుగా వేసినా ఇంతవరకూ మౌనంగా ఉన్న రహస్య ప్రత్యర్థులంతా నోరు విప్పడం ఖాయం. శశికళ, ఆమె భర్త నటరాజన్, ఆమె అక్క చెల్లెళ్లు, వారి పిల్లలతో సహా ఓ డజను మంది బంధువులు అయిదేళ్ల క్రితం పార్టీ, ప్రభుత్వ వ్యవహారాలలో అతిగా జోక్యం చేసుకోవడం ప్రారంభించారు. ఇది మితిమీరిపోయేసరికి జయలలిత వాళ్లను ఏరిపారేయడం మొదలు పెట్టారు. జయలలిత అంత్యక్రియల సమయంలో ఈ బంధువులంతా మళ్లీ తెర మీదకు వచ్చారు. శశికళ వీరిని ఎంత అదుపు చేస్తే ఆమె రాజకీయ భవితవ్యానికి అంత మంచిది.

# అంతర్వాహిని

## -శ్రీమతి కె.వాసవదత్త రమణ

**ఎదురింటి ఫ్లాట్‌లో ఎవరో దిగినట్టున్నారే? అన్నాను విశాలతో.**

**అవునండీ నిన్ననే వచ్చారు. మొగుడూపెళ్ళామే ఉంటారట. మనకన్నా చాలా పెద్ద వాళ్లే. ఆయన రిటైరయ్యాక ఇక్కడేదో పెద్ద కంపెనీలో సిఇఓగా చేరారట అంది విశాల.**

**పోన్లే నీకు కాస్త కాలక్షేపం. దాదాపు మూడునెలల నుంచి ఇరుగు పొరుగున ఎవ్వరు లేకుండా ఉన్నావు, అన్నాను.**

అవునండీ, మీరు ఉదయం ఆఫీసుకెళితే, రాత్రికి గానీ రారు. అనిల్ ఐఐటి చదవడానికి హాస్టల్‌కి వెళ్లినప్పటినుండి నాకు ఏమీ తోచడంలేదు.

ఇంతకీ, వాళ్ల పిల్లలు ఏం చేస్తున్నారో?

వాళ్లకి ఇద్దరు కొడుకులట. ఒకడు అమెరికాలో సెటిలయ్యాడట. రెండో అబ్బాయికి ఉద్యోగం. వాళ్లని చూస్తే బాగా డబ్బు ఉన్నవాళ్లలాగే ఉన్నారు. జీతం కోసం ఉద్యోగం చెయ్యాల్సిన పరిస్థితి అని పించలేదు అంది.

మరి వీళ్ల ఆ కొడుకు దగ్గరో ఈ కొడుకు దగ్గరో ఉండక ఇక్కడికెందుకొచ్చారు? 60 ఏళ్ల దాటిన తర్వాత మళ్లీ ఉద్యోగం, డబ్బులూ అంటూ ఈ ఊరు కాని ఊర్లో ఉండటం ఎందుకు? ఆరోగ్యాలు పాడైతే అంద రికీ ఇబ్బంది కదూ? అన్నాను కించిత్ కోపస్వరంతో.

పాపం వాళ్లకేం బాధలున్నాయో ఏమో? కోడళ్లతో పడదేమో? అంది.

విశాల ద్వారా వాళ్ల కబుర్లు అడపాదడపా తెలుస్తూనే ఉన్నాయి.

•••

బావున్నారా! భానుమతిని చూడగానే ఆనందంగా అన్నాను.

నువ్వు...? అర్థోక్తిగా అడిగింది ఆవిడ.

నాకు ఉద్యోగం వచ్చిన కొత్తలో వాళ్ల ఎదురింట్లో నేను అద్దెకున్న విషయం చెప్పడంతో, ఆవిడ గుర్తుపట్టి, నీ పేరు రవి శంకరేనా! అంది ఆశ్చర్యంగా.

బాగా లావైపోయావు. పదేళ్ల గడిచిపోయాయి కదా. అన్నారు నారాయణరావుగారు.

చిన్నగా నవ్వాను.

కాసేపు ఈ కబుర్లు ఆ కబుర్లు అయ్యాక, అవును ఇంతకీ మీ అబ్బాయిలు ఎక్కడున్నారని అడిగాను.

పెద్దవాడు యుఎస్‌లో సెటిలయ్యాడు. రెండవ వాడు ముంబయిలో ఉద్యోగం చేస్తున్నాడు. వాడికి పెళ్లై రెండేళ్లయింది.

అవును నేను మీకు పరిచయం అయ్యేటప్పటికే, ఆ పెద్దబ్బాయి యూఎస్‌లో ఉన్నాడు. అయినా మరి మీరేంటి ఇక్కడ? మీ రెండో అబ్బాయి మిమ్మల్ని క్షణం కూడా వదిలి ఉండలేడు కదా! మరి ఆ ఊరు వదిలేసి ఇక్కడికెందుకు వచ్చారు? గబగబా అడిగాను. కాని అడిగిన వెంటనే వాళ్ల వ్యక్తిగత విషయాల్లో నేను అధికంగా జోక్యం చేసుకున్నానేమోనని పించింది.

ఆవిడ కళ్లల్లో చిన్న బాధా వీచిక కదలాడింది. కానీ వెంటనే సంభాళించుకుంటూ...శంకర్! మా అభి గురించి బాగానే గుర్తుపెట్టుకున్నావే? మరి మా అభికేనా ఉద్యోగం? మా వారికి లేదా ఏంటీ? అంది.

అదేంటి మీరింకా రిటైర్ కాలేదా? ఆశ్చర్యంగా అడిగాను.

రిటైరై మూడేళ్ల అయింధన్నారు నారాయణరావుగారు.

మరి?



ఇక్కడ కంపెనీలో మంచి ఆఫర్ వచ్చింది. మంచి పే, మంచి పోస్ట్. అందుకే వచ్చి జాయిన్ అయ్యాను అన్నాడు.

నాకు తెలుసు. నా పదేళ్ల పరిచయం కిందటే వాళ్ల చాలా సంపన్నులు. పైగా ఊళ్లల్లో వాళ్లకు చాలా భూములున్నాయి. మరి నారాయణరావు గారికి ఏ మాత్రం ఉద్యోగం చేయాల్సిన అవ సరం లేదు.

వాళ్ళ మాటల్లో ఏదో తిరకాసు ఉందని



వాళ్లు ఇక్కడకు వచ్చి మూడు నెలలైనా అభిరామ్, అతని భార్య ఇక్కడికి రాలేదు. ఏం జరిగి ఉంటుంది? కోడలితో విభేదాలున్నాయా? ఏమో?

నా కళ్లముందు వాళ్ళ ఇంట్లో నేను గడిపిన మధుర క్షణాలు కదిలాయి.

నా మనసు గతంలోకి జారింది.

•••

అమ్మా, అమ్మా అంటూ అభిరామ్ హడావిడిగా లోపలికి వచ్చాడు.

ఏంట్రా? అంటూ భానుమతి వంటింట్లో నుంచి వచ్చింది.

అమ్మా, నేను యూనివర్సిటీ ఫస్ట్ వచ్చాను. ఆనందంతో తబ్బిబ్బు అవుతూ అన్నాడు.

కంగ్రాట్స్! భానుమతి ముఖం మతాబులా వెలిగిపోయింది.

రవిశంకర్ విన్నావా, వాడి కష్టానికి ఫలితం దక్కింది అంది నాతో.

కంగ్రాట్స్ అభి! అన్నాను.

ఇదంతా మా అమ్మ వల్లే అంకుల్, రాత్రింబవళ్లు నన్ను కష్టపడి చదివించింది. అందుకే ఆ క్రెడిట్ అంతా మా అమ్మకే చెందాలి. అభి చిన్నపిల్లాడిలా ఆమె భుజం మీద తలవాల్చి అన్నాడు.

భలేవాడివిలే అందామె మురిపెంగా.

అమ్మా, ఈవాళ గులాబ్‌జామ్ చెయ్యి అన్నాడు గారంగా.

అలాగే లేరా. అందామె.

అమ్మా పిండి నేనే కలుపుతాను, పద పద వంటింట్లోకి అన్నాడు.

నాకా దృశ్యం ఎంతో అపురూపంగా అనిపించింది. ఇరవైఒక్క ఏళ్ల కుర్రాడు చంటి పిల్లాడిలా అమ్మవెనక తిరగడం, వంటింట్లో అన్ని పనుల్లో చేదోడు వాదోడుగా ఉండటం, తలలో నాలుకలా ఇంటి పనులన్నీ చక్కపెట్టడం చాలా అరుదుగా చూస్తుంటాం.

నేను ఆ ఇంట్లో పర్మినెంట్ పేయింగ్ గెస్ట్ అయ్యాను. భానుమతి గారి ఆదరణ నన్ను కట్టిపడేసింది. వాళ్లతో గడిపిన ఆ మూడేళ్లూ మధుర క్షణాలే. తల్లీకొడుకుల అనుబంధానికి, తండ్రీ కొడుకుల స్నేహబంధానికి వాళ్ల కుటుంబమే రోల్‌మోడల్ అనిపించేది నాకు.

•••

అభిరాం ఎలా ఉన్నావు? ఎప్పుడొచ్చావు?

ఓ రోజు పొద్దున్నే వాళ్ల అబ్బాయి కారిడార్‌లో కనిపిస్తే గబగబా ఎదురెళ్లాను.

ఓ అంకుల్, ఎన్నేళ్లకి? అమ్మ రాగానే చెప్పింది, మా ఎదురింట్లో ఉన్నారని. చాలా సర్‌ప్రైజ్ అంకుల్! వరల్డ్ ఈజ్ వెరీ స్మాల్ కదా! అభిరామ్ గలగలా మాట్లాడుతూనే ఉన్నాడు.

అదే అభిరామ్! అదే పసి మనస్తత్వం. అదే నిష్కళంకమైన ప్రవర్తన, అదే స్వచ్ఛమైన మనస్సు. నువ్వు ఏమీ మారలేదు అన్నాను ఆత్మీయంగా.

రెండు మూడు రోజులు గడిచాయి. అభిరామ్ భార్య సౌందర్యని, ఆఫీసు పని మీద ఒక్క నెల లండన్‌కి పంపారట. ఆమె రాలేదు. వాళ్లను మా ఆవిడ భోజనానికి పిలిచింది. వాళ్లు ఓపూట మమ్మల్ని భోజనానికి పిలిచారు. సరదాగా కబుర్లతో రోజులు త్వరగా గడిచాయి.

ఓ రాత్రి మేమిద్దరం కలిసి మా అపార్టుమెంటులోని లాన్‌లో వాకింగ్ చేస్తుండగా, అభిరామ్ హఠాత్తుగా అన్నాడు.

అంకుల్, మిమ్మల్ని ఒక విషయం అడగవచ్చునా? మా గురించి అమ్మ మీతో ఎప్పుడైనా, ఏమైనా మాట్లాడిందా?

లేదే అన్నాను అతనివంక లోతుగా చూస్తూ.

అంకుల్, అమ్మానాన్నలంటే నాకెంత పంచప్రాణాలో మీకు తెలుసుగా. మా పెళ్ళై రెండేళ్లు అయ్యింది.

సౌందర్య చాలా మంచి అమ్మాయి. మా కోడలు కాదు, మా కూతురు అని అందరికీ మా అమ్మ మురిపెంగా పరిచయం చేసేది. ఇది మా బంధువులందరికీ తెలిసిన విషయమే! కానీ ఎందుకో, అమ్మ ఈ మధ్య చాలా మారిపోయింది. ఒక్క ఆరు నెలల్లోనే అమ్మలో చాలా మార్పు వచ్చింది. ఎందుకనో తను మన కుటుంబంలో సరిగ్గా ఇమడలేదని, సౌందర్యలో లేనివి ఉన్నవి, ఏవో లోటుపాట్లు వెతకడం మొదలుపెట్టింది. కొద్ది రోజులు పోతే అడ్జెస్ట్ అవుతారనుకున్నా! అన్నీ సర్దుకుంటాయని ఆశించాను. కానీ డాడీ ఉద్యోగం వంకపెట్టి, నన్ను ఒంటరివాణ్ణిచేసి, ఇలా హఠాత్తుగా నన్ను వదిలేసి డాడీని తీసుకొని అమ్మ వచ్చేస్తుందని ఊహించలేకపోయాను. సౌందర్యకి ఇంకా పెద్ద షాక్. ఒక్క ఆరునెలలు మనిషిని కాలేకపోయాను అనిచెప్పి ఆగాడు అభి.

నాకు హఠాత్తుగా ప్రపంచం బద్ధలైనట్లు అనిపించింది.

అంకుల్, ఇప్పుడిప్పుడే ఇద్దరం కాస్త సెట్ అవుతున్నాం. నేను రేపు వెళ్లిపోతున్నాను. సౌందర్య లండన్‌నుంచి రాగానే, ఇద్దరం మళ్లీ వస్తాం. అమ్మని ఒప్పించి, డాడీని ఉద్యోగం మాన్పించి, ఎలాగైనా లాక్కొని అయినా తీసుకునిపోతాను. ఇది ఎలాగైనా జరిగి తీరుతుంది. ఆఖరి మాటలు చెబుతున్నప్పుడు అతని కళ్లల్లో నీళ్ళు నిలిచాయి.

ఇన్నాళ్లూ శబ్దంలేదు అనుకున్నానుగానీ, నిశ్శబ్దమే బావుంది. తెలియకపోయినా ఫరవాలేదు కాని సత్యాన్ని ఎదుర్కోవడం కష్టమనిపించింది.

•••

అభిరామ్ వెళ్ళాక నేను ఆఫీసులో బిజీగా ఉండి అనిపించింది.

ఆలోచిస్తూ ఇంటికి చేరాను.

•••

అభిరామ్ చిన్నప్పటి సంగతులు రోజంతా నేను విశాలతో చెబుతూనే ఉన్నాను.

అభిరామ్ గురించి నాకు బాగా తెలుసు. అతనికి తల్లిదండ్రులంటే పంచ ప్రాణాలు. ముఖ్యంగా తల్లి అంటే ప్రాణం పెట్టేస్తాడు. అప్పట్లో ఒక్కక్షణం కూడా తల్లిని వదిలేవాడు కాదు. ఎప్పుడూ కొంగు పట్టుకొని తిరుగుతూనే ఉండేవాడు. నేను అక్కడ ఊళ్లో ఉన్నప్పుడు, అతను ఇంజనీరింగ్ ఫైనల్ ఇయర్ చదువుతున్నాడు. ఎం.ఎస్. చేసి, వాళ్ల అన్నయ్య దగ్గరికి వెళ్లాలనే ప్లాన్‌లో ఉన్నాడు. చాలా తెలివైనవాడు. ముఖ్యంగా చాలా మంచి కుర్రాడు. నలుగురికి తలలో నాలుకలా ఉండేవాడు. అలాంటివాడు ఇండియాలో ఉండి తల్లిదండ్రులకి దూరంగా ఎందుకు ఉన్నాడు.

మూడురోజులపాటు నారాయణరావు గారింటికి వెళ్లలేకపోయాను. ఆరోజు సాయంత్రం త్వరగా వచ్చాను. వాళ్లింటికి వెళ్ళాను. భానుమతిగారిని చూసి ఒక్కసారిగా ఉలిక్కిపడ్డాను. పది లంఖణాలు చేసినట్లుగా ఉందావిడ.

ఏమైందండీ? ఒంట్లో బాగోలేదా? ఆదుర్దాగా అన్నాను.

అభిరామ్ వచ్చి వెళ్లాక ఆమె నెలరోజుల వరకు ఇక మనిషి కాలేదు అన్నారు నారాయణ రావుగారు, కళ్లల్లో ఉప్పొంగే కన్నీళ్లను కళ్ళజోడు వెనకాల దాచాలని విశ్వప్రయత్నం చేస్తూ. అదే మిటి? అని తెల్లబోయాను.

అభిరామ్ ఆరోపణలకి, ఇప్పుడు చూస్తున్న వాస్తవానికి ఎంత తేడా? ఏమిటీ అగాధాలు? ఎందుకిలా అవుతోంది? నా మనస్సు చాలా తల్ల డిల్లిపోయింది.

ఏమిటండీ, అసలు ఏం జరుగుతోంది? అందరూ ఒకళ్ల బాగు కోసం మరొకరు పరితపించిపోతూ ఆవేదన పడుతున్నారు? మీ కుటుంబంలో ఇలాంటి తేడా ఎందుకు వచ్చింది? నేను మీ తమ్ముడు లాంటివాణ్ణి. నిజం చెప్పండి? ఆర్తంగా అన్నాను.

ఆయన ఏమీ మాట్లాడలేదు. భానుమతి గారు కన్నీళ్ళు తుడుచుకుంటూ పక్కకి తిరిగారు. ఒక్క నిమిషం ఆగి ఆవిడే తెప్పరిల్లుతూ...

అభి చాలా ఉత్తముడు రవిశంకర్ అందామె. ఎన్నో జన్మల పుణ్యఫలంవల్ల ఈ జన్మలో నాకు ఇలాంటి కొడుకు లభించాడనిపిస్తుంది. సౌందర్య మంచిపిల్ల. వాడికి చక్కని ఈడు జోడు. వాడి బాగోగులు నాకన్నా బాగా చూసుకోగల అమ్మాయి. అందుకే ఎన్నో సంబంధాలు చూసి ఏరికోరి ఆ అమ్మాయిని తెచ్చుకున్నాను అంటూ ఒక్క క్షణం చెప్పటం ఆగింది.

నేను ఆవిడ వంక అలా చూస్తూ ఉండిపో యాను.

మరేంటి, మీ కుటుంబంలో ఇలాంటి తుఫాను?

అభిరామ్ అందరితోనూ పాలు నీళ్లలా కలిసి పోతాడు. వాడి భార్య వచ్చినా వాడి ప్రవర్తనలో మార్పులేదు. ఇంకా చంటిపిల్లాడిలా ఈ రోజుకీ నా పక్కకి వచ్చి పడుకుంటాడు. నిద్రపోయే వరకు నా వెంటే తిరుగుతుంటాడు. ఈరోజుకీ ఆఫీసు నుంచి వస్తూనే అమ్మా అమ్మా అంటూ నా దగ్గరికే పరిగెత్తుకు వస్తాడు. మొదట్లో నా మనస్సంతా ఎంతో ఆనందంతో పొంగిపోయేది. పెళ్లైనా కూడా వాడి మనస్తత్వం, మా పట్ల వాడి కున్న ప్రేమ ఏమీ మారలేదు. నా అభి వ్యక్తిత్వం ఎప్పటికీ ఇలాగే ఉంటుంది అనుకునేదాన్ని. నా పెంపకానికి నేనే గర్వపడుతూ ఉండేదాన్ని.

ఆవిడ మాటలకి నేను స్థాణువైపోయాను.

కానీ సాటి ఆడదానిగా రాన్రాను సౌంద ర్యలో ఏదో కనిపించని అసంతృప్తి నేను గుర్తించ గలిగాను. అలా అని వాడు సౌందర్యని ఎప్పుడూ తక్కువగా చూడలేదు. మహారాణిలా ట్రీట్ చేసే వాడు. ఖరీదైన బహుమతులు, మంచి చీరలు తెచ్చేవాడు. చాలా అపురూపంగా చూసుకునే వాడు. ఎందుకంటే వాడిదృష్టిలో అందరూ ఒక్కటే. ఆఖరికి మా వంటమనిషి, పనివాళ్లని కూడా ఎంతో గౌరవించేవాడు. వాళ్లకు ఏ సాయం కావాలన్నా టక్కున డబ్బు తీసి ఇచ్చేవాడు. అవ సరం అయితే స్వయంగా వెళ్లి సాయం చేసే వాడు.

మరేంటి సమస్య? మనసులో అనుకున్నాను. నా ఆలోచనల్ని భగ్నంచేస్తూ,

వాడిది స్వచ్ఛమైన మనస్సు. అద్దంలో మన ముఖం మనకి ఎలా కనిపిస్తుందో, వాడికందరు వాడిలానే కనపడుతుంటారు. ప్రతీ మనిషికి ఇంకో ముఖం ఉంటుందని అది అప్పుడప్పుడు హఠా త్తుగా బైటపడుతుందని అభిరామ్‌కి తెలియదు. అలాంటిది ఒకటుంటుందని వాడు ఊహించు కోలేడు కూడా? బైటవాళ్లలో, బంధువులలో అలాంటివి ఉన్నా మనకి అది పెద్ద తేడాగా అని పించదు. కాని మన ఇంట్లో అలాంటి తేడా రాకూ డదు. వచ్చిందంటే పసి మనస్తత్వం ఉన్న అభి తట్టుకోలేడు. అభికి ఆ తేడా కనిపిస్తే మా పైన ఉన్న పిచ్చి ప్రేమతో, సౌందర్య పట్ల ఏ నిర్ణయం తీసుకుంటాడో అన్న భయంతో మేము ఆలోచించుకుని, ఆయన ఉద్యోగం వంకతో ముందే నిశ్శబ్దంగా వాడి జీవితంలోంచి తప్పు

**గంగ, యమున, సరస్వతీ నదుల సంగమం ఎంతో పవిత్రం. ఉమ్మడి కుటుంబం కూడా అంతే! అదో ప్రేమాను రాగాల సంతోష సంగమం. ఉమ్మడి కుటుం బంలో ప్రేమ ఒక నిరంతర ఝరి. సరస్వతీ నదిలానే అది పైకి కనిపించదు. అంతర్వా హినిలా ప్రతిమనిషిలోనూ నిత్యం ప్రవహి స్తుంది. అలాంటి ఒక కుటుంబంలో ఏం జరిగింది?**

కున్నాం. ఎందుకంటే వందేళ్ల జీవితం వాడిది. చరమాంకంలో ఉన్న జీవితం మాది.

ఆవిడ మాటలకి నా కాళ్లకింద భూమి బద్ధలై నట్టనిపించింది.

రవిశంకర్, ఈ తుఫాను ఎందుకు చెల రేగిందో, ఎలా అణుగుతుందో, మాకు తెలియదు. మాకు కావాల్సిందల్లా ఒక్కటే మా కొడుకు ఆనందం. కోరుకునేదల్లా వాడి సౌఖ్యం. వాడి సంసారం అన్యోన్యంగా సాగాలన్నదే మా తపన.

కానీ మీతో ఉంటేనే కదా అభికి ఆనందం, మీరే దూరమైతే? ఆగాను.

రవిశంకర్, మా దగ్గరన్నీ ప్రశ్నలే ఉన్నాయి. సమాధానాలున్నా, వాటిని వెతుక్కోవడం మాకిష్టం లేదు. అయినా నీకెందుకు ఇంత వివరంగా చెప్పా నంటే, వాడుమళ్లీ సౌందర్యతో వస్తాడు. ఈసారి కాళ్లావేళ్లా ప్రాధేయపడి మరీ రమ్మనమని అడుగు తాడు. నీలాంటి వాళ్లకి మేము కఠినాత్ములైన తల్లిదండ్రులుగా కనిపించినా ఫర్వాలేదు. ఈ విషయంలో మాకేమీ బాధలేదు. పొరపాటున అభి ముందు మమ్మల్ని నువ్వు మంచివాళ్లుగా నిలబెడితే, వాడు వచ్చివెళ్లాక మేం కుంగి పోయామని చెబితే వాడు తట్టుకోలేడు. అందుకే నీకు నిజం చెప్పాను. నా ఊహ నిజమైతే, అభిరాం ఈ పాటికే విషయం అంతా తెలుసుకో మని నిన్ను ప్రాధేయపడే ఉంటాడు అన్నారు భానుమతి.

ఆవిడ ఆఖరి మాటలకి ఉలిక్కిపడ్డాను. కొడుకు మనసేమిటో, కొడుకు ఏ క్షణానికి ఎలా స్పంది స్తాడో తల్లికి కాకపోతే ఈ ప్రపంచంలో ఇంకెవ రికి తెలుస్తుంది.

మౌనంగా నిష్క్రమించాను.

కానీ మౌనంగా ఆ రెండు హృదయాలు రోదిస్తున్నాయన్న విషయం నా హృదయాన్ని తొలిచేస్తోంది.

●●●

భానుమతిగారి ఊహ కరెక్ట్ అయ్యింది.

మరోనెలకి, సౌందర్య, మా కోడలు అంటూ భానుమతిగారు కంటి నిండా మెరుపులతో, నాకూ విశాలకీ పరిచయం చేసింది.

ఆవిడ వయస్సు పాతికేళ్లు తగ్గిపోయిందా అన్నంత హుషారుగా ఉంది. నాలుగు రోజులు సరదాగా గడిచాయి. సౌందర్య నిజంగా చాలా



## దర్శకుడి మాట వినని రకూల్

రకూల్ అంటేనే పద్ధతిగా ఉండే హీరోయిన్ అంటారు. సెట్‌లో దర్శకుడు ఏది చెబితే అది ఎదురు చెప్ప కుండా చేసుకుపోయే రకూల్ ఒక దర్శకుడి మాటను వినలేదట! నాగచైతన్యతో రకూల్ ఓ సినిమా చేస్తున్న సంగతి తెలిసిందే! ఈ సినిమా షూటింగ్ విశేషాల్ని సీక్రెట్‌గా ఉంచమని దర్శకుడు కల్యాణ్ కృష్ణ యూనిట్‌లో అందరికీ గట్టిగా చెప్పాడు. అయితే ఆయన మాటను అందరూ విన్నా రకూల్ మాత్రం వినలేదు. ఈ సినిమా షూటింగ్‌కి సంబంధించి ఒక ఫోటోను సోషల్ మీడియాలో పోస్ట్ చేసిందట! దీని మీద కొద్దిగా గొడవ జరిగిందనే అంటున్నారు. రకూల్ మాత్రం అదేం లేదంటూ కొట్టిపారేస్తోం దట!

మంచి అమ్మాయి. అందరితో కలిసిపో యింది. ముఖ్యంగా మా విశాలకి చాలా నచ్చే సింది.

అభిరామ్ నన్నేమి అడగలేదు. అదీ మంచిదే అనుకున్నాను. ఎందుకంటే అతను ఒకవేళ అడి గితే నేను ఏం చెప్పాలో, అతనితో ఎన్ని అబ ద్ధాలు ఆడాలో నాకే తెలియడం లేదు. వాళ్ళు ఇంట్లో ఏం మాట్లాడుకున్నారో నాకు తెలియదు.

అభిరామ్ వాళ్ల వెళ్లే రోజున క్యాబ్‌వాళ్ల స్ట్రైక్ చేస్తున్నారు. అందుకే వాళ్లని నా కార్లో నేనే ఎయిర్ పోర్ట్‌లో దింపాను. అభిరామ్ ఎయిర్‌పోర్ట్‌లో టికెట్ వెరిఫై చేస్తుంటే నేను, సౌందర్య ఓ పక్కగా కూర్చున్నాం.

మా కుటుంబంతో మీకు ముందునుంచి పరిచయాలు ఉన్నాయని నాకర్థమైంది. మీరు చాలా ఆప్తులని భావించి చెబుతున్నానని అంది సౌందర్య.

నేనామె వంక ఆశ్చర్యంగా చూశాను.

మా నలుగురి కథలో, నేనే విలన్‌గా మీకు కనబడి ఉండవచ్చు. మాది సంపన్నుల కుటుంబం. నేను పదో క్లాసు చదువుతుండగా మా అమ్మ గారు, నాన్నగారు ఇష్టపూర్వకంగా రాతపూర్వ కంగా విడిపోయారు. మా అమ్మ వెంటనే మరో పెళ్లి చేసుకుంది. కానీ, ఆ బాధ తట్టుకోలేక అవ మానభారంతో మా నాన్నగారు గుండెపోటుతో చనిపోయారు. నేను దాదాపుగా పదేళ్లకుపైగా హాస్టల్లో పెరిగాను. మా బంధువులు, ఫ్రెండ్స్ చాలా మంది ఉన్నారు. డబ్బు కూడా చాలానే ఉంది. డబ్బు చాలా సమస్యల్ని తీరుస్తుంది. అందుకే నాకు జీవితాన్ని గడపటం ఎప్పుడూ పెద్దగా ఇబ్బంది అనిపించలేదు. మా పెళ్లికి మా అమ్మ ఒక్కతే వచ్చి ఆశీర్వదించి వెళ్లింది. సౌందర్య ఒక్క క్షణం ఆగింది.

బహుశా దుఃఖాన్ని దిగమింగుకోవడానికే అనిపించింది. నా ఆలోచనల్ని భగ్నం చేస్తూ, అంకుల్, నేను స్వయంకృషితో ఎదిగాను. మంచి ఉద్యోగం చేస్తున్నాను. భర్తని, పిల్లల్ని గాలికొదిలేసి స్వార్థ పరురాలిగా జీవితంలో మిగిలిపోకూడదనుకు న్నాను. అందుకే ఓ భార్యగా, మా అమ్మ, మా నాన్న మీద చూపించలేని ప్రేమని నేను అభిరామ్‌కి రెట్టింపునిచ్చి, అన్యోన్యమైన కాపురం చేయాలని ఆశపడ్డాను. కానీ నా ఆశయం, మా అత్తగారి ప్రేమని తుంచివేస్తుందని కానీ, ఆవిడ స్వాభిమానాన్ని దెబ్బతీస్తుందని కానీ నేను ఊహించలేకపో యాను. కొంచెం చిన్నతనంతో చాలా పెద్దతప్పే చేశాను. అదిప్పుడిప్పుడే నాకు తెలిసివస్తోంది.

లండన్‌నుంచి వచ్చాక ఆ వెలితి ఇంకా బాధ పెడుతోంది. ఆఫీసు నుంచి వచ్చేటప్పటికి ఇల్లు బావురుమంటోంది. నేను ఒక మూల, అభి ఒక మూల. జీవితం అంతా శూన్యమైపోయి నట్లు ఉంది. ఇప్పుడు నేనూ, అభి ఎంత బతి మాలినా వాళ్లు మా ఇంటికి రారు. ఎందుకంటే వాళ్లకి మేమిద్దరం ఆనందంగా ఉండటం కన్నా, వేరే లక్ష్యం లేదు.

సౌందర్య దూరంగా ఎయిర్‌పోర్ట్‌లో ల్యాండ్ అవుతున్న విమానాల్ని చూస్తూ సాలోచనగా అంది.

నేను ఆ అమ్మాయి వంక విభ్రాంతిగా చూస్తూ ఉండిపోయాను.

ఇంత చిన్నపిల్ల, ఎంత విశ్లేషించి మాట్లాడింది. ఈతరం లోకాన్ని చదివే సింది, సమాజాన్ని స్కాన్ చేసేసింది. వాళ్లకి తెలియనిదేముంది. ఏదో బల మైన కారణం దొరికితేనే ఈ సమస్యకు పరిష్కారం దొరుకుతుంది.

సౌందర్య, కమాన్ అనౌన్స్‌మెంట్ చేస్తున్నారంటూ అభిరాం వచ్చాడు.

అతని కళ్ళల్లోకి చూశాను. లోపల ఏ తుఫానులు చెలరేగిపోతున్నాయో తెలియదు గాని పైకి గంభీరంగా ఉన్నాడు.

వస్తానంకుల్, థాంక్యూ ఫర్ ఎవ్రీథింగ్. అమ్మానాన్నని జాగ్రత్తగా చూడండి. కొద్దికాలం పాటు వాళ్లని మీకు అప్పచెప్పి వెళతున్నాను. నన్ను కౌగిలించుకుంటూ గద్గదస్వరంతో అన్నాడు.

కొద్దికాలమేనండీ, ఇంక రెండునెలల్లో నేను గుడ్ న్యూస్‌తో మళ్లీ వస్తాను. వాళ్లని దగ్గరుండి మరీ తీసుకెళతాను. మనవడో, మనవరాలి కోసం వాళ్లు రాకుండా ఎలా ఉంటారు. కళ్ళ నిండా నీళ్ళతో గలగలా నవ్వుతూ అంది సౌందర్య.

అభి విభ్రాంతిగా భార్య వంక చూశాడు. భార్యను దగ్గరగా తీసుకుని, అంకుల్ వెళ్లి వస్తాం అన్నాడు.

•••

గంగ, యమున, సరస్వతీ కలిసేచోటు త్రివేణి సంగమం. పరమ పవిత్రం. ఉమ్మడి కుటుంబం కలిసివుండే చోటే స్వర్గం. సంతోషాల సంగమం. వీడ్కోలు చెప్పి వాళ్ల విమానం గాల్లోకి కను మరుగయ్యేవరకు చూస్తూనే ఉన్నాను.

గంగాయమునలు పైకి కనపడతాయి. సర స్వతి అంతర్వాహిని! పైకి కనపడదు. ప్రేమ అంతే. నిరంతర ఝరిలా, అంతర్వాహినిలా ప్రతి మనిషిలోనూ నిత్యం ప్రవహిస్తూనే ఉంటుంది. అది మనసున్న ప్రతి మనిషినీ నిరంతరం సృజి స్తూనే ఉంటుంది.

**సెల్: 98481 78962**






## భూగర్భ పట్టణం

ఏదైనా ప్రదేశానికి వెళ్ళాలంటే బస్సులు, రైళ్ళు, విమానాలను ఆశ్రయించాల్సిందే. కానీ ఆ పట్టణానికి వెళ్ళాలంటే భూమి కిందకి వెళ్ళాలి. ప్రపంచంలోనే భూగర్భంలో ఏర్పడిన ఏకైక పట్టణం కూబర్ పెడి. ఆ పట్టణం చూడాలనుకుంటే మాత్రం ఆస్ట్రేలియా వెళ్ళాల్సిందే!

అడిలైడ్‌కి దగ్గరలో ఉందీ పట్టణం. కొన్నేళ్ళ క్రితం ఈ పట్టణం స్థానంలో ఒపల్ అనే విలువైన రాతిపొరలు ఉండేవి. ఆ రాతిపొరలను తవ్వి తీయటం మొదలెట్టింది ప్రభుత్వం. ఎడారిప్రాంతం కావడంతో ఉష్ణోగ్రతలు అధికంగా ఉండేవి. దాంతో కార్మికులు తవ్విన గనుల్లోనే నివాసం ఏర్పాటుచేసుకున్నారు. భూగర్భంలో చల్లగా ఉండటంతో మెల్లగా ఇళ్ళు పెరిగి అదొక పట్టణంగా రూపాంతరం చెందింది. ఇక్కడ అన్నిరకాల సదుపాయాలూ ఉన్నాయి. స్కూల్స్, దుకాణాలు, హోటళ్ళు, స్విమ్మింగ్‌పూల్స్ సమస్త సౌకర్యాలూ అందుబాటులోనే ఉన్నాయి. ఇక్కడ ఇళ్ళు నిర్మించుకున్నవారు వెలుతురుకోసం పైకి గొట్టాలు ఏర్పాటు చేసుకుంటారు. ఎంతోమంది దేశ, విదేశీ యాత్రికులను ఆకర్షిస్తోందీ పట్టణం.

## బ్రాకెన్స్ గుహ

పక్షులు తమ జాతిని పెంచుకునేందుకు ఒక ప్రాంతం నుంచి మరొక ప్రాంతానికి వలసపోతా యని తెలుసు. కానీ గబ్బిలాలు కూడా అలా చేస్తా యంటే కాస్తంత ఆశ్చర్యమే!

అమెరికాలోని టెక్సాస్ నగర సమీపంలో బ్రాకెన్స్ గుహ ఉంది. ప్రతి సంవత్సరం వేసవి కాలంలో మెక్సికో దేశం నుంచి సుమారు రెండుకోట్ల గబ్బిలాలు ఇక్కడకు వలస వస్తాయి. మార్చి నుంచి అక్టోబర్ వరకు ఆ గుహలో ఉండి, సంతతిని వృద్ధి చేసుకుంటాయి. అదే సమయంలో ప్రతి రోజు రాత్రిపూట ఆ గబ్బిలాలన్నీ వంద అడుగుల వైశాల్యమున్న గుహ ముఖద్వారం నుంచి పైకివచ్చి ఆకాశంలోకి 10 వేల అడుగుల ఎత్తువరకు వెళతాయి. అన్ని గబ్బిలాలు ఒకేసారి పైన ఎగురుతోంటే 60 మైళ్ళ దూరం వరకు కారుమబ్బులు కమ్ముకున్నట్లు ఉంటుందట. అవి చేసే శబ్దాలు ఉరుముల వలె వినబడతాయట. ఎంతోమంది ఆ గుహను, అక్కడికొచ్చే గబ్బిలాలను చూడటానికి ఎదురుచూస్తుంటారు.



## కబుర్లు చెబుతుంది

ఎక్కువ దూరం ఒక్కరూ ప్రయాణం చేయాలంటే పరమ బోర్! అందుకే కంపెనీ కోసం ఎవరినో ఒకరిని తోడు తీసుకెళుతుంటారు. అయితే ఇక ఆ సమస్య రాదంటోంది ఆటోమొబైల్ సంస్థ హోండా.

జపాన్‌లోని టెలికాం సంస్థ సాఫ్ట్‌బ్యాంక్-హోండా కలిసి సంయుక్తంగా ఈ కారుని అభివృద్ధి చేశారు. ఆర్టిఫిషియల్ ఇంటెలిజెన్స్ టెక్నాలజీ ద్వారా పనిచేస్తుంది. ఆ సాంకేతికతకు 'ఎమోషన్ ఇంజన్' అని పేరు పెట్టారు. ఇది చక్కగా డ్రైవర్ ముఖంలోని హావభావాలను గమనిస్తూ, కారు పనితీరులో మార్పులు చేర్పులు చేస్తుందట. అంతేకాదు ఎంచక్కా మనకు కబుర్లు కూడా చెబుతుంది. సెన్సర్ల ద్వారా విషయాన్ని గ్రహించి, వాటిని డ్రైవర్‌తో ముచ్చటిస్తుంది. జనవరి మొదటి వారంలో అమెరికాలోని లాస్‌వేగాస్‌లో జరగనున్న కన్స్యూమర్ ఎలక్ట్రానిక్స్ షోలో ఈ కారు ఆవిష్కరణ జరగనుంది. ఒకవేళ ఈ కారు కనుక అందుబాటులోకి వస్తే ఇక ఒంటరి ప్రయాణాలు తప్పినట్లే!

## అద్భుతమైన హైవే

గ్రామాల మధ్య, నగరాల మధ్య ప్రయాణానికి రోడ్లు ఉంటాయి. కాలువలు-నదులు దాటేందుకు వంతెనలుంటాయి. అయితే బ్రెజిల్‌లో ఒక నగరాన్ని ఇంకో నగరంతో కలిపేందుకు అడవిమార్గం గుండా సముద్రతీరానికి కిలోమీటర్ల పొడవున హైవే నిర్మించారు. బ్రెజిల్ దేశంలోని సో పులా నగరాన్ని అట్లాంటిక్ మహాసముద్రం తీరానికి కలిపే ఈ అద్భుతమైన హైవే పొడవు 58.5 కిలోమీటర్లు. ఈ హైవేను నగరానికీ, సముద్రతీరానికీ మధ్య ఉన్న అడవిపై నిర్మించారు. 6 లైన్లు, 44 చిన్న వంతెనలూ, 7 పెద్ద వంతెనలతోపాటు 11 టన్నెల్స్‌తో నిర్మించారీ హైవేను. అడవిగుండా ప్రయాణమంటే ఎవరికైనా సరే ఉత్సాహం ఉరకలేస్తోంది కదా! అంతే ఆహ్లాదకరంగా ఉంటుంది ఈ హైవే మీద ప్రయాణం కూడా!





## పావురాల హోటల్

కొన్నిచోట్ల పెంపుడు శునకాల కోసం, పెంపుడు పిల్లుల కోసం హోటళ్ళు ఏర్పాటుచేయడం చూశాం. కానీ పక్షులకోసం కూడా టర్కీలో ఓ హోటల్‌ని ఏర్పాటు చేశారు. ప్రత్యేకంగా పావురాల కోసం! చాలా మంది పావురాలు పెంచుకుంటుంటారు. అలాంటి వారికోసమే ఈ ఏర్పాటు. టర్కీలోని డియార్‌బకీర్ ప్రాంతంలో ఈ పావురాల హోటల్ నిర్మించారు. వీటికోసం ప్రత్యేకంగా ముప్పై గదులు ఏర్పాటు చేశారు. ఒకేసారి రెండువేల పావురాలను ఉంచొచ్చు ఇక్కడ. పావురాలు దిగులుగా కనిపించినప్పుడు, కుటుంబం ఎటైనా వెళ్ళాలనుకున్నప్పుడు మరో ఆలోచన లేకుండా వాటిని ఈ హోటల్లో ఉంచేసి వెళ్ళవచ్చు. కాకపోతే కాస్తంత అద్దె చెల్లించాల్సి ఉంటుంది. ఇచ్చే అద్దెను బట్టే గది కేటాయిస్తారు. భలే ఉంది కదూ పావురాలకి ప్రత్యేక హోటల్!

-నర్మద వాసిరెడ్డి



# జీవితమే ఒక ప్రతిఘటన

(కోట శ్రీనివాసరావు కథాకథనం) 12

(గతవారం తరువాయి)

**చిరంజీవిగారితో అదే తొలి సినిమా. మొదటి రోజే ఆలస్యమైంది. ఏమనుకుంటారో ఏమో! అనుకుంటూ కంగారు కంగారుగా 'పరశురాముడు' షూటింగ్ నుంచి బయలుదేరి వెళ్ళాను. కారు డోర్ తీసుకుని విజయ స్టూడియో ఫ్లోర్‌వైపు గబగబా అడుగులు వేశాను.**

అక్కడ విజయబాపినీడుగారు రెడీగా ఉన్నారు. నన్ను చూడగానే ఆయనకి బీపీ పెరిగింది. 'ఏమయ్యా అవతల ఉన్నది ఎవరనుకుంటున్నావ్? పెద్ద నటులందరూ వెయిట్ చేస్తున్నారు. అసలు నీకు పెద్ద స్టార్ హీరో సినిమా అనే భయంలేదు. భక్తి లేదు. నాకు కాల్షీట్ ఇచ్చి అక్కడికి షూటింగ్‌కి ఎందుకు వెళ్లావు? ఎవరు వెళ్లమన్నారు నిన్ను?' అని కేకలేశారు.

'లేదండీ. కృష్ణగారు మీతో మాట్లాడానని చెప్పారు..' అని నేను అంటుండగానే...

'సరే వెళ్లు. మేకప్ వేసుకో. త్వరగా కానీ' అంటూ ఆయన అక్కడి నుంచి వెళ్లిపోయారు.

సరేనని చిరంజీవిగారు ఉన్న చోటుకువెళ్ళాను. ఆయన్ను కలిసి నమస్కారం చేశా.

అక్కడే మోహన్‌బాబుగారు కూడా కూర్చుని ఉన్నారు. వాళ్లిద్దరూ ఏవో జోకులు వేశారు. అంతకు ముందు నేను 'ప్రాణం ఖరీదు'లో నటించాను. కాకపోతే నేను, చిరంజీవిగారు కలిసి చేసింది ఏమీ లేదు. కాబట్టి ఆయనతో కలిసి నటించడం అదే తొలి సారి.

## మెగాస్టార్ సినిమాతో నా గ్రేడ్ పెరిగింది

### కాల్షీట్ సర్దుబాటు తప్పదు

'టెన్షన్ ఏమీ లేదండీ. ఆర్టిస్టుగా బిజీ అవుతున్నకొద్దీ కాల్షీట్ల సర్దుబాటు తప్పదు' అన్నారు చిరంజీవిగారు. ఓ పెద్ద హీరో అలా అనేసరికి కాస్తంత కుదుటపడ్డా. అలా చూస్తుండగానే 'ఖైదీ నెంబర్ 786' పూర్తయింది. మెగాస్టార్‌కి ప్రతినాయకుడుగా అప్పట్లో రావుగోపాలరావు లాంటివారు నటించేవారు. అలాంటి అవకాశం నాకు రావడంతో నాకు ఒక గ్రేడ్ పెరిగిందనిపించింది. ఆ సినిమా విజయవంతంగా ఆడింది.

### చిరంజీవి ప్రశంసలు, సలహాలు

ఆ తర్వాత కొన్నాళ్ళకు సుమన్ హీరోగా నటించిన 'అలెగ్జాండర్' సినిమా విడుదలైంది.

అన్నపూర్ణ స్టూడియో అనుకుంటా. ఒక సెట్లో నేను, పక్క సెట్లో చిరంజీవిగారున్నారు. ఇద్దరం ఎదురుపడ్డాం.

""అలెగ్జాండర్ చూశానండీ. చాలా బావుంది. ఈ పాత్ర మిమ్మల్ని మరో మెట్టు ఎక్కిస్తుంది" అన్నారు చిరు. ఇంకో నటుడి సినిమా గురించి ఆయన మాట్లాడాల్సిన పనిలేదు. అయినా చెప్పారంటే ఆయన సంస్కారం ఎంత గొప్పదో అర్థమైంది.

అలాగే నాకు పద్మశ్రీ పురస్కారం వచ్చినపుడు చిరంజీవిగారు కేరళ నుంచి ఫోన్ చేసి అభినందించారు. మా అబ్బాయి పోయినప్పుడు కూడా చిరంజీవిగారు ఇంటికివచ్చి ఓదార్చారు. నేనెప్పుడైనా ట్రాక్ మారుతున్నాననిపిస్తే సున్నితంగా మందలించేవారు. 'మీరు చాలా మంచి నటులు. ఆరోగ్య పరంగా చాలా జాగ్రత్తలు తీసుకోవాలి' అని కన్నబిడ్డ చెప్పినట్టు చెప్పేవారు. చక్కటి సలహాలు ఇచ్చేవారు.

### బన్నీ మాటలు మరచిపోలేను

డా.వెంకటేశ్వరరావు నిర్మించిన 'రౌడీ అల్లుడు' సినిమాలో నటించాను. అందులో నా క్యారక్టర్ అల్లు రామలింగయ్యగారి పక్కన. తొలి రోజు షూటింగ్‌కి వెళ్లినప్పుడు అల్లు రామలింగయ్యగారు నన్ను పిలిచి, 'జాగ్రత్త జాగ్రత్తయ్యో... అదీ నా పక్కన వేషం. జాగ్రత్తగా చెయ్యి. రావు గోపాలరావుగారి వేషం నీకు వచ్చింది' అని జాగ్రత్తలు చెప్పారు. ఆ సినిమా వంద రోజుల వేడుక నెల్లూరులో జరిగింది. కారులో తీసుకెళ్లారు నెల్లూరికి. అక్కడికి రావుగోపాలరావుగారు వచ్చారు. 'ఇది నేను వేయాల్సిన వేషం. కాల్షీట్లు కుదరలేదు. శ్రీనివాసరావుగారు బాగా చేశారు" అన్నారు.

ఆ తర్వాత ముత్యాలసుబ్బయ్యగారి దర్శకత్వంలో 'అన్నయ్య'లో నటించాను. అందులో మెగాస్టార్‌కి బాబాయ్‌గా చేశా. ఆ తర్వాత 'బావగారు బావున్నారా' అనే సినిమా చేశా. ఆ పాత్రలు కూడా బాగా పండాయి. వరుసగా సినిమాలు చేయడంవల్ల చిరంజీవిగారితో చనువు ఏర్పడింది. వాళ్ల ఫ్యామిలీలో నేనూ ఒక మెంబర్‌లాగా అయిపోయా. ఆ మధ్య అల్లు రామలింగయ్యగారి అవార్డు నాకు ఇచ్చారు. ఆ వేడుకలో బన్నీ మాట్లాడుతూ "నా మనసులో నుంచి వచ్చిన మాట ఇది... తాతగారి అవార్డు ఇప్పటికి చాలా మందికి ఇచ్చారు. ఈరోజు కోట శ్రీనివాసరావుగారికి ఇవ్వడంతో ఆ అవార్డుకి గౌరవం వచ్చినట్టు అనిపించింది" అన్న మాటలు మరచిపోలేను.

### బక్కపలచటి ఓ కుర్రాడు...వర్మ

'ఖైదీ నెంబర్ 786'లో నటిస్తుండగా ఒకరోజు మధ్యాహ్నం మూడున్నర, నాలుగు సమయంలో బాయ్ వచ్చి 'సెట్ బయట ఒకతను మీకోసంవచ్చి వెయిట్ చేస్తున్నారండీ. హైదరాబాద్ నుంచి



వచ్చారట. కలవాలంటున్నారు. ఏదో సినిమా గురించట' అని చెప్పాడు. ఎవరా? అని బయటికి వెళ్లి చూశా. బక్కపలచటి కుర్రాడు కనిపించాడు. నన్ను చూడగానే ఎదురుగా వచ్చి 'నమస్కారమండీ. నా పేరు రామ్‌గోపాల్‌వర్మ. మీరు నన్ను చూశారో లేదో, మీరు 'కలెక్టర్‌గారి అబ్బాయి' చేస్తున్నప్పుడు నేను అక్కడ ఉండేవాడిని' అని ఇంట్రడ్యూస్ చేసుకున్నారు.

'నాగార్జునగారితో ఓ సినిమా చేస్తున్నాను. 'శివ' అని టైటిల్ పెట్టాం. అందులో మీకో వేషం ఉందండీ. దాని గురించి మీతో మాట్లాడదామని వచ్చాను' అన్నారు.

కేవలం నా గురించే వచ్చారో లేదో ఆయనకే తెలియాలి. ఏదైతేనేమీ వచ్చి మాట్లాడారు.

అలా పొరుగూరు నుంచి నాకోసం ఒకరు రావడం, నన్ను కాల్షీట్లు అడగడం అదే తొలిసారి. అంతకు ముందెప్పుడూ అలా జరగలేదు.

'మీరేమీ డేట్లు పెద్ద అడ్జస్ట్ చేయాల్సిన అవసరం లేదండీ. ఒకే ఒక్క రోజు వేషం. మీరు ఉదయాన్నే ఫ్లైట్‌కి వస్తే, ఈవెనింగ్ ఫ్లైట్‌కి పంపించేస్తా' అని చెప్పారు.

ఒకరోజు, రెండు రోజులు వేషాలు చేయను... ఇన్ని రోజులైతే చేస్తాను అని చెప్పే ఆలోచన అప్పట్లో నటులు ఎవరికీ ఉండేది కాదు. ఏ వేషాలు వెతుక్కుంటూ వస్తే అవి చేసుకుంటూ పోవడమే. అంతే. అంతకు మించి ఇంకేమీ తెలిసేది కాదు.

ఆయన చెప్పిన తారీఖు రానే వచ్చింది. హైదరాబాద్‌కి వచ్చా. అన్నపూర్ణ స్టూడియో పక్కనే ఒక గెస్ట్‌హౌస్‌లో దిగా.

### ఓన్ గెటప్, సింపుల్ డైలాగ్స్

నేను అప్పట్లో మామూలుగా పంచెని లుంగీలా కట్టుకుని, పైన తెల్ల చొక్కా వేసుకునేవాణ్ణి. అదే నా వేషధారణ. స్నానాలు చేసి రెడీ అయి ఎప్పట్లా పంచె కట్టుకుని అన్నపూర్ణలో షూటింగ్ అంటే అక్కడికి వెళ్లా. తీరా అక్కడ ఎస్.గోపాల్‌రెడ్డిగారు కనిపించారు. 'శివ' సినిమాకు కెమెరామేన్ ఆయనే. అప్పటికే ఆయనతో 'అహనా పెళ్లంట!' చేసిన అనుభవం ఉంది. పాత పరిచయం కావడంతో నన్ను చూడగానే ఆయన 'ఏం కోటా బావున్నావా? ఏంటి సంగతులు? ఏమేమి సినిమాలు చేస్తున్నావు?' అని ఆత్మీయంగా పలకరించారు. కాసేపు పిచ్చాపాటీ మాట్లాడుకుంటూ ఉన్నాం.

'సరే రెడీ అవ్వు. తర్వాత నీదే షాటు' అన్నారాయన.

'అదేనండీ. ఏం చేయాలో అర్థం కావడంలేదు. అసలు మేకప్ ఏంటో? గెటప్ ఏంటో? డ్రస్సు ఏంటో?

అడుగుదామనుకుంటే ఎవరూ కనిపించడం లేదు. ఎవరిని అడగాలి? ఏమీ అర్థం కావడం లేదు. డైరెక్టర్‌గారు ఎక్కడున్నారో కనిపించడం లేదు. ఒకసారివెళ్లి కలవాలి కదా...' అని అంటున్నా...

'ఏం అవసరం లేదు. మీరేసుకున్న డ్రస్సు సరిపోతుంది. బానే ఉంది. కూర్చోండి' అనే గొంతు వినిపించింది.



### నేను వస్తే వాళ్ల హవా పడిపోతుందా?

"నేను సినిమాల్లోకి వచ్చిన కొత్తల్లో సత్యనారాయణగారు, రావుగోపాలరావుగారు, నూతన ప్రసాద్‌గారు చాలా బిజీగా ఉండేవారు. నా రాకతో వాళ్ల హవా పడిపోతుందని, నా తడాఖా చూపిస్తానని నేనన్నట్టు వాళ్లకి ఎవరో మోశారు. వాళ్లు పట్టించుకున్నారో లేదో నాకు తెలియదు. నాతో మామూలుగానే ఉండేవారు. ఒకసారి నూతన ప్రసాద్ మాత్రం నా దగ్గరికివచ్చి 'ఏంటోయ్ ఇలా అంటున్నావంట' అని అడిగేశారు. 'నాకేం పనండీ బాబూ. నేనేదో నా దగ్గరకు వచ్చిన వేషాలు చేసుకుంటూ పోతున్నాను.

అయినా ఈ పరిశ్రమకి నేను రావడంవల్ల మీ హవా పడిపోవడమేంటి? ఈ గాలి మాటలు నమ్మొద్దండీ' అన్నా. ఆ తర్వాత ఇలాంటి విషయాలు ఎవరూ ఎక్కడా ప్రస్తావించలేదనుకోండి. ఇండస్ట్రీలో మనం ఏమీ అనకున్నా మనమీద నెగెటివ్ ప్రచారాలు చేసేవారు ఉంటారని నాకు తెలియజేసిన సందర్భం అది.."

చూస్తే నా వెనుక నుంచి రామ్‌గోపాల్‌వర్మ గొంతు.

డైరెక్టర్‌గారే చెప్పాక తిరుగేముంది. అలాగే కెమెరా ముందుకు నా కాస్ట్యూమ్స్‌తోనే వెళ్లా.

'వాడెవడో కుర్రాడు.. మిమ్మల్ని మూడు చెరువుల నీళ్లు తాగిస్తున్నాడు'.. అని డైలాగ్ చెప్పమన్నారు రాముగారు. ఒకసారి రిహార్సల్ చేసి, కెమెరా ముందుకు వచ్చి చెప్పేశా.

వెంటనే టేక్ ఓకే అన్నారు. 'బావుంది కదా బావుంది' అని వాళ్లు ఒకరితో ఒకరు అనుకుంటూ వెంటనే రెండో షాట్‌కి వెళ్లారు. అది కూడా సింగిల్ టేక్‌లో ఓకే కావడంతో యూనిట్ అంతా 'షిఫ్ట్ షిఫ్ట్' అన్నారు.

అందరూ హడావిడిగా బయలుదేరారు. అన్నపూర్ణ స్టూడియోనుంచి సికింద్రాబాద్ చేరుకున్నాం. అక్కడ ఓ హౌస్‌లో షూటింగ్. అక్కడికి వెళ్లగానే రాముగారు నా దగ్గరకు వచ్చి

'శివ అంటే నువ్వా, చాలా చిన్న కుర్రాడివయ్యా' అనే డైలాగ్ చెప్పి నన్ను చెప్పమన్నారు.

'ఏంటీ డైలాగ్... ఇంత సింపుల్‌గా ఉండాలా' అని మనసులో అనుకున్నా.

నన్ను తెలంగాణ నేటివ్ అనుకున్నారు నాగార్జున.

నాటకాల్లో నటించడంవల్ల పెద్ద యాక్టర్లతో పనిచేయాల్సి వచ్చినప్పుడు కూడా దడ ఉండేది కాదు నాకు. డైరెక్టర్‌గారు చెప్పింది చేసేవాణ్ణి. అంటే అది పొగరు కాదు. నాటకాలవల్ల వచ్చిన అనుభవం.

నాగార్జునగారి కాంబినేషన్‌లో ఆ డైలాగ్ చెప్పేశా. అంతలో మళ్లీ షిఫ్ట్ షిఫ్ట్ అన్నారు. ఆ గ్యాప్‌లోనే నాగార్జునగారితో మాట్లాడాను.

'విన్నామండీ మీ గురించి. వెరీ గుడ్. చాలా బాగా చేశారు. మీ 'ప్రతిఘటన' అవీ చూశాం' అన్నారు నాగార్జునగారు. హీరో అలా చెప్తుంటే ఆనందంగానే ఉంటుంది కదా. 'థాంక్సండీ' అన్నాన్నేను.

'మీ వాయిస్ విని తెలంగాణ నేటివ్ అనుకున్నామండీ' అన్నారు నాగార్జునగారు.

'కాదండీ... మాది కృష్ణాజిల్లా. కాకపోతే హైదరాబాద్‌లో కొన్నేళ్లు బ్యాంకు ఉద్యోగం చేశాను. ఈ మధ్యనే మద్రాసుకు షిఫ్ట్ అయ్యాను' అని చెప్పి ఆయన దగ్గర నుంచి సెలవు తీసుకున్నా.

సాయంత్రానికి సికింద్రాబాద్ నుంచి అన్నపూర్ణ స్టూడియోకి వచ్చాం.

అక్కడ రఘువరన్ ఉన్నాడు. తనతో కాసేపు మాట్లాడా.

డైనింగ్ టేబుల్‌మీద కూర్చుని తింటుంటే మాట్లాడుతూ మాట్లాడుతూ మెళ్లో ఒక టవల్ వేసి ఊపిరాడనీయకుండా లాగి చంపే సీన్ తీశారు. అది కూడా గంటా గంటన్నరలోపే అయిపోయింది. అప్పుడు సమయం చూస్తే సాయంత్రం ఏడయింది.

రాముగారు దగ్గరికి వచ్చి 'మీ పార్ట్ ఓవర్ సార్ అన్నారు.

అప్పుడు నైట్ ఫ్లైట్‌లు లేవు. అందువల్ల ఆ నైట్ అక్కడే ఉన్నాను.

**(ఇంకావుంది)**

**-డా.చల్లా భాగ్యలక్ష్మి**
**సెల్: 88850 55528**

# మహానంది

(12)



-వక్కంతం సూర్యనారాయణరావ్, సెల్:98662 67287

**కళింగరత్న తన ఏకాంత కక్ష్యలో ఠీవీగా కూచున్నాడు. ఉలూకుడు లోపలికి వచ్చాడు. గుమ్మం వైపు తిరిగి బిగ్గరగా అన్నాడు! "లోపలికి రండి!"**

**ఇద్దరు యువతులు నెమ్మదిగా అడుగులు వేస్తూ గుమ్మం దాటారు. తలలు వంచి కళింగరత్నకు వినయంగా నమస్కరించారు. కళింగరత్న చూపులు వాళ్ళను నఖశిఖ పర్యంతం చూస్తూ ఉండిపోయాయి. పరికిణీలూ, పైటలూ పిటపిటలాడుతున్న వాళ్ళ యవ్వన సౌందర్య సంపదలను తమలో ఇముడ్చుకోవడానికి వ్యర్థ ప్రయత్నం చేస్తున్నాయి. ఇద్దరూ పొట్టిగా, బొద్దుగా ఉన్నారు. దగ్గరగా ఉంటే వాళ్ళను ముట్టుకోకుండా ఉండటానికి చేతుల్ని అదుపు చేయడం కష్టం అనిపించింది కళింగరత్నకు.**

"పేర్లు చెప్పండి!" కళింగరత్న అన్నాడు.

"నా పేరు కేతకి ప్రభూ..." గుండ్రటి ముఖం యువతి అంది. ఆమె కంఠస్వరం వినసొంపుగా ఉంది.

"నేను సుగంధి ప్రభూ.." కోల ముఖం కోమలి అంది.

ఇద్దరివీ విశాల నేత్రాలు. ఎర్రటి పెదవులు. ఆరోగ్యంగా మెరుస్తున్న బుగ్గలు. ఉలూకుడు మంచి అభిరుచి ఉన్న వ్యక్తి. పరిచారికలను చూసి ప్రభువులు పరవశించాలి అన్న నమ్మకం ఉన్నవాడు.

"నీకు వివాహం అయిందా?" కళింగరత్న ఒక యువతిని ప్రశ్నించాడు.

ఇద్దరూ అయోమయంగా చూశారు. యువరాజుగారి మెల్లకన్ను ఎవర్ని చూస్తోంది?

"కేతకీ, యువప్రభువులు అడిగింది నిన్నే!" కళింగరత్న మెల్లకంటి చూపును అర్థం చేసుకోవడంలో ఆరితేరిన ఉలూకుడు అన్నాడు.

"లే...లేదు ప్రభూ.." కేతకి అంది.

"నాకు కూడా పెళ్ళి కాలేదు ప్రభూ.."

"వివాహబంధంలో చిక్కుకోకుండా స్వేచ్ఛగా ఉండేవాళ్ళ కోసం అన్వేషించి, వీళ్ళను ఎన్నిక చేసి తీసుకువచ్చాను యువప్రభూ!" ఉలూకుడు గర్వంగా అన్నాడు.

"ఇది అభ్యంతర మందిరం. ఇక్కడి విషయాలు బైటికి పొక్కకూడదు. అంతఃపుర రహస్యాలు వెల్లడి చేస్తే శిక్ష చాలా చాలా కఠినంగా ఉంటుంది" మెల్లకంటితో బెదిరింపుగా చూస్తూ అన్నాడు కళింగరత్న.

"మేం గుమ్మం దాటి వెళ్ళం ప్రభూ!" సుగంధి ధైర్యంగా అంది.

కళింగరత్న సుగంధి వైపు చిరునవ్వుతో చూశాడు. సుగంధికి చొరవ ఎక్కువ. చొరవ ఎక్కువగా ఉన్న యువతులంటే తనకి చాలా ఇష్టం.

"ఈ మందిరంలో మా అతిథిగా ఉన్న ఒక యువతి సేవకు మిమ్మల్ని నియమిస్తున్నాను. ఆమె అసూర్యంపశ్య! అంటే తెలుసుగా? ఎండ కన్నెరుగని కన్నెపిల్ల! మందిర ద్వారం దాటి ఆమె వెలుపలికి వెళ్ళకూడదు. మీ ఇద్దరూ ఏయే సేవ చేయాలో ఉలూకుడు వివరిస్తాడు..." కళింగరత్న ఉలూకుడి వైపు చూశాడు.

"ఒకరు రాత్రి, ఒకరు పగలు. వంతుల ప్రకారం సేవలు చేయాలి మీరు. అమ్మాయి గారికి అవసరమైన స్నానాదికాలూ, అలంకరణలూ, ఆహార విహారాలూ మొదలైన సేవలన్నీ జాగ్రత్తగా అందించాలి. సూర్యోదయం నుండీ సూర్యాస్తమయం దాకా ఒకరు, సూర్యాస్తమయం నుండీ సూర్యోదయం దాకా ఒకరు. అర్థమైందా కేతకీ, సుగంధీ?" ఉలూకుడు ప్రశ్నించాడు.

ఇద్దరూ తలలు ఊపారు.

"కురంగిని రమ్మనండి. వెళ్ళండి!" ఉలూకుడు ఇద్దరినీ హెచ్చరించాడు.

కేతకీ, సుగంధీ వెనుదిరిగి అడుగులో అడుగు వేసుకుంటూ వయ్యారంగా వెళ్తున్నారు. వాళ్ళ కాళ్ళకున్న అందెలు ఆ నడకకు తాళం వేస్తున్నాయి. కళింగరత్న రెప్ప వేయకుండా చూస్తున్నాడు. ముందు ఎంత అందంగా ఉన్నారో, వెనక వైపూ అంత ఆకర్షణీయంగా ఉన్నారు. వాళ్ళు కనుమరుగయ్యాక అతను చూపులను ఉలూకుడి వైపు మళ్ళించాడు.

"ఈ బొమ్మలను ముందు మా ముందుకు ఎందుకు తీసుకురాలేదు?"

ఉలూకుడు చిన్నగా నవ్వాడు.

"యువ ప్రభువులు విభిన్న అభిరుచులున్న దక్షిణ నాయకులు! తీరిక ఎక్కడిది మీకు? కామినీమణుల

## జరిగిన కథ

**కా**మరూపరాజ్య సర్వసైన్యాధ్యక్షుడు రుద్రాక్షుడిని రాజద్రోహిగా నిర్ధారించి యావజ్జీవ కారాగారశిక్ష విధించాడు మహారాజు కుబేరవర్మ. అతడి కుటుంబాన్ని కూడా రాజద్రోహ పరివారంగా ప్రకటించి, కుమార్తె దీపాంకురకు అంతఃపుర శౌచాలయాలు శుభ్రంచేసే శిక్ష, కొడుకు నందికి రాజ్యబహిష్కార శిక్ష విధిస్తాడు రాజు. పొరుగురాజ్యంలో సత్రం నిర్వాహకురాలి ఆశ్రయం పొందుతాడు నంది. యువరాణి లాలసాదేవికి స్వయంవర ఏర్పాట్లు చేస్తాడు కుబేరవర్మ. స్వయంవరం రోజున, ఆలయానికి వెళ్ళిన యువరాణి మాయమవుతుంది. తన పూర్వీకుల ఇంటి నేలమాళిగనుంచి రహస్యమార్గం ద్వారా యువరాణిని అపహరించి తీసుకుపోతాడు సుకర్మ. ఆమెని కళింగ యువరాజు కళింగరత్నకి అప్పగిస్తాడు.

ఆ తర్వాత......




కైవారాలతో వెసులుబాటులేని విలాస జీవితం కదా! మందిరంలో ఉంటారు. మన సేవకే అంకితమవుతారు. అయినా తమకు అప్సరసను మించిన అందాల యువరాణి అందుబాటులోకి వచ్చింది కద!"

"మాటలతో చక్కిలిగింతలు పెట్టే చతురుడివి నువ్వు. ఆ చెవిటి కురంగితో నువ్వే మాట్లాడు.!"

"మాట్లాడాను యువప్రభూ. మొగుడు పండు ముసలి. ప్రతీ ఉదయమూ అన్నం వండి, అతగాడికి అన్నీ సమకూర్చి రావాలట. రాత్రి పూట ఇంటికి వెళ్ళాలట. పెనిమిటికి తోడుగా. అలాగే అన్నాను."

"సరే...ఆ ముగ్గురి మీదా పర్యవేక్షణ నీదే!" కళింగరత్న ఆజ్ఞాపూర్వకంగా అన్నాడు.

కురంగి ఆదరాబాదరా ఏకాంత కక్ష్యలోకి వచ్చింది. "తల్పం మీద చిన్నది కన్ను తెరిచింది!"

కళింగరత్న తటాలున ఆసనం మీద నుంచి లేచాడు.

"ఉలూకా...పలకరించి వస్తాను." అంటూ వేగంగా అవతలకి నడిచాడు.

కురంగి అతని వెంట నడువసాగింది. ఉలూకుడు ఆమెను ఆపలేదు. యువరాజుగారికి అందుబాటులో ఆమె ఉండడం మంచిది. రాకుమారికి సంబంధించిన అత్యవసర కార్యాలు ఏవైనా ఉంటే, ఆమెకు అప్పగిస్తారు. ఉలూకుడు ఆలోచిస్తూ వాతాయనం ముందుకు నడిచాడు. కేతకినీ, సుగంధినీ ఎంపిక చేయడం కేవలం రాకుమారి కోసమే కాదు; తన కోసం కూడా! వాళ్ళ మీద యువరాజుగారి కళ్ళు పడ్డట్టున్నాయి. కామరూప రాకుమారి ప్రస్తావనతో ఆయన మెల్లకంటి చూపుల్ని తెలివిగా మళ్ళించాలి!

•••

కళింగరత్న రాకుమారి లాలస ఉన్న శయనాగారం తలుపు తోసుకుంటూ లోపలకి వెళ్ళాడు. అతని వెనకే నీడలా కదులుతూ వెళ్ళిన కురంగి చప్పుడు కాకుండా తలుపులు మూసింది.

మంచం మీద వెల్లకిలా పడుకున్న లాలస కళింగరత్న అడుగుల చప్పుడు విని, కళ్ళు తెరిచింది. పీడకలలో ఎవర్నో చూస్తున్నట్టు ఇద్దర్నీ చూస్తూ ఉండిపోయింది. కళింగరత్న మంచం దగ్గరగా ఆగి, ఆమె వైపు చిరునవ్వుతో చూశాడు. దీర్ఘరోగంతో

తీసుకుంటూ, అప్పుడే కోలుకున్న దానిలా నీర సంగా చూస్తోంది లాలస. ఒక చోట పడుకుని నిద్ర పోయి, విచిత్రంగా వేరొక చోట మేల్కొన్న దానిలా ఉందామె.

"రాకుమారీ..." కళింగరత్న అన్నాడు.

లాలస పెదవులు కదిలాయి. "ఎ..ఎ..ఎవరు మీరు?"

"నేను నీ శ్రేయోభిలాషిని. నీ యోగ క్షేమాలు కాపాడేవాడిని. భయపడకు. నువ్వు సురక్షిత స్థానంలో ఉన్నావు..."

ఏకవచనం ప్రయోగిస్తూ మాట్లాడుతున్న మెల్లకంటి వ్యక్తిని అయోమయంగా చూసింది లాలస. మాట్లాడుతున్నప్పుడు అతని పెదవుల సందు లోంచీ గొగ్గిరి పళ్ళు కనిపిస్తున్నాయి. పీడకలలో ప్రత్యక్షమైన వికార స్వరూపుడిలా ఉన్నాడతను. తను కలగంటోందా? లేక..లేక...మేలుకునే ఉందా? లాలస ఆలోచిస్తూ అటూ ఇటూ తలను కదిల్చింది. కొద్దిగా లేచే ప్రయత్నం చేసి, బలహీనంగా వాలిపో యింది. ఎత్తుగా, లావుగా ఉన్న ఆ వ్యక్తి వెనుక కొద్దిదూరంలో నిలుచుని తనవైపే చూస్తున్న వృద్ధ రాలి వైపు చూస్తూ లాలస మెల్లిగా చేతిని తన కళ్ళ మీదికి తీసుకెళ్ళింది. అరచేత్తో కళ్ళు మూసి, రెప్పల మీద కొద్దిగా రుద్ది, చేతిని తీసివేసి చూసింది. తన కళ్ళ ముందు దృశ్యం మాయం కాలేదు!

అతని పెదవులు కదిలి గొగ్గిరి పళ్ళను ప్రద ర్శిస్తూ, నవ్వును సృష్టించాయి. "ఇది కల కాదు రాకు మారీ... .నిజమే! నేనొక రాజకుమారుడిని. ఒక రాజ్యానికి యువరాజును. కాబోయే చక్రవర్తిని! మిగి లిన విషయాలు నువ్వు పూర్తిగా కోలుకున్నాక వివరంగా చెప్తాను. నీకోసం బలవర్ధకమైన ఆహారం సిద్ధంగా ఉంది. కొన్ని ఘడియలలో నీరసాన్ని మాయం చేసే అద్భుతమైన ఔషధం ఉంది. పాలతో ఆ ఔషధాన్ని సేవించి, ఆ తరువాత ఆహారం తీసుకో. కోల్పోయిన సత్తువ తిరిగి వస్తుంది. ఈ పరిచారిక అన్నీ చూసుకుంటుంది."

కళింగరత్న కురంగి వైపు తిరిగాడు. ఆమెకు లాలసను చేత్తో చూపించాడు. ఆమె అర్థమైనట్టు తల ఆడించింది. కళింగరత్న మళ్ళీ లాలస వైపు తిరిగాడు. "ఔషధం, ఆహారం, విశ్రాంతి! సాయంత్రం లోగా తేరుకుంటావు. అప్పుడు అన్నీ విన్నవిస్తాను!" అన్నాడు చిరునవ్వుతో...

•••

కళింగరత్న తన ఏకాంత కక్ష్యకు తిరిగి వచ్చాడు. అతడిని అనుసరించి వచ్చిన కురంగి ప్రశ్నార్థ కంగా చూస్తోంది. కళింగరత్న తన దుస్తులలోంచీ తీసిన చిన్న బంగారు భరిణెను ఉలూకుడికి అందించాడు. పాలలో ఎంత మోతాదు వేసి రాకు మారికి ఇవ్వాలో తగ్గు స్వరంతో వివరించాడు. ఆమెకి అవసరమైన పరిచర్యల గురించీ, అందిం చాల్సిన ఆహారం గురించీ వివరించాడు. విశ దంగా కురంగికి వినిపించేలా, అర్థమయ్యేలా చెప్పమన్నాడు. పరిచర్యలు చేయడానికి నియ మించిన యువతులలో ఒకరు పాకశాలలో రాకు మారి కోసం వంట చేస్తున్నారేమో చూడ మన్నాడు.

"చిత్తం!" అంటూ ఉలూకుడు కురంగి చేతులు పట్టుకుని తనతో తీసుకువెళ్ళాడు.

కళింగరత్న వాతాయనం ముందుకు నడిచాడు. దూరంలో నగర భవనాల పైకి పొడుచుకు వచ్చి ధగధగలాడే కలశాలతో అవుపిస్తున్న రాజభవనం వైపు చూస్తూ ఆలోచనలో మునిగిపోయాడు. తాను నిర్ణయించుకున్న మూడు సాహసాలలో ఒకటి విజయవంతంగా ముగిసింది. అది; రాకుమారి లాలసను అపహరించి, అధీనంలోకి తీసుకోవడం. అది మొదటి సాహసం. లాలసను వివాహం చేసు కునే అంశంలో తల్లిదండ్రులను అంగీకరింప చేయడం రెండవ సాహసం, లాలసను మాంగల్య బంధంతో బంధించడం, మూడవ సాహసం. లాలస అంగీకరించకపోయినా తృతీయ సాహసం కార్యరూపం ధరించాలి. తన తల్లిదండ్రులు అంగీక రించకపోయినా అది కార్యరూపం ధరించాలి.

తనకు తెలుసు; తనను పెళ్ళాడ్డానికి లాలస అంగీకరించదు! సామ్రాజ్యం మధ్య ఉన్న సంప్ర దాయానికి విరుద్ధంగా, అమర్యాదకరంగా, సాటి చక్రవర్తి కుమార్తెను తాను పెళ్ళాడ్డానికి తన తల్లి దండ్రులు అంగీకరించరు! రెండూ నిరాకరణ సహ జాలే! అయితే తల్లిదండ్రుల నిరాకరణను అంగీ కారంగా మలిచే అతి శక్తిమంతమైన ఆయుధం తన చేతిలో ఉంది! అతి నిశితమైన ఆ ఆయు ధానికి రూపం లేదు. దాని పేరు; ఆత్మహత్య! అపహరించి తెచ్చిన రాజకుమారిని చేసుకొమ్మం

**వాతాయనం ముందు నిలబడి ఆలోచిస్తున్నాడు కళింగరత్న. తాను చేయదలచుకున్న మూడు సాహసాలలో ఒకటి విజయవంతంగా పూర్తయిందనుకున్నాడు. మిగిలిన రెండూ ఎలా నిర్వహించాలా అనే దీర్ఘాలోచన అది. ఒకవేళ ఆ రెండింటికీ అడ్డంకులు ఎదురైతే... ఆయుధం ఉండనే ఉంది అనుకున్నాడు. లోలోపల ఆనందించాడు. ఇంతకీ అతడు చేయదలుచుకున్న ఆ రెండు సాహసాలు ఏమిటి? వాటిని సాధించటానికి అతడెంచుకున్న ఆయుధం ఏమిటి?**

టారా? ఆత్మహత్య చేసుకొమ్మంటారా? అంటే చాలు! ఒక్కగానొక్క కుమారుణ్ణి, వంశానికి ఏకైక వార సుణ్ణి, తరతరాల సింహాసనానికి ఉన్న ఒక్కగానొక్క వారసుణ్ణి, భావి చక్రవర్తిని శాశ్వతంగా పోగొట్టు కునే మూర్ఖులు కారు తన తల్లిదండ్రులు!

కళింగరత్న ఆలోచనలు పర్యవసానం వైపు పరుగులు తీశాయి. తమ గారాల కూతురిని అప హరించి, అక్రమంగా, వివాహం చేసుకున్న కళింగ యువరాజు మీద పగతో ప్రతీకార చర్యగా కామ రూప రాజ్య చక్రవర్తి కళింగరాజ్యం మీద దండ యాత్ర చేస్తాడా? చేయడు! కళింగరత్న చిరు నవ్వుతో అనుకున్నాడు.

దండయాత్ర చేయాలని ఆవేశపడి, ఆలోచ నతో విరమించుకుంటాడు. కూతురి మెడలో తాళి కట్టిన అల్లుడిని, కళింగ సామ్రాజ్య చక్రవర్తిని సర్వ నాశనం చేసి, పుత్రిక జీవితాన్ని బుగ్గిపాలు చేయడు! కళింగరత్న తేలికగా ఊపిరి పీల్చుకుని, ఒళ్ళు విరుచుకున్నాడు. ఈ తర్కం, ఈ వాదన తన తల్లి దండ్రుల అనుమతి సంపాదించడంలో తనకు ఉపయోగపడుతుంది. ఉపయోగపడకపోతే చిట్ట చివరి బ్రహ్మాస్త్రం-ఆత్మహత్య బెదిరింపు ఉండనే ఉంది! అదీ ఫలితం ఇవ్వకపోతే, తల్లిదండ్రులు లెక్కచేయకపోతే తను కంసుడిని ఆదర్శంగా తీసుకుంటాడు. కన్నతండ్రిని కారాగారంలో కట్టి పడేస్తాడు! తండ్రికి చెరసాల, తల్లికి అంతఃపుర నిర్బంధం! తనకు లాలస కావాలి. ఎవరు ఏమై పోయినా ఇబ్బంది లేదు. కళింగరత్న హాయిగా కూనిరాగం తీస్తూ మంచం మీద వాలాడు.

•••

లాలస అద్దాల వాతాయనం ముందు నిలుచుంది. ఎందుకో ఆమెకి తాను ఇప్పుడే కొత్తగా ఈ లోకం లోకి వచ్చినట్టు అనిపిస్తోంది. శయనాగారం కొత్తగా ఉంది. భవంతి కొత్తగా ఉంది. వాతాయ నంలోంచీ కనిపిస్తున్న దృశ్యం కొత్తగా ఉంది. స్నానాలయం కొత్తగా ఉంది. వృద్ధ పరిచారిక కొత్తగా ఉంది! గాఢనిద్రలో ఏదో కల తెరలు తెర లుగా గుర్తొచ్చినట్టు ఏవేవో దృశ్యాలు గుర్తొస్తు న్నాయి, ధూళి కట్టిన అద్దంలోంచీ కనిపించే మసక మసక ప్రతిబింబాల్లా!

ఆ సుదీర్ఘ స్వప్నంలో తనను చెలికత్తెలు నిలువు టద్దం ముందు నిలబెట్టి సింగారిస్తున్నారు. అద్దంలో తన అందాలను చూసి కిలకిలమంటూ నవ్వుతు



న్నారు.

తను పల్లకిలో కూచుంది. నగర వీధుల్లో పల్లకి వెళ్తోంది...ఏదో ఆలయం. ఆలయంలో తను తపస్సు చేస్తోంది. ఆలయంలో తను తపస్సు చేస్తోంది. ఆలయంలో తపస్సు! ఆలయంలో ఎవరైనా అర్చనలు చేస్తారు. ఆరాధనలు చేస్తారు. తను విచిత్రంగా తపస్సు చేస్తోంది! పిచ్చి పిచ్చి కల!

వృద్ధ పరిచారిక తనను నీడలా అనుసరిస్తూ, సేవలు చేస్తూ ఉండిపోయింది. పలకదు. పలకరిస్తే వినిపించుకోదు! చెవుడా? ఆమె ఇచ్చిన పాలు తాగినప్పటి నుండీ ఏదో శక్తి తన నరాల్లో ప్రవహించినట్టుగా అనిపిస్తోంది. మెదడును కప్పిన ఉలిపిరి మంచు తెరలు ఒకదాని తరువాత ఒకటి తొలగిపోతున్నట్టు అనిపిస్తోంది. ఆహారం స్వీకరించిన అనంతరం నీరసం దూరమవుతోంది.

లాలస ప్రకృతిని తిలకించడం మాని, మంచం వైపు నడిచింది. వృద్ధ పరిచారిక బంగారు దీప స్తంభాలలో వేసిన వత్తుల్ని చిన్న ప్రమిదలోని దీపకళికతో వెలిగిస్తోంది. లాలస మంచం మీద వాలి కళ్ళు మూసుకుంది. తనను ఏకవచనంతో పలకరిస్తూ మాట్లాడిన వ్యక్తి గుర్తుకు వచ్చాడు ఆమెకు. అందంగా లేకపోయినప్పటికీ, అతను ఠీవీగా ఉన్నాడు. అతని వస్త్రధారణా, ఆభరణాలూ రాజరికాన్ని కంటికి కట్టుతున్నాయి.

కాలం నిమిషాల రూపంలో కరిగిపోతోంది. ఆలోచనల ఊబిలో కూరుకుపోయిన లాలస మస్తిష్కాన్ని ఆవరించిన మంచుతెరలు నెమ్మది నెమ్మదిగా ఆవిరైపోతున్నాయి. ఆమెకు తల్లీ, తండ్రీ గుర్తుకు వస్తున్నారు. ఆంతరంగిక చెలికత్తెలు గుర్తుకు వస్తున్నారు. వాళ్ళందరూ ఎక్కడున్నారు? తను ఎక్కడుంది?

చిరుగంటల మోతతో తలుపు తెరుచుకుంది. అతను, మెల్లకంటి వ్యక్తి లోపలికి వచ్చాడు. అతని వెనకే లోనికి వచ్చిన వృద్ధ పరిచారిక తలుపు మూసి, గొళ్ళెం బిగించింది. మెల్లకంటి వ్యక్తి పరిచారికకు కంటితో సైగ చేశాడు. ఆమె కొంచెం దూరంలో ఉన్న ఒక ఆసనాన్ని మంచం దగ్గరగా జరిపింది. అతను ఠీవీగా దాని మీద కూర్చుని, లాలస వైపు చిరునవ్వుతో చూశాడు. అతను తనను కాకుండా తన పక్కగా ఉన్న దేనినో చూస్తున్నట్టు అనిపించింది లాలసకు. మెల్లకన్ను ప్రభావం! అతను చిన్నగా దగ్గి గొంతు సవరించుకున్నాడు.

"లాలసా, నా పేరు కళింగరత్న. చక్రవర్తి కుమారుణ్ణి. మా తండ్రిగారు అధిష్ఠించిన సింహాసనాన్ని అధిష్ఠించబోయే భావి చక్రవర్తిని..?"

"నేను ఎక్కడున్నాను? ఇక్కడికి ఎలా వచ్చాను...? అంతా ఏదో కలలాగా ఉంది..." రెండు అరచేతులతో కణతల్ని నొక్కుకుంటూ అంది లాలస.

కళింగరత్న తలపంకించాడు. "అన్నీ సావధానంగా వివరిస్తాను. భయమూ, ఆందోళనా లేకుండా, శాంతంగా ప్రశాంతంగా ఆలకించు. తాత్కాలికంగా నువ్వు నీ గతాన్ని మరిచిపోయి ఉంటావు. నేను గుర్తు చేస్తాను. నువ్వు కామరూప చక్రవర్తి దంపతుల ఏకైక పుత్రికవు. నీ తల్లిగారి పేరు మహిమాదేవి. తండ్రిగారి పేరు కుబేరవర్మ. నీ స్వయంవరం జరగాల్సిన ముహూర్తాన నేను నిన్ను అపహరించి తీసుకువచ్చాను..."

లాలస వణికిపోతూ చూసింది. ఆమె ఆశ్చర్యంతో, అప్రయత్నంగా అరచేతితో నోటిని కప్పుకుంది.

"ఏమాత్రమూ అపాయం కలిగించని, దివ్యమైన మత్తుమందును నీకు వాసన చూపించి స్పృహ కోల్పోయేలా చేసి, తీసుకువచ్చాను.." కళింగరత్న పునః ప్రారంభించాడు. లాలస విశాల నేత్రాలను గిన్నెల్లా చేసుకుని మంత్రముగ్ధలా వింటోంది. ఆపకుండా, ఏ విధమైన ఉద్రేకమూ, ఆవేశమూ లేకుండా వల్లెవేస్తున్నట్టు చెప్పుకు పోతున్నాడతను. అతని మాటలు తనలోని 'మరపు' అనే అడ్డంకులను మెల్లిమెల్లిగా తొలగించి వేస్తున్నాయి. అతని మాటలు లాలసకు స్వయంవరం నాటి సంఘటనలను దృశ్యాలుగా చూపిస్తున్నాయి. తను ఏకాగ్రతతో ఆలకించాలి. అర్థం చేసుకోవాలి. అతను అంటున్నాడు! ఆమె వింటోంది.

"నీ సౌందర్యం నన్ను కట్టిపడవేసింది. వివాహం చేసుకుంటే నిన్నే చేసుకోవాలనుకున్నాను. స్వయంవరం జరిగితే నువ్వు నన్ను వరించవు. నా అందవికారం నీకు అడ్డు వస్తుంది! నీ స్వయంవరం జరగకూడదు. నువ్వు నన్ను తప్పించి వేరొకరిని వివాహం చేసుకోరాదు. నేను నిన్ను వరించాను. అది నా 'స్వయంవరం'..." కళింగరత్న ఆగి చిరునవ్వు నవ్వాడు.

లాలస కళ్ళల్లో భయం ప్రత్యక్షమైంది. ఆమె పెదవులు అదిరాయి. కళింగరత్న చిరునవ్వుతో మళ్ళీ అందుకున్నాడు.

"నీకు తెలిసే ఉండాలి. వివాహాలు ఎనిమిది రకాలు! బ్రహ్మం; దైవం; ఆర్య; ప్రాజాపత్యం; అసురం; గాంధర్వం; రాక్షసం; పైశాచం-అనేవి ఆ ఎనిమిదీ. వాటిలో మనకు అంటే క్షత్రియులకు తగినవి రెండు; మొదటిది గాంధర్వం, రెండవది రాక్షసం.

ఇద్దరూ ఇష్టపడి చేసుకునేది 'గాంధర్వ వివాహం', కన్యను అపహరించి తెచ్చి చేసుకునేది 'రాక్షస వివాహం'. నిన్ను అపహరించి తెచ్చాను. అది రాక్షస వివాహంలోని మొదటి మెట్టు. అయితే నిన్ను బలవంతంగా, రాక్షసంగా వివాహం చేసుకోవాలన్న నియమమూ, పట్టుదలా నాకు లేవు! గాంధర్వ వివాహం చేసుకోవడానికి నాకు ఏ విధమైన అభ్యంతరమూ లేదు. అయితే అందుకు నువ్వు అంగీకరించాలి. అంగీకారం నీ ఇంగితం మీద ఆధారపడి ఉంటుంది! నువ్వు కాదంటే 'రాక్షసం' ఉండనే ఉంది. ఎలాగా దానికి, దాని పద్ధతిలో ప్రారంభోత్సవంగా కన్యాపహరణ జరిగిపోయింది! అర్థమైందా?"

లాలస కొన్ని క్షణాలపాటు అతని ముఖంలోకి తదేకంగా, రెప్పపాటు అనేది లేకుండా చూస్తూ ఉండిపోయింది. ఆమె కళ్ళ కొసల్లో ఎర్రజీర వ్యాపిస్తోంది. అదురుపాటు లేకుండా ఆమె పెదవులు కదిలాయి. "అర్థమైంది. నీ ప్రయత్నం వ్యర్థమవుతుంది!"

కళింగరత్న గుబురు కనుబొమలు గొంగళి పురుగుల్లా కదిలి, మధ్యలో కలుసుకున్నాయి.

## ప్రియాంక మరిచిపోలేదట!

హాలీవుడ్‌కి వెళ్ళిన తరువాత ప్రియాంక బాలీవుడ్‌ని మరిచిపోయిందన్న వార్తలు బాగానే వినిపించాయి. ఇందుకు తగినట్టుగానే ప్రియాంక చాలా రోజులుగా బాలీవుడ్‌లో ఒక్క సినిమా కూడా చేయలేదు. బాలీవుడ్‌ను ప్రియాంక, ప్రియాంకను బాలీవుడ్ మరిచిపోవచ్చన్న వార్తలు అక్కడ బాగా షికారు చేస్తున్నాయి. ఇవి ప్రియాంక దాకా వెళ్ళినట్టున్నాయి. వెంటనే స్పందించేసింది. హాలీవుడ్‌లో షూటింగ్‌లతో బిజీగా ఉండి బాలీవుడ్ సినిమాలు చేయలేకపోతున్నాననీ, త్వరలో పనులన్నీ పూర్తి చేసుకుని బాలీవుడ్ వచ్చి ఓ రెండు మూడు సినిమాలు వరుసపెట్టి చేస్తానని ట్వీట్ చేసింది. ఏదో కంటి తుడుపు చర్యగా ప్రియాంక ఆ ట్వీట్ చేసిందే తప్ప ఆమె బాలీవుడ్‌కి వచ్చి సినిమాలు చేయడం కల్ల అని బాలీవుడ్ జనాలు అంటున్నారు.

మెల్లకన్ను కొద్దిగా మూతపడింది. మరుక్షణం అతను గొల్లున నవ్వాడు. కాసేపు నవ్వుతూ ఉండిపోయాడు. లాలస కళ్ళు అతని ముఖం మీదికి ఆగ్రహ కిరణాలను ప్రసరిస్తున్నాయి. చెవిటి పరిచారిక నిర్వికారంగా, నిశ్చింతగా రాతి బొమ్మలా నిలుచునే ఉంది. కళింగరత్న కర్ణకఠోరంగా ఉన్న తన నవ్వును తటాలున ఆపేశాడు. లాలస కళ్ళల్లోకి చూశాడు.

"నిన్ను హృదయపూర్వకంగా మెచ్చుకుంటున్నాను! నువ్వు సానుకూలంగా స్పందించి ఉంటే నేను నిరుత్సాహంలో మునిగిపోయేవాణ్ణి. ఎందుకో తెలుసా? ఆత్మగౌరవం, అభిమానం, ధైర్యం ఉండే యువతి నా భార్య కావాలి. భావి పట్టపురాణికి ఆ లక్షణాలు అవసరం! నిజమైన క్షత్రియ కన్యలాగా, ధైర్యంగా, నిర్భయంగా సమాధానం చెప్పావు! నీ స్పందనతో నీ మీద ఇష్టం ఎత్తుగా ఎదిగి, శిఖరాగ్రాన్ని అందుకుంది.

తొందరేం లేదు.. ఆలోచించు. నువ్వు తప్పించుకోలేవు. నువ్వు నా హృదయంలో ఉన్నావు. నా సదనంలో ఉన్నావు. గాంధర్వమా, రాక్షస వివాహమా నిర్ణయించుకో. శుభముహూర్తం నిర్ణయించి ఉంచుతాను. తెలియజేస్తాను. తెలివితో వ్యవహరించు!" కళింగరత్న గర్వంగా అన్నాడు.

ఆసనం మీద నుండీ లేచి, కురంగి వైపు చూశాడు. చూపులను లాలస వైపు మళ్ళించాడు. హంసతూలికా తల్పం మీద కూర్చున్న భంగిమలో ఉంచిన అపరంజి బొమ్మలా ఉందామె, అతని చూపులకి.

"కురంగి రాణివాస సేవలలో ఆరితేరింది. కంటితో చెబితే చాలు! పరిచర్యలు చేస్తుంది!" కళింగరత్న గంభీరంగా ద్వారం వైపు నడిచాడు. లాలస తల కొద్దిగా వాల్చి తన పెద్ద పెద్ద కళ్ళతో తీక్షణంగా చూస్తోంది!

•••

లాలస అప్రయత్నంగా లేచి, వాతాయనం ముందుకు నడిచింది. మత్తు మందు ప్రభావంతో తన మస్తిష్కాన్ని ఆవరించిన మంచు తెరలు కరిగిపోయాయి. ఆ స్థానంలో కారు మేఘాలు కమ్ముకున్నాయి. తెరలు కరిగిపోవడానికీ, మేఘాలు కమ్ముకోవడానికీ కారణం కళింగరత్న అనే నీచుడి ఉపన్యాసమే! లాలస మళ్ళీ మంచం వైపు తిరిగింది. కురంగి తన ముఖంలోకి ప్రశ్నార్థకంగా చూస్తోంది. కురంగి ఒక నీడ. ఆ నీడ ఉనికి తనకు నచ్చడం లేదు. లాలస అవతలకి వెళ్ళమన్నట్టు కురంగికి చేత్తో సైగ చేసింది. కురంగి అడుగుల చప్పుడు లేకుండా నిష్క్రమించింది. ఆమెను మాయం చేస్తూ తలుపు మూసుకుంది. గొళ్ళెం పెట్టిన చప్పుడు లాలసకు వినిపించింది. తను నిర్బంధంలో ఉంది! మంచం మీద కూర్చుంది.

ఆమె మేధోశక్తి సమీప గతంలోకి దూసుకు వెళ్తోంది. స్వయంవరం నాటి సంఘటనలు ఒకదాని తరువాత ఒకటి, క్రమం తప్పకుండా గుర్తొస్తున్నాయి. చంచలా, చపలా తనకు అలంకరణ చేస్తున్నారు. తన అందాలను పరోక్షంగా వర్ణిస్తున్నారు. తల్లిదండ్రుల పాదాలకు నమస్కరించి తను ఆలయానికి బయలుదేరింది. రాజవీధిలో పల్లకి మీద వెళ్తోంది తను. ఎన్నో రథాలు కనిపిస్తున్నాయి. ఆలయంలో అర్చకుడు అర్చన చేస్తున్నాడు. దేవి విగ్రహం ముందు తను ధ్యానంలో కూర్చుంది. అంతే! తరువాత ఎప్పుడో ఈ శయనాగారంలో మేలుకుంది.

లాలసకు ఏదో గుర్తొచ్చింది. మంచం దిగి, నిలువుటద్దం ముందుకు నడిచింది. ప్రతిబింబాన్ని పరిశీలనగా చూసింది. ఆశ్చర్యంతో ఆమె కళ్ళు విచ్చుకున్నాయి. వస్త్రాలు తనవి కావు! ఒంటి మీద ఆభరణాలు లేవు! కేవలం నాసికాభరణం, కర్ణాభరణాలు మాత్రమే ఉన్నాయి! 'కాబోయే చక్రవర్తి' అని తన గురించి చెప్పుకున్న మెల్లకన్ను వ్యక్తి తన నగలను ఒలుచుకున్నట్టున్నాడు.

అవునంటే గాంధర్వ వివాహం! కాదంటే రాక్షస వివాహం! దౌర్భాగ్యుడు! వాడి శరీరమే కాదు; మనసు కూడా వికారంగానే ఉన్నట్టుంది! సిగ్గులేకుండా, సంకోచం లేకుండా తను చేసిన నేరం గురించి చెప్తున్నాడు; గర్వంగా. అతనికి నిలువెల్లా అహంకారమే అన్న సత్యాన్ని అతని మాటలు చాటింపు వేశాయి! తన ధైర్యం నచ్చిందట! దరిద్రుడు...తన ధైర్యం గురించి వాడికేం తెలుసు? తనకు తెలుసు! కళింగరత్న...అంటే... అంటే వీడు కళింగ సామ్రాజ్య చక్రవర్తి కుమారుడా?! కావచ్చు. అందగాడైనా, సుందరాంగుడైనా, వాణ్ణి తను వివాహం చేసుకోదు! దొంగతనంగా అంతఃపుర కన్యను అపహరించి తెచ్చిన కన్యాచోరుణ్ణి తాను భర్తగా అంగీకరించదు.

లాలసలో ఆలోచనలు నిర్విరామంగా సాగుతున్నాయి. ఆలయంలో, గర్భాలయం ముందు తలుపులు మూసిన మండపంలో ధ్యానంలో ఉన్న తనను ఎలా అపహరించారు? అర్చకులూ, పరిచారికలూ ఏమయ్యారు? కామరూప నగరం నుండి అంత ధైర్యంగా, అంత రహస్యంగా తనను ఎలా తీసుకురాగలిగారు? ఆలయంలో తను ధ్యానంలో ఉన్నప్పుడు, మూసిన తలుపుల ముందు అర్చకులూ, పరిచారికలూ అప్రమత్తంగా, జాగ్రత్తగా ఉంటారు. అలాంటి ఏకాంత ప్రదేశం నుండి తనను అపహరించారు. ఇప్పుడు తను ఒక మందిరంలో ఉంది. వాతాయనంలోంచీ చూస్తే, మందిరం నేల కంటే ఎత్తు ప్రదేశంలో ఉన్నట్టు తెలుస్తోంది. ఈ మందిరంలోంచీ తను బైటపడాలి. కక్ష్యలూ, ద్వారాలూ, తనకు తెలియాలి. ఇక్కడి నుండి తప్పించుకుని ఆలయంలోంచి తనను తప్పించి తీసుకొచ్చిన అహంకారిని వెక్కిరించాలి తను! మంచి ముహూర్తం చూస్తానన్నాడు వాడు. అంటే తనకు ఎంతో కొంత సమయం ఉంది.

**(ఇంకా వుంది)**

## అమీవి మామూలు వేషాలు కాదు

*ఎక్స్‌పోజింగ్‌కు కేరాఫ్ అడ్రస్‌గా ఉంటుంది అమీ జాక్సన్. ఆమె ఫోటోలు చూస్తే ఈ సంగతి ఎవరికైనా ఇట్టే అర్థమైపోతుంది. ఇప్పటి వరకూ సినిమాలకే పరిమితమైన అమీ గ్లామర్ ఇపుడు సోషల్‌మీడియాలో పోస్ట్ చేసే ఫోటోలకూ అంటుకుంది. మొన్నీమధ్య అమీ ఓ ఫోటోను ఇన్‌స్టాగ్రామ్‌లో పోస్ట్ చేసింది. ఆ ఫోటో చూసి అమీ ఇంతగా దిగజారిపోయిందే అని ప్రతి ఒక్కరూ విమర్శిస్తున్నారు. అయితే ఈ ఫోటోలో తన ముఖం కనపడకుండా అమీ జాగ్రత్త పడడం విశేషం. ఏమైనా అందాలను చూపించడంలో అమీ తరువాతే ఎవరైనా. ఈ విషయాన్ని ఆమె అభిమానులే కాదు, సినీ జనాలు కూడా ఏకగ్రీవంగా ఒప్పేసుకుంటున్నారట!*

# హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో
## 'ఆస్టియో ఆర్థరైటిస్'కు సరైన వైద్యం


డా. శ్రీకాంత్ మోర్లావర్
CMD
హోమియోకేర్ ఇంటర్‌నేషనల్




మన శరీర ప్రతి కదలికలో 'కీళ్ళ' పాత్ర అత్యంత కీలకమైనది. అంతటి ప్రాధాన్యం సంతరించుకున్న 'కీళ్ళ' పరంగా ఏ చిన్న మార్పు ఏర్పడినా అది మన కదలికలను కష్టతరంగా మార్చి, రోజువారీ దినచర్యల నిర్వహణలో సైతం తీవ్ర ఇబ్బందులను కలుగజేస్తుంది. అలాంటి మార్పుల వలన తలెత్తే ఆస్టియో ఆర్థరైటిస్ సాధారణంగా ఎక్కువ మందిలో కనిపిస్తుంది. కొందరిలో వయస్సు పైబడటం వలన ఈ వ్యాధి ఏర్పడితే, మరికొందరిలో కీళ్ళకు దెబ్బతగలటం, కొన్ని అసాధారణ కదలికలు, జీవక్రియల అసమతుల్యతలు, కీళ్ళు సంక్రమణకు గురికావడం మొ॥గు కారణాలతో పాటు కొన్ని ఇతర వ్యాధులకు గురి అయిన కారణంగా కూడా 'ఆస్టియో ఆర్థరైటిస్' ఏర్పడే అవకాశం ఉంది. కాబట్టి దీనిని యుక్తవయస్సు వారిలో కూడా ఎక్కువగా గమనించడం జరుగుతోంది. దీర్ఘకాలికంగా ఈ వ్యాధికి గురికావడం వలన, ఇది కీళ్ళను పూర్తిగా దెబ్బతీసి అంగవైకల్యానికి గురిచేసే ప్రమాదం పొంచి ఉంటుంది. ఇతర వైద్యవిధానాల మేరకు నొప్పి నివారణకు ఉపయోగించబడే మందుల వలన కేవలం తాత్కాలిక ఉపశమనం తప్పించి పూర్తిగా వ్యాధి నయం కాబడే అవకాశం లేదు. కానీ సరైన హోమియో చికిత్స ద్వారా ఏ వయస్సుల వారికైనా ఈ వ్యాధి నుండి పూర్తిగా ఉపశమనం లభించే అవకాశం ఉంది. ఆర్థరైటిస్ అనగా కీళ్ళు శోథమునకు గురికావడం. సుమారు 100 రకాలుగా కనిపించే ఈ తరహా సమస్యలలోకెల్లా 'ఆస్టియో ఆర్థరైటిస్' ప్రధానమైనది మరియు సాధారణమైనది.



Healthy joint Osteoarthritis

**'ఆస్టియో ఆర్థరైటిస్' అనగా:** కీళ్ళలోని కార్టిలేజ్ అనే మృదులాస్థి అరుగుదలకు గురి అయి, తద్వారా చుట్టూ ఉన్న కణజాలంపై ప్రభావం చూపడాన్ని ఆస్టియో ఆర్థరైటిస్ అంటారు. ఇది ఒక 'డీజనరేటివ్ డిసీజ్'. ఇది సాధారణంగా 40 సం॥ల వయస్సు దాటినవారిలో ఎక్కువగా కనిపిస్తుంది. పురుషులతో పోలిస్తే స్త్రీలలో, ముఖ్యంగా నెలసరి ఆగిపోయిన మహిళలలో ఎక్కువగా గమనించవచ్చు. మోకాళ్ళలో ఎక్కువగా కనిపించే ఈ సమస్య వలన – చేతివ్రేళ్ళు, వెన్నుపూస, తుంటి ప్రాంతం, కాలివ్రేళ్ళు, తదితర ప్రాంతాలు 'ఆస్టియో ఆర్థరైటిస్'కు గురయ్యే అవకాశం ఉంది. సాధారణంగా కీళ్ళలోని (ఉదా: మోకాళ్ళలో) రెండు ఎముకల చివరి భాగాలు కలిసే ప్రాంతం 'కార్టిలేజ్' అనే నున్నటి మృదులాస్థితో కప్పబడి ఉంటుంది. ఈ రెండు ఎముకలు ఒకదానిపై మరొకటి తేలికగా మరియు పరస్పరం మృదువుగా కదిలేందుకు గాను ఆ ఏర్పాటు సహాయపడుతుంది. ఇంతేకాకుండా అది ఒక "షాక్ అబ్‌సార్బర్" మాదిరిగా కూడా పనిచేస్తుంది. మోకాళ్ళ అంతర్ నిర్మాణంలో భాగంగా మోకాలి జాయింట్‌ను చుడుతూ సైనోవియం అనే పొర ఉంటుంది. ఈ సైనోవియం పొర సైనోవియల్ ఫ్లూయిడ్ అనే ముఖ్య ద్రవాన్ని విడుదల చేస్తుంటుంది. ఈ సైనోవియం పొరను చుడుతూ క్యాప్సుల్ అనే మరొక గట్టి పొర ఏర్పడి ఉంటుంది. ఇది మోకాలి జాయింట్‌ను స్థిరంగా ఉంచేందుకు దోహదపడుతుంది. ఇవే కాకుండా మోచిప్ప లేదా పటెల్లా, టెండాన్స్ మరియు వివిధ లిగమెంట్లు, కండరాలతో మోకాలి జాయింట్ ఎంతో పటిష్టంగా నిర్మితమై ఉంటుంది. 'ఆస్టియో ఆర్థరైటిస్' మొదలైన కొన్ని రోజులకు కార్టిలేజ్ క్రమంగా అరిగిపోవడం ప్రారంభమవుతుంది. దీంతో అది క్రమేణా పలుచగా మారుతుంది. దీనివలన ఎముకలలో కణజాలం శోథమునకు లేదా వాపునకు గురి కావడం జరుగుతుంది మరియు ఎముకల చివరి భాగాలు అదనంగా పెరుగుతాయి. వీటిని 'ఆస్టియో ఫైట్స్' అని అంటారు. వీటి ప్రభావం చేత సైనోవియం పొర కొంచెం ఉబ్బి అదనపు ద్రవాన్ని విడుదల చేస్తుంది. దీనివలన కీళ్ళ ప్రాంతంలో వాపు ఏర్పడుతుంది మరియు ఆ రెండు ఎముకలు ఒకదానితో మరొకటి రాపిడికి గురికావడం వలన తట్టుకోలేనంత స్థాయిలో తీవ్రమైన నొప్పి ఉంటుంది.

**కారణాలు:** 40 సం॥ వయస్సు పైబడిన వారిలో – ముఖ్యంగా పురుషుల కంటే స్త్రీలలో ఎక్కువగా వస్తుంది. • పూర్వం కీళ్ళకు ఏదైనా దెబ్బ తగలడం • అధిక బరువు కలిగి ఉండటం • కాళ్ళ ఎదుగుదలలో హెచ్చుతగ్గులు ఉండటం • కీళ్ళపై అధిక ఒత్తిడి కలిగించే పనులు చేయడం • కొన్ని ఇతర వ్యాధులు (ఉదా: రుమటాయిడ్ ఆర్థరైటిస్) కలిగి ఉండటం మరియు వంశపారంపర్యత వంటి అంశాలన్నీ ఈ వ్యాధికి గల కారణాలుగా చెప్పవచ్చు.

**లక్షణాలు:** కీళ్ళనొప్పులు, కీళ్ళవాపు, చేతితో తాకితే కీళ్ళు వేడిగా అనిపించడం • కీళ్ళు బిగువుగా మారడం, ముఖ్యంగా ఉదయాన్నే నిద్ర లేచిన తరువాత కొంత సమయం నడక కష్టంగా అనిపించడం • క్రింద కూర్చునేటప్పుడు –లేచేటప్పుడు ఇబ్బంది కలగడం • కీళ్ళ దగ్గర రాపిడి శబ్దాలు వినిపించడం • తీవ్రనొప్పి మూలంగా నడకలో వ్యత్యాసం కనిపించడం వంటి లక్షణాలను గమనించవచ్చు. • వెన్నెముక 'ఆస్టియో ఆర్థరైటిస్'కు గురి అయితే చేతులు–కాళ్ళు బలహీనపడటం, మొద్దుబారటం మరియు తిమ్మిర్లు వంటి లక్షణాలు కనిపిస్తాయి.

**వ్యాధి నిర్ధారణ పరీక్షలు:** రోగి లక్షణాలను బట్టి మరియు రక్తపరీక్ష, మోకాలు నుండి కొద్దిగా ద్రవాన్ని తీసి పరీక్షించడం, X-Ray, MRI, CT-Scan వంటి పరీక్షలు నిర్వహించడం ద్వారా ఆస్టియో ఆర్థరైటిస్‌ను నిర్ధారించవచ్చు.

**హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ వైద్యం:** జెనెటిక్ కాన్స్‌టిట్యూషనల్ చికిత్సా విధానం ద్వారా – 'ఆస్టియో ఆర్థరైటిస్'ను తగ్గించడంలోను మరియు కీళ్ళ కదలికలను సురక్షితంగా ఉంచడంలోనూ హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ ఎంతో కాలంగా మంచి ఫలితాలను సాధిస్తూ వస్తోంది. కేవలం నొప్పి, వాపు వంటి లక్షణాలను తగ్గించడమే కాకుండా, రోగి మానసిక–శారీరక లక్షణాలను పరిగణనలోకి తీసుకొని ప్రభావవంతమైన చికిత్స ఇవ్వటం ద్వారా వ్యాధిని సంపూర్ణంగా నయం చేయవచ్చు మరియు వ్యాధి తీవ్రత పెరగకుండా కాపాడవచ్చు.



# పసిడి పరువం

**-దినమణి**

**నా పేరు రాహుల్.**

**పోట్లగిత్తలాంటి కుర్రోణ్ణి. ఇరవైఏడేళ్ల వయసు మీదపడి సతాయిస్తోంది. వయస్సు సతాయిస్తోందనేకంటే, అణువణువునూ కోసి చంపేస్తోందంటేనే కరెక్ట్.**

**ఇంకా బ్రహ్మచారినే.**

**హైదరాబాద్ హైటెక్స్ ఆరోఅంతస్తులోని సాఫ్ట్‌వేర్ కంపెనీలో సీనియర్ మేనేజర్ ఉద్యోగం.**

అప్సరసల్లాంటి అమ్మాయిలంతా మా కంపెనీలోనే ఉన్నారు. నామీద కక్ష కట్టినట్టు వాళ్లంతా చీరలు, ఫ్రాకులు, చుడీదార్లు, జీన్స్, స్లీవ్‌లెస్ టాప్స్ వేసుకుని నా చుట్టూ తిరుగుతుంటే పిచ్చెక్కిపోయేది.

"అబ్బ! ఏం ఫిగర్లురా? అనిపించి నోట్లో నీళ్ళూరుతాయి. ఏదో తెలియని బాధ ఒళ్ళంతా సలిపేస్తుంది. ఒంట్లో రెండు మూడు చోట్ల కరెంటు పెట్టినట్టు 'జివ్వు' మంటుంది.

ఒక్కొక్కరు ఒక్కో మన్మథబాణంలా తయారై వస్తారు. కొంత మంది అమ్మాయిలైతే, కుట్రపన్ని వాళ్ళ సొగసులన్నీ నా ముందే ఒలకబోస్తూ కొత్తగా రిలీజైన రెండువేల నోటులా ఊరిస్తుంటారు.

ఈ డ్రెస్సులు ఎవడు కనిపెట్టాడోగానీ... ఫ్రాకులు, 'మినీ'లు పోయాయి. ఇప్పడంతా 'సూపర్ మినీ ఫ్రాకులే'. బలమైన పచ్చటి ఊరువులు రోజంతా కనిపిస్తుంటే ఆ బాధ తట్టుకోలేక గిలగిలలాడి పోతున్నాను.

వీళ్ళకిదేం పోయేకాలమో? ఆఫీసులో ఇట్లాంటి చిట్టిపొట్టి డ్రెస్సులేసుకుని, అరటి బోదెల్లాంటి...! అక్కడే తల బాదుకుని చచ్చిపోవాలనిపించే అండర్ ఆర్మ్స్; వాటి మధ్యలో తల పెట్టుకుని ఊపిరి ఆడకుండా చచ్చిపోవాలనిపించే ఘన వక్షోజాలను చూపిస్తుంటే మగ వెధవన్న వాడెవడైనా ప్రశాంతంగా పని చేయగలడా?

అసలు మేనేజ్‌మెంటుకుచెప్పి అందరికీ బుర ఖాలు తొడిగిస్తే గానీ నాలాంటి మగవాడు పని చేయలేడనిపించేది నాకు.

అసలే వయసుపోరులో రాత్రిళ్లు నిద్రపట్టక నేనేడుస్తుంటే, ఆఫీసులో ఈ అంగరంగ వైభోగ ప్రదర్శనతో పిచ్చెక్కిపోతుంది.

ప్యాంట్ జేబుల్లో చేతులుపెట్టుకుని పొంగి పొర్లుతున్న ఆవేశం అదుపులో పెట్టుకోలేక చచ్చిపోతున్నాను.

ఇక, సంగీతాకౌర్ అయితే మరీనూ. పూర్వ జన్మలో ఒంగోలుగిత్తేమోనని నాకు గట్టినమ్మకం. ఈ జన్మలో నా ప్రాణాలు క్షణక్షణం, గ్రాముల్లెక్కన తియ్యడానికి నా పక్క సీట్లోనే తగలడింది.

ఐదడుగుల ఏడంగుళాల ఎత్తు. బంగారం పోత పోసినట్టుండే ఒంటి రంగు. మగజాతిని తన మోహావేశంలో నాశనం చేయడానికా అన్నట్టు, ఏరోటిక్ డ్రెస్సులేసుకుని ఆఫీసు కొస్తుంది.

ఆ డ్రస్సులో సంగీతను చూస్తుంటే "ఛీ.... నీ....జీవితం" అనిపిస్తుంది. ఒక్కోసారి 'ఈ నాగరిక ముసుగు తొలగించి అనాగరికంగా ప్రవర్తించాలనిపిస్తుంది'. నా పక్కసీటే కాబట్టి, సంగీత ప్రభావం నా మీదే ఎక్కువ. నా గ్రూప్ కాదు కాబట్టి సీనియర్నన్న భయంకూడా ఆమెకు లేదు.

రివాల్వింగ్ చెయిర్లో కూర్చుని రెండు చేతులెత్తి, తల క్రిందుగా ముడిచిపెట్టి 'రాహుల్!' అని పిలుస్తుంది, నన్ను టీజ్ చెయ్యడానికి! కుర్చీలో జారగిలబడి కూర్చున్నప్పుడు మినీఫ్రాకు ఇంకా పైకిపోయి ఉంటుంది.

రెండు చేతులెత్తి పెట్టుకోవడంతో పచ్చటి నేలమీద, కొత్తిమీర మొలకలు మొలిచిన, చదును చేసిన మడిలా బాహు మూలాలూ నన్ను మురిపిస్తూంటాయి.

ఇదంతా ఒకెత్తు. అపారమైన ఆమె స్థన సంపద మరొక ఎత్తు. అప్పుడప్పుడు నా కళ్ళ ముందు మెరుపులు మెరుస్తాయి. నార్త్ ఇండియన్స్ బాడీ స్ట్రక్చర్ అలాంటిదే కాబోలు. ఆ రెండు కొండల మధ్యన చిక్కి, నలిగి, నా యవ్వనం గిజగిజలాడుతోంది.

గుటకలేస్తూ నిలబడ్డ నన్నుచూసి 'క్యారే?' అన్నది, ముసిముసిగా నవ్వుతూ.

"ఏం చెప్పాలి?' నీ ఒంట్లో రసాన్నంతా పీల్చేయాలని ఉందని ఎలా చెప్పాలి".

అది నన్ను టీజ్ చేస్తోందని నాకు తెలుస్తూనే ఉంది.

'ఒక్కొక్కసారి కమిటైపోతేనో.. అనిపిస్తుంది...కానీ నాకు ఇష్టం లేదు'. అందుకే అది రెచ్చిపోతోంది. నాకు వెర్రెక్కించేలా టీజ్ చేస్తూ చంపుతుంది.

'మీరంతా బుద్ధూలురా, ఈ రోజుల్లో పాతివ్రత్యం, క్యారెక్టర్ అంటూ ఏజ్ ఓల్డ్ వాల్యూస్ పట్టుకుని ఏడుస్తుంటారు. లైఫ్ ఎంజాయ్ చేయాలిరా. నా స్కోరెంతో తెల్సా?' అంటూ ఏడిపించేది. అడల్ట్ జోక్స్ చెప్పి, నేను వెర్రిముఖం వేసుకుంటే, ఫక్కున నవ్వేది.

"ఏంటో చెప్పు? యూ కాల్డ్ మీ నా?" అని అంటే,

"ఏక్ మసాలా జోక్ పడేరే. నీకు చెప్పాలని." అని.

"బెడ్రూంలో బెడ్‌మీద, అప్పుడే శృంగారం ముగించి, అలసి సొలసి నీరసంగా, పడుకున్న మొగుణ్ణి చూసి, అతని భార్య,

'ఏంటండీ? మీరు ఇంత తొందరగా అలసిపోతారు. నాకైతే అస్సలు అలసటే లేదు' అంటుంది.

'నీకేంటే! రోడ్డుమీద పరుగుతీసే కారులో పెట్రోల్ అయిపోతుంది. కానీ, రోడ్డుకేమౌతుందే!' అంటాడు భర్త" అంటూ పకపక నవ్వింది.

ఇబ్బందిగా పెట్టిన నా ముఖాన్ని చూసి,

"ఛల్! ఔర్ ఏక్ సున్!" అన్నది.

ఆ జోకు మరీ దారుణంగా ఉంది. నా కళ్ళ ముందు పుష్టిగా కనిపిస్తున్న ఆమె స్తన సంపదను చూస్తూ నిలువలేక వాష్‌రూంవైపు నడిచాను. "సాలా, ముసద్దీలాల్!" అని ఎగతాళిగా అంటుంటే ఆమెవైపు కోపంగా చూశాను.

•••

సంబంధాలు వస్తున్నాయిగానీ, నాకు ఒక్కటీ నచ్చడంలేదు.

సాఫ్ట్‌వేర్ ఇంజనీర్లు, డాక్టర్లు, యంబీయేలు, అప్సరసల్లాంటి అమ్మాయిల్ని చూపించినా నచ్చడం లేదు నాకు.

"నీకెలాంటి అమ్మాయి కావాలిరా? పోనీ ఎవరినైనా ప్రేమించావా? నీ తమ్ముడు పెళ్లోపెళ్లో



అని చంపుకు తింటున్నాడు రా! ముందు నువ్వు చేసుకోవాలి" అంటున్న అమ్మా నాన్నల గోల తట్టుకోలేక ఆ క్షణంలో నోటికొచ్చింది చెప్పి తప్పించుకుంటున్నా.

నాకు 46-24-36 కొలతలున్న అమ్మాయి కావాలని వాళ్ళకి ఎలా చెప్పాలి?

పెళ్ళిచూపుల్లో అమ్మాయిని నా ముందు కూర్చోబెట్టగానే, నా చూపు అమ్మాయి గుండెలమీదకే పోతుంది. ఆ అలవాటు మార్చు కోవడం నావల్ల కావడంలేదు.

పెళ్లిచూపుల్లో అమ్మాయి సైజులను సంగీతా కౌర్ సైజులతో పోల్చిచూసి 'ప్చ్' అని పెదవి విరిచే వాణ్ణి. ఘనమైన వక్ష సంపద ఉన్న అమ్మాయి కావాలి నాకు. నాలోని పురుషత్వాన్ని సవాల్ చేసే సరుకున్న అమ్మాయి కావాలి.

కానీ ఈ రోజుల్లో అమ్మాయిలు సైజ్ జీరో అంటూ, పూచిక పుల్లల్లా ఉంటు న్నారు. పరీక్షగా చూస్తే ఒక్క ఇంచ్ కండ కూడా ఉండడం లేదు. అలాం



టప్పుడు నా కోరికెలా తీరుతుంది. 46-24-36 కొలతలున్న అమ్మాయిలేమోగానీ, కనీసం 26-24-26 కొలతలున్న అమ్మాయిలు కూడా కనిపిం చడంలేదు.

పెళ్లి చూపులకు వెళ్ళొస్తే ఎలా తెలిసేదోగానీ, ఆఫీసంతా టాంటాం అయ్యేది. లంచ్‌లో సంగీత అందరికీ స్వీట్లు పంచేది.

"నా లాంటి అమ్మాయి నీకు దొరకదురా! నాతో కమిటై పో! లివిన్ కాపురం పెట్టేదాం!" అంటూ కన్ను గీటేది.

•••

నేను రోడ్ సైడ్ రోమియోను కాదు. ఆఫీసు బైట అమ్మాయిల్ని కన్నెత్తి చూసేరకం కాదు. ఆఫీసులో కూడా అందాన్ని ఆనందించేవాణ్ణేగానీ చిల్లర మల్లర వేషాలు వేసేవాణ్ణి కాదు. అమాయ కుణ్ణి కాబట్టే సంగీత నన్ను ఆటపట్టించేది. పిచ్చి వేషాలు వేసే కొలీగ్స్‌ని దగ్గరికి రానిచ్చేదికాదు.

సంగీత పబ్బులకు వెళ్తుంది. మందు కొడ్తుంది. రెయిన్ డాన్సులు, డీజేలంటూ తిరుగుతుంది. నన్ను రమ్మనేదిగానీ, ఆ మోడ్రన్ లైఫ్ నాకు నచ్చదు.

నా భార్య అందంగా, పుష్టిగా 46-24-36 కొల తలతో ఉండాలన్న ఒక్క కోరికే నా వీక్నెస్.

రోజూ యోగా, రన్నింగ్ చేస్తాను. పొట్ట ఫ్లాట్‌గా, ఛెస్ట్ ఎత్తుగా ఒక హంక్‌లా ఉంటానని సంగీత అంటూ ఉంటుంది.

అందరికంటే ఓ అరగంటముందే ఆఫీసుకు

చేరుకుంటా. నా బ్లాక్ 'ఆడీ' కారంటే నాకెంతో ఇష్టం. చిన్నగీత కూడా పడకుండా చూసుకుంటాను. ఆరంకెల జీతంకాబట్టి, పేద ఆడపిల్లలకు సహాయం చేస్తాను. మలేషియన్ టౌన్‌షిప్‌లో నాకో ఫ్లాట్ ఉంది. నెలకో, రెణ్ణెల్లకో ఊరినుంచి అమ్మానాన్న వస్తారు. పెళ్ళిచూపులుంటే మాత్రం తప్పక వస్తారు.

మా రిలేషన్‌షిప్‌లో సెక్సుకు స్థానం లేదన్న విషయంపై ఒక క్లారిటీ వచ్చాక, సంగీతకు నాకు మధ్య స్నేహం చిగురించింది. కానీ చిలిపి మాటలు మాత్రం మానలేదు.

ఒకరోజు లంచ్‌కు వెళ్దాం అని 'తబ్లా'లో టేబుల్ బుక్ చేసింది. ఆ రోజు నిండుగా చుడీదార్‌లో గౌరవంగా, పద్ధతిగా కనిపించింది.



## డబ్బే అడ్డమా?

*సాయి పల్లవి...ఈ పేరు చెబితే కుర్రకారు సంతోషంతో గంతులేస్తారు. తొలి సినిమాతోనే యూత్‌లో అంత గుర్తింపు తెచ్చుకుంది సాయి పల్లవి. ఆ సినిమా తరువాత ఆమె స్టార్ హీరోయిన్ అవుతుందని అందరూ అనుకున్నారు. అందుకు తగ్గట్టే కోలీవుడ్‌లో ఇద్దరు ముగ్గురు స్టార్ హీరోలు, డైరెక్టర్ల సినిమాల్లో నటించే అవకాశం వచ్చినా ఆ సినిమాల్లో ఆమెకు బదులు మరొక హీరోయిన్‌ని తీసుకున్నారు. దీనికి కారణం ఏమిటి? అంటే... రెమ్యునరేషన్ అని అంటున్నారు. సాయి పల్లవి ప్రస్తుతం 'ఫిదా' సినిమానే చేస్తోంది. ఆ సినిమాకు సాయి పల్లవికి అరకోటి ఇస్తున్నారట! ఈ స్థాయిలో మరే దర్శకనిర్మాత ఇవ్వడానికి ముందుకు రాకపోవడంతో సాయి పల్లవికి అవకాశాలు వచ్చినట్టే వచ్చి వెనక్కి పోతున్నాయని అంటున్నారు. సాయి పల్లవితో సినిమాలు చేయడానికి డబ్బే అడ్డంగా ఉందన్నది మరికొందరి వాదన.*

నా కార్లో ట్రావెల్ చేయడం సంగీతకు ఇష్టం. ఎప్పుడైనా నేను ఆఫీసునుండి బయల్దేరే వరకు ఆగి, నాతోపాటు కారులో ఎంతో కొంత దూరం వస్తూ ఉంటుంది. మాది మల్టీ నేషనల్ సాఫ్టు వేర్ సొల్యూషన్స్ కంపెనీ కాబట్టి, లంచ్‌లు, ఔటింగ్‌లు చాలా కామన్. కానీ పార్టీలు హద్దులు దాటుతాయనిపిస్తే మొహమాటం లేకుండా, ముందే రానని చెప్తా.

సంగీత కొంచెం నాటీయేగానీ, వర్కులో సూపర్‌ఫాస్ట్. అదీ, నాలో ఇన్నోసెన్స్ చూసే తను నాతోనే చిలిపిగా ప్రవర్తిస్తుంది. లంచ్‌కు వెళ్తుంటే, షరా బూతు పురాణం విప్పింది.

"ఓ అమ్మాయి టీ షర్టు మీద కారుబొమ్మ ముద్రించి ఉంది. ఓ కొంటె కుర్రాడు దానివైపే చూస్తుంటే, ఆ అమ్మాయికి కోపంవచ్చి, 'ఏయ్! ఏం చూస్తున్నావ్' అని అడిగింది. 'కారుని!' అన్నాడు. 'కారు ఎప్పుడూ చూడలేదా?' అంటే 'రెండు స్పీడ్ బ్రేకర్ల మధ్య పార్క్ చేసిన కారుని ఇప్పుడే చూస్తున్నా!' అన్నాడు" అంది.

నేను చిరునవ్వుతో చూశాను.

మరో జోక్ చెప్పింది.

"పక్కింటి ఆవిడతో తన భర్తకు అఫైర్ ఉందని ఓ భార్యకు అనుమానం.

"ఏందయ్యా! ఎప్పుడు చూసినా పక్కింటి పంకజం ఇంట్లో నుంచే వస్తున్నావ్!' అని గర్జించింది.

'ఛ! నీదంతా వర్తి అనుమానం!' అని దబాయించాడు.

'నా దగ్గర ప్రూఫ్ ఉంది!'

'అబద్ధం! అన్నాడు.

'ఉంది' అంది ఆవేశంతో ఊగిపోతూ.

'ఉంటే చూపించు!' అన్నాడు భర్త.

భార్య వివేకం కోల్పోయింది. బెడ్ రూములోకి వెళ్ళి చూడు, నీ అండర్‌వేర్, రాత్రి పంకజం మొగుడు వేసుకొచ్చాడు. ఇది ఆయన దగ్గరకెలా వెళ్ళింది?' అని గతుక్కుమంది.

మరు నిమిషం ఇద్దరూ తన్నుకోవడం మొదలెట్టారు"

నేను ఫక్కున నవ్వాను.

ఆ రోజు లంచ్ చేస్తుంటే,

"రాహుల్! వాటీజ్ ద ప్రాబ్లం. పెళ్ళిచూపుల్లో నీకు అమ్మాయిలు ఎందుకు నచ్చడం లేదు?" అడిగింది సంగీత.

నవ్వి ఊరుకున్నాను.

"సీరియస్లీ.. చెప్పు!" అంది.

"అబ్బే! అదేం లేదు" అన్నాగానీ నన్నొదల్లేదు.

ఆఖరికి, సిగ్గుపడుతూ "46-24-36" కావాలని చెప్పా. ఫక్కున నవ్వి, "మరి ఆలస్యమెందుకు? నన్నే చేసుకోరాదూ?" అంది. భయంగా చూశాను.

"జస్ట్ ఫర్ ఫన్!" అంది.

•••

ఫారిన్ క్లయింట్‌తో ఆరోజు లంచ్‌కి వెళ్ళాలి. రెస్టారెంట్ల గురించి నాకు తెలియదు. సంగీతను అడిగితే, 'ప్యారడైజ్ గోల్డ్'లో రెండు సీట్లు బుక్ చేసింది. క్లయింట్, నేను వెళ్ళాం. నాకు అప్పుడేం తెలుసు! ఆ ప్యారడైజ్‌లోనే ఒక దేవత నాకు దర్శనమిస్తుందని!! మేము భోజనం చేస్తుండగానే మా పక్క టేబుల్‌కి ఇద్దరమ్మాయిలు వచ్చారు. అందులో ఒకమ్మాయి స్వర్గంనుండి నా కోసమే దిగివచ్చిన రంభలా ఉంది. ఒడ్డూ, పొడుగూ, నడకా, హొయలూ, ముఖ్యంగా నాక్కావాల్సిన 46-24-36. నా సీటు పక్కనుంచి వెళ్తుంటే పున్నాగ పూలవాసన నన్ను కమ్ముకుంది. నా మనసు నా వశం తప్పింది. నావంక చూసి నవ్వినట్టు అనిపించింది. గుసగుసలుగా నా కోసం ప్రేమ సందేశం మోసుకొచ్చినట్టనిపించింది. నా కలల రాణి నడిచి వచ్చినట్టనిపించింది.

మా క్లయింట్ ఫ్లైట్ క్యాచ్ చెయ్యాలి. ఇక తప్పక పంచప్రాణాలూ అక్కడే వదిలిపెట్టి బైటకు నడిచాను. ఇక ప్రతీరోజు ప్యారడైజ్‌కు వచ్చేవాణ్ణి. బిర్యానీ తినీ తినీ పొట్ట పెరిగిందిగానీ ఆ అమ్మాయి కనిపించలేదు. నాకెందుకో తను నా కోసమే పుట్టిందని బలమైన నమ్మకం.

కొలీగ్స్‌లో ఒకరిపాప బర్త్‌డే. గిఫ్ట్‌కొనేందుకు నేనూ, సంగీతా 'ఇనార్బిట్‌మాల్'కి వెళ్ళాం. సంగీత గిఫ్ట్ సెలక్ట్ చేస్తోంది. ఇంతలో, ఎక్కణ్ణుంచో, పున్నాగపూల పరిమళం మంద్రంగా వీచింది. 'బహారో పూల్ బర్సానో మేరా మెహబూబ్ ఆయా హై" అన్నపాట ఏదో షాపులోంచి ప్లే అవుతోంది. నా మనసులోని భావాన్ని సరిగ్గా ప్రతిఫలించే ఆ పాట వేసినందుకు ఆ షాపు వాడికి శతకోటి దండాలు పెట్టాను.

"హవావో రాగిణీ గావో మేరా మెహబూబ్ ఆయా హై" ఆ పాట అర్థమేదైనా,

నేను చెప్పగానే వాతావరణమంతా పూల వనంలా మారిపోయింది.

నేను చెప్పగానే గాలి గంధలామారి 'రాగిణి'ని పాడేస్తుందని అనుకున్నాను.

కళ్ళు తెరిచి చూసేసరికి ఆమె నా ముందు నుంచి జలకన్యలా సాగిపోతోంది. నిశ్చేష్టుణ్ణై పోయాను.

సంగీత వచ్చి నా భుజం తట్టేసరికి ఉలిక్కిపడ్డాను.

"ఏమైంది?" అంది.

"తను.." అంటూ ఆమె వెళ్ళినవైపు చూపించాను. ఇద్దరం పరుగు పరుగున వెళ్లాం. ఎవ్వరూ కన్పించలేదు. ఉస్సూరుమని నిట్టూర్చాం.

"ఎవరామె?" అని అడిగింది.

"తెలియదు"

"నచ్చిందా?"

"చాలా! తను లేకపోతే చచ్చిపోతాను. లేకపోతే, జీవితాంతం బ్రహ్మచారిగా ఉండిపోతాను" అన్నాను.

"అబ్బో!" అంది. ఇద్దరూ కలిసి మాల్‌అంతా వెతికి నిరాశగా బైటపడ్డాం.

•••

రెండురోజుల తర్వాత ఓ ఆదివారంనాడు ఎన్టీఆర్ స్టేడియంలో 'హైదరాబాద్ బుక్‌ఫెయిర్'కు వెళ్ళాలని ప్లాన్‌చేశా. సంగీత నాలుగు పాత ఐదు వందల నోట్లు ఇచ్చింది. ఆశ్చర్యంగా 'ఎందుకు?'

అని అడిగా.

"అరే ముసద్దీలాల్! అక్కడ పాత నోట్లు చెల్లుతాయంట. వీటితో పుస్తకాలుకొను. ఇప్పుడైతే రెండువేల నోటివ్వు" అంటూ బలవంతంగా పర్స్ తీసి నోటు గుంజుకుంది.

ఆ రోజు ఫార్మల్‌గా తెల్లటి లాల్చీ పైజామా, కొల్హాపూరి చెప్పులు వేసుకుని బయల్దేరా. నాకైతే పుస్తకాలంటే పిచ్చి. మంచి తెలుగు సాహిత్యం, కవిత్వం, యద్ధనపూడి ప్రేమకథలు, యండమూరి సస్పెన్స్ నవలలు, మల్లాది నర్మగర్భ కథలు నన్ను మరో లోకంలోకి తీసుకెళ్తాయి. చదవడం అంటే కేవలం చదవడంకాదు. కొత్త పుస్తకాన్ని చేతులతో పట్టుకున్నప్పుడు వచ్చే ఆ పుస్తకం వాసన, పేజీ, పేజీ తిప్పుతుంటే గరగరల శబ్దం, అక్షరాల ప్రింటు, ఆ అక్షరాలు సృష్టించే అద్భుతసౌందర్య లోకాలు నాకు చాలా ఇష్టం. ప్రఖ్యాతి గాంచిన దేశవిదేశీ రచనలతో కొలువు దీరిన మహాభువన విజయం ప్రాంగణంలా ఉంది. కావాల్సిన పుస్తకాలన్నీ కొన్నాను.

బయల్దేరుతుంటే వర్షం మొదలైంది. కారు వైపు చకచకా నడుస్తున్నాను.

ఇంతలో నాపక్కనే మెరుపు మెరిసింది. ఉరుములేని మెరుపుగా నా స్వప్నసుందరి! చీర కొంగు ముసుగులా తలమీద కప్పుకుంది. ఆ భంగిమ కూచిపూడి సిద్ధేంద్రస్వామి కూడా సృష్టించలేదేమో. చేతిలో పుస్తకాలు నెత్తిమీద పెట్టుకుని వాటిమీద కొంగుకప్పి కాపాడుతోంది గానీ, అపురూపమైన తన సోయగాలను మాత్రం నా కోసం వదిలేసింది. తడిసిన జాకెట్టులోంచి పొంగిపొర్లుతున్న అందాలు కనువిందుచేస్తున్నాయి. నల్లటిజాకెట్టులో ఇమడలేక బైటపడాలని విశ్వప్రయత్నం చేస్తున్న పసిడి పరువాలు చూసేసరికి, నా నరనరాల్లో అడ్రినలిన్ ఇంజెక్ట్ చేసినట్టుగా తమకం మొదలైంది. నా చూపు తన స్తనద్వయంమీద ఉండడంచూసి ఆమె చిరాకుపడింది. కానీ, ఏమీచేయలేని నిస్సహాయ స్థితి. తనను అలాంటిస్థితిలో మరెవరూ చూడకూడదనే ఉద్దేశంతో, చొరవ తీసుకుని 'రండి, నా కారులో కూర్చుందాం' అని ఆమె చెయ్యి పట్టుకుని దాదాపు లాక్కొచ్చి నా కారులో కూర్చోపెట్టా. ఆమెక్కూడా ఆ సమయంలో అదే మంచి పని అనిపించిందేమో మారు మాట్లాడలేదు.

కానీ, నేను తన చెయ్యి పట్టుకున్నానన్న విషయం గుర్తొచ్చి "ఏంటండీ! అలా లాక్కొచ్చారు?" అంది కోపంగా.

"తడిసిపోతున్నారని... సారీ" అన్నాను.

కారులో హీటర్ ఆన్‌చేశా. వెనుకసీట్లో టవల్ తీసిచ్చా. "థాంక్స్ అండీ" అంది.

●●●

'తను నా కార్లో...' నమ్మలేక పోతున్నాను.

భగవంతుడు ప్రత్యక్షమై ఏదైనా వరం కోరుకోమంటే, నా జీవితంలో ఈ క్షణం శాశ్వతమై పోవాలనే కోరుకుంటాను.

అంతకుముందులా ఈసారి అవకాశం వదులుకోదల్చుకోలేదు.

రెండోసారి తను కనపడ్డప్పుడు 'బహారో ఫూల్ బర్సానో..' అనే పాట షాపులోంచి వినపడింది. ఇవ్వాళ, మూడోసారి నిజంగానే పూల వర్షం కురిసింది. అప్పుడే నేనొక పాట డౌన్‌లోడ్ చేసుకుని మొబైల్‌లో పెట్టుకున్నాను. తను కనపడగానే వినిపించాలని మనసులో అనుకున్నాను. ఇప్పుడు, స్పీకర్స్‌కు అటాచ్‌చేసి ప్లే బటన్ నొక్కాను.

'మైనేపూచా చాంద్ సేకే దేఖా హై కహీం మేరే యార్ సా హసీం...

చాంద్ నే కహాం చాందినీ కీ ఖసం నహీం నహీం....

మైనే పూచా బాగ్ సే ఫలక్ హోయా జమీ యేసా ఫూల్‌హై కహీ...

బాగ్‌నేకహాం హర్ ఖలీకి నహీం నహీం...'

తను అదోలా చూసింది.

'నేనేనా?' అన్నట్టుగా కళ్ళతో ప్రశ్నించింది.

నేను 'ఔన'న్నట్టుగా తలూపాను.

ఇంతలో కారు అద్దాలను ఎవరో దబదబా బాదుతుంటే ఉలిక్కిపడి చూశాను. కిటికీతలుపు తీసిచూస్తే, ఎదురుగా సంగీత.

'తనేమిటి, ఇక్కడ?' అని విస్తుపోయి చూస్తుంటే,

"తలుపుతియ్ తొందరగా" అంటూ అరిచింది.

డోర్ తీయగానే, లోపలికొచ్చి కూర్చుంది.

"జరగవే!" అంటూ నా స్వప్న సుందరిని నెట్టింది.

"ఏయ్!" అన్నాను. తనెక్కడ అఫెండ్ అవుతుందోనని గాభరాగా.

"ఏంట్రా? నోరెళ్ళబెట్టావ్! మీ ఇద్దరినీ కలపడానికి వర్షంలో కూడా తడవాల్సి వచ్చింది".

"నువ్వా?" అన్నాను ఆశ్చర్యంగా.

"ఆఁ మరీ! నేనే. పదివేలు ఖర్చైంది కూడా. హోటల్లో టేబుల్ బుక్ చేయడానికి, గిఫ్టులు పుస్తకాలు కొనడానికి".

నేనింకా ఆశ్చర్యంలోంచి తేరుకోకపోయేసరికి,

"అరే ముసద్దీలాల్! ఇది రమణి! ఐటీలో నా క్లాస్‌మేట్. ఇక్కడే 'విప్రో'లో పని చేస్తోంది. నీలాగే, ఇది కూడా ముసద్దీలాలే. అంటే ముద్దపప్పు. మీ పప్పులిద్దరినీ కలపాలన్నదే నా ప్లాన్. నీ **46-24-36**కు సరిగ్గా సరిపోతుంది" అన్నది.

"మాట్లాడవే!" అంటూ రమణిని, నా ప్రియ బాంధవిని పొడిచింది సంగీత.

"హాయ్ అండీ! నా పేరు రమణి. సంగీతా నేనూ క్లాస్‌మేట్స్. మిమ్మల్ని కలుసుకోవాలనే, ప్యారడైజ్‌కు, ఇనార్బిట్‌మాల్‌కు ఇవ్వాళ ఇక్కడికి వచ్చేలా తనే ప్లాన్‌చేసింది." వీణమీటితే సంగీత స్వరాలు వస్తాయని తెలుసుగానీ ఇలా మాటలు కూడా పలుకుతాయని అప్పుడే తెలిసింది నాకు.

నేను సిగ్గు పడ్డాను. నన్ను చూపిస్తూ,

'ఇదే వీడివరస! ఎట్లా వేగుతావో ఏమో? పాతకాలపు ముసద్దీలాల్!" అని,

"ఛలో! ప్యారడైజ్. ఆకలి దంచేస్తుంది"




యుక్తవయసులో ఉన్న వారికే శృంగార పరమైన కోరికలు ఎక్కువగా ఉంటాయని, వయస్సు పెరిగే కొద్దీ శృంగార కోరికలు తగ్గిపోతాయనే భావన చాలామందిలో ఉంటుంది. ఈ అంశంపై కొందరు మహిళలపై సర్వే చేయగా కొన్ని ఆసక్తికరమైన అంశాలు వెలుగు చూశాయి. యవ్వనంలో కంటే 30 నుంచి 40 ప్రాయంలోనే శృంగార పరమైన కోరికలు ఎక్కువగా ఉంటాయని సగటు

## వయసుతో పాటే వాంఛలు

మహిళలు భావిస్తున్నట్టు సర్వేలు చెబుతున్నాయి. ఈ విషయమై రెండు విభిన్నమైన సర్వేలు నిర్వహించారు. ఒకటేమో టెక్సాస్ యూనివర్సిటీ వారు నిర్వహిస్తే, మరొకటేమో ప్రముఖ విటమిన్ కంపెనీలలో ఒకటి అయిన హెల్త్‌స్పాన్ అనే కంపెనీ నిర్వహించింది. ఈరెండు సర్వేలూ వెల్లడించిన విషయాలన్నీ దాదాపు సమానంగానే ఉన్నాయి.



హెల్త్‌స్పాన్ కంపెనీ ఈవిషయమై నిర్వహించిన పరిశోధనలో దాదాపు 75 శాతం మంది మహిళలు మెనోపాజ్ దశ అనేది వారి రిలేషన్ మీద ఎక్కువగా ప్రభావం చూపిస్తుందని తేలింది. నలభై సంవత్సరాలు దాటిన తర్వాత మహిళలు మెనోపాజ్‌కి చేరువలో ఉంటారు. దీనివల్ల వారిలో హార్మోన్లలో అసమతుల్యం ఏర్పడి ఎక్కువగా మూడ్‌స్వింగ్స్, ఆత్రుత ఏర్పడతాయి. అందువల్ల వారికి ఆ వయసులో శృంగారంపట్ల కోరికలు కాస్త ఎక్కువగానే కలుగుతాయని వెల్లడైంది.

ఇక టెక్సాస్ యూనివర్సిటీ 827 మంది మెనోపాజ్‌కి చేరువైన విదేశీ మహిళలపై సర్వే నిర్వహించింది. ఈ సర్వేలో పాల్గొన్న మహిళలు తమ శృంగార జీవితం గతంలో కంటే మెనోపాజ్ తర్వాత ఇంకా బాగుందని చెప్పారు. 20 లేదా 30 ఏళ్ల ప్రాయంలో తాము నెలలో 10 సార్లు పాల్గొనగా, 45 నుంచి 60 ఏళ్ల మధ్యకాలంలో అంతకు రెట్టింపుగా శృంగార జీవితం గడుపుతున్నామని చెప్పారు. 34 నుంచి 38 ఏళ్ల వయసులో తాము సెక్స్ జీవితాన్ని అద్భుతంగా ఆస్వాదించినట్టు వారు చెప్పారు.

అన్నది.

ఆ తర్వాత పనులన్నీ చకచకా జరిగిపోయాయి. అమ్మానాన్నల తృప్తికోసం 'పెళ్లిచూపులు' ఏర్పాటు చేశాను.

రమణి నాకు తెలుసని అమ్మానాన్నలకు చెప్పలేదు.

ఆ రోజు పెళ్లిచూపులకు వెళ్ళగానే పలకరింపులు పూర్తయ్యాక అమ్మాయిని తీసుకొచ్చి కూర్చోబెట్టారు. సమున్నత శిఖరాలలాంటి ఎద పొంగులు ముందుకు పొడుచుకొచ్చి కనబడ్డాయి. ఆ బరువులు మోయలేక సన్నని నడుము వణికిపోతోంది. ఆ నడుమును ఆదుకోవడానికి పుష్టిగా ఉన్న జఘనం, నేనున్నానంటూ ముందుకొచ్చింది. సన్నని నడుమును బంధించిన వడ్డాణం ఉన్నత వక్షాన్ని, విశాల జఘనాన్ని ప్రస్ఫుటంగా ప్రదర్శిస్తోంది. కనకాంబరపు రంగు జరీపూల పట్టుచీర, పసిడిరంగు ఆమె ఒంటిముందు తేలిపోతోంది. అందుకే, రమణిని ఎన్నిసార్లుచూసినా నాకు తనివి తీరడంలేదు. రమణికి నా చూపులు ఎక్కడ ఉన్నాయో తెలుసు. అందుకే, నావైపు చురచుర చూస్తోంది. నేను చిలిపిగా నవ్వాను. అమ్మానాన్నలక్కూడా అమ్మాయి నచ్చింది.

●●●

శోభనంనాటి రాత్రి.

ఇన్ని రోజులు కలల్లో, రమణితో తీర్చుకున్న కోరికలన్నీ, నేను ఇప్పుడు నిజంగా ఆ అందాలన్నీ రైట్ రాయల్‌గా జుర్రుకోబోతున్నాను. రమణి నా సొంతమైంది. ఇంతవరకుచూసిన అందాల బంధాలను తెంపి ఆస్వాదించబోతున్నాను. ఒంటి మీద నూలుపోగు లేకుండా రమణి పొంగులు రకరకాలుగా ఊహించుకుంటూ కూర్చున్నాను.

రమణి రూములోకి అడుగుపెట్టింది. రాయంచలా నడిచివచ్చి నాపక్కన కూర్చుంది. పున్నాగ పూల వాసనలతోపాటు రమణి ఒంటి సుగంధాలు మరులుగొల్పాయి. నేను వివశుడనై తన రెండుభుజాలమీద చేతులువేసి తమకంగా దగ్గరకు లాక్కున్నాను. నా చేతులు ఎక్కడెక్కడో తడుముతున్నాయి. నాలో సంతోషం. కానీ, రమణి నెర్వస్‌గా కనిపించింది. ఎందుకో సంకోచిస్తున్నట్టు తోచింది.

తన ఒంటిమీంచి నా చేతులు తొలగిస్తూ, 'ఒక్క క్షణం!' అంది.

ఆశ్చర్యంగా చూశాను. తను లేచి నిలబడి, 'రాహుల్! మీరు నన్ను ప్రేమిస్తున్నారా?' అని అడిగింది.

"అదేం ప్రశ్న? అఫ్‌కోర్స్...!"

"కాదు. చెప్పండి. మనం ఇద్దరం కలిసి కొత్త జీవితం ప్రారంభించబోతున్నాం. మనమధ్య రహస్యాలు ఉండకూడదు. నిజాయితీగా జీవితం ప్రారంభించాలి కదా?"

నాకు గుండెల్లో దడ మొదలైంది.

'తను ఇంతకుముందే ఎవరినో ప్రేమించానని, కానీ ఇంట్లో పెళ్లికి ఒప్పుకోకపోవడంతో నాతో పెళ్లికి సిద్ధపడ్డానని చెబ్తుందా" భయపడ్డాను. కానీ 'ప్రేమిస్తున్నారా?' అని అడిగేసరికి,

"మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నాను" అన్నాను.

"అంటే? నన్నా, నా శరీరాన్నా?"

"అవి రెండూ వేర్వేరా?" విస్తుపోయాను.

"అవును, వేరే. మీకు 46-24-36 కొలతలున్న అమ్మాయి కావాలని సంగీత చెప్పింది. ఆ ఒక్క బలహీనత తప్ప అన్నీ మంచి గుణాలే అని చెప్పింది. అందుకే అడుగుతున్నాను. నువ్వు నా శరీరాన్ని ప్రేమిస్తున్నావా? ఒకవేళ నాకు 46-24-36 కొలతలు లేకున్నా నన్ను ప్రేమిస్తావా?".

"ఇప్పుడు ఎందుకు ఆ ప్రశ్న? నువ్వు 46-24-36 కాదా!"

"ఊహు కాదు, ఇవ్వాళ ఉన్న శరీర పొంగులు రేపు ఉండక పోవచ్చు. రేపు పిల్లలు పుడతారు. వాళ్ళకి స్తన్యమిచ్చి పెంచుతాను. అప్పుడు నా స్తనసౌందర్యం తగ్గిపోతుంది. కొలతలన్నీ మారిపోతాయి. అప్పుడు నేను నచ్చకుండా పోతానా?"

నేను ఇబ్బందిగా ముఖం పెట్టాను.

"నాకు కోరికలుండడం తప్పా?" బింకంగా ప్రశ్నించాను.

"తప్పులేదు రాహుల్! నీ కోరిక ప్రకారం నేను ఉన్నాననుకుంటున్నావు కదూ?" అంటూ చీర విప్పింది.

నేను గాభరాగా 'రమణి!' అన్నాను.




"ఫర్వాలేదు. నా శరీరం నీ సొంతమేకదా!" అంటూ జాకెట్ విప్పింది. పచ్చని ఒంటిమీద ఎర్రటి బ్రా, శిఖరాల్లాంటి ఎద పొంగులను దాయలేక, అవస్థ పడుతోంది. రమణి తన బ్రా కూడా విప్పి కింద పడేసింది.

నేను విస్తు పోయాను.

ఎందుకంటే, ఎత్తైన ఆమె ఎదపొంగులు మాయమయ్యాయి. కింద పడ్డ 'బ్రా'లో రెండు ఇంచుల మందాన ఫోం ప్యాడింగ్!!

అయినా, అలా టాప్‌లెస్‌గా నిలబడ్డ రమణి, చెక్కిన అజంతా శిల్పంలా ఉంది. ఆమె పసిడి రంగు మేను మిలమిలా మెరిసిపోతోంది. ఇక సైజుల విషయం మరిచిపోయాను.

'రమణి!' అంటూ తన అర్ధనగ్న శరీరంమీద కొంగుకప్పి తీసుకొచ్చి మంచంమీద కూర్చోబెట్టాను.

'రమణీ! హైదరాబాద్ బుక్‌ఫెయిర్ జరిగి ఇప్పటికి నలభై రోజులు. ప్రతీరోజూ మనం కలుస్తున్నాం. మొదట్లో నేను నీ బాడీ షేప్స్‌కే అట్రాక్ట్ అయ్యాను. అందుకోసమే తహతహలాడేవాణ్ణి. నీ కోసం ఎదురుచూసేవాణ్ణి. కానీ, రానురాను నీ శరీరం మీదకన్నా నీ సాహచర్యంలో, మనం మనసులువిప్పి మాట్లాడుకోవడం నాకు బాగా నచ్చేది. నువ్వు రాని రోజు ఉదాసీనంగా అనిపించేది. ఆకలి వేసేది కాదు. ఏ పనిమీదా ఇంట్రెస్టు ఉండేదికాదు. ఇప్పుడు నువ్వెలా ఉన్నా నిన్ను ప్రాణప్రదంగా ప్రేమిస్తున్నాను. నీ సాహచర్యంలో జీవితాంతం గడిపే వరమివ్వు" అన్నాను.

"రాహుల్! నాకు తెలుసు. ఈనాటి యువకులకు స్త్రీ శారీరక సౌందర్యంపైనే మక్కువ ఎక్కువ! కానీ, బ్రెస్ట్‌లో ఏముంది రాహుల్! పెక్టోరల్ కండరాలను కప్పివుంచే టిష్యూనే కదా! కేవలం బిడ్డల ఆకలితీర్చే పాలను ఉత్పత్తిచేసే గ్రంథుల సమూహం. అక్కడ జమైన ఫ్యాటే బ్రెస్ట్‌సైజును నిర్ణయిస్తుంది. లిగమెంట్స్ ఆ ఫ్యాట్‌కు ఒక రూపాన్నిస్తాయి. అంతకుమించి బ్రెస్టుకు ప్రాధాన్యం లేదు" అంది.

"ఔనౌను" అన్నాను. మౌనంగా ఉండిపోయాను. రమణిని ముట్టుకోవాలంటే ఎందుకో బెరుకుగా అనిపించింది.

"సరే! ఇంక పాఠం చాలించి, ప్రాక్టికల్స్ మొదలు పెడ్దాం!" అంటూ నా వైపు తిరిగింది రమణి.

●●●

తెల్లారి లేచేసరికి రమణి లేదు. బెడ్రూమ్ నుంచి బైటకొచ్చిన నాకు అమ్మా, రమణీ డైనింగ్ టేబుల్‌దగ్గర కుర్చీలో కూర్చుని, కాఫీ తాగుతూ ముచ్చట్లు పెట్టుకుంటున్న దృశ్యం అద్భుతంగా తోచింది. రమణి అమ్మ భుజంమీద తన చేయి వేసి, ఏదో చెబుతోంది. వాళ్లు తల్లీకూతుళ్లలా ఉన్నారు. వాళ్ల బాడీలాంగ్వేజ్ చూస్తే ముచ్చటగా అనిపించింది.

రమణి నన్నుచూసి, అమ్మవైపు చూసింది. అమ్మ వెళ్ళమన్నట్టు తలూపింది.

రమణి నా దగ్గరకు నడిచి వస్తుంటే నా చూపు ఎక్కడపడాలో అక్కడే పడింది. కానీ, నాకు ఆ గుండెల మీద వేళ్ళాడుతున్న మంగళసూత్రాలు తప్ప మరేం కనిపించలేదు.

## ఆటో ఇమ్యూన్ డిజార్డర్

శరీరంవ్యాధులబారినపడకుండా కాపాడటానికీ, పోరాడ టానికీ ఒక రక్షణ వ్యవస్థ ఉంటుంది. ఆ రక్షణ వ్యవస్థ పొరబడి తన సొంత శరీరంపైనే దాడిచేసే థైరాయిడ్ సమస్యలు, రుమటాయిడ్ ఆర్థరైటీస్, తెల్లమచ్చలు, సోరియాసిస్ వంటి వ్యాధులువస్తాయి. అందుకే వీటిని ఆటోఇమ్యూన్ వ్యాధులంటారు. **కారణాలు:** బ్యాక్టీరియా, వైరస్, కెమికల్స్, వాతావరణ కాలుష్యం. వంశపారం పర్యంగా కూడా ఇది వచ్చే అవకాశం ఎక్కువగా ఉంటుంది. **లక్షణాలు:** కండరాలనొప్పి, నీరసం, జ్వరం, అలసట. కీళ్ళనొప్పులు, చర్మం, రక్త కణాలు, రక్తనాళాలు వంటి భాగాలు ఎక్కువ ప్రభావానికీ లోనవుతాయి.

**వ్యాధి నిర్ధారణ:** ఆటోయాంటీ బాడీస్ టెస్టులు, సిబిపి, సీరియాక్టివ్ ప్రోటీన్, ఈ.ఎస్.ఆర్. సిబిపి, ఎరిత్రోసైట్ సెడిమెన్‌టేషన్‌రేట్.

**కొన్నిరకాల ఆటోఇమ్యూన్ వ్యాధులు:**

**రుమటాయిడ్ ఆర్థరైటీస్:** ఇదొక ఇన్‌ఫ్లమెటరీ ఆర్థరైటీస్, జీవక్రియలలో ఏర్పడే అసమతూల్యతవలన తలెత్తే ఈ ఆటోఇమ్యూన్ డిసీజ్, శరీరంలో ఇరు ప్రక్కలలో ఉండే కీళ్ళకు సమాంతరంగా వ్యాప్తి చెందుతుంది.

**థైరాయిడ్ సమస్యలు:** యాంటీబాడీస్ శరీరంలో తయారగుట వల్ల థైరాయిడ్ గ్రంథికి వ్యాపిస్తాయి. ఇది కొన్ని నెలలనుంచి కొన్ని సంవత్సరాలు పడుతుంది. రేడియేషన్ చికిత్స ఇచ్చినప్పుడు థైరాయిడ్ గ్రంథి దెబ్బ తిని హైపోథైరాయిడిజం రావచ్చు. హైపర్ థైరయిడ్ వచ్చినప్పుడు గ్రేవ్స్ డిసీజ్ అంటారు.

**లక్షణాలు:** మలబద్ధకం, డిప్రెషన్, నీరసం, అలసట, వెంట్రుకలు రాలిపోవడం, గోళ్ళు విరగడం, కాళ్ళు, చేతులు వాయడం, గొంతుబొంగురుపోవడం.

**వ్యాధి నిర్ధారణ:** టీ,టీ4,టీఎస్‌హెచ్ పరీక్షలు, లిపిడ్‌ప్రోఫైల్, సిబిపి, ఎల్.ఎచ్.టీ, ప్రోలాక్టిన్ మొదలైన పరీక్షలు చేయించుకోవాలి.

**సోరియాసిస్:** సోరియాసిస్ అనేది దీర్ఘకాలపు చర్మ వ్యాధి. ఇది పొలుసుల మాదిరిగా వచ్చే చర్మవ్యాధి. దురద, ఎర్రమచ్చలు శరీరమంతా వ్యాపిస్తాయి. ఈ వ్యాధి స్త్రీ పురుషులకు సమానంగా వస్తుంది. సోరియాసిస్ వ్యాధి ఎక్కువగా మోచేతులు,మోకాళ్ళు, తల, వీపు, అరిచేతులు, అరికాళ్ళు, ఉదరంపై, మెడ, నుదురు, చెవులు మొదలైన ప్రాంతాల్లో వ్యాపిస్తుంది. **లక్షణాలు:** చర్మం ఎర్రబడటం, జుట్టు రాలిపోవడం, కీళ్ళనొప్పులు, చర్మం పొడిబారి నప్పుడు, చర్మంపై పగుళ్ళు, ఏర్పడంతో పాటు రక్తస్రావం అవుతుంది.

**నిర్ధారణపరీక్షలు:** స్కిన్‌బయోప్సీ, ఈఎస్‌ఆర్, సిబిపి, ఎక్స్‌రే.

**డయాబెటీస్:** టైప్-1 డయాబెటీస్ అనేది ఆటో ఇమ్యూన్ డిజార్డర్‌లో మరో డయాబెటీస్ అనగాషుగర్ వ్యాధి. ఇది ఏ వయసులోనైనా రావచ్చు. ప్రస్తుతం భారతదేశంలో ప్రతి వంద మందిలో 14 మంది డయాబెటీస్ బారిన పడుతున్నారు. ఇది ఇన్సులిన్ ఉత్పత్తి లోపం వల్ల జరుగుతుంది. వంశపారంపర్యంగా కూడా ఇది రావచ్చు. ఇప్పుడు 20-30 ఏళ్ళ వారిలో సైతం కనిపిస్తోంది. డయాబెటీస్ రెండు రకాలుగా ఉంటుంది. టైప్ 1, టైప్ 2.

**టైప్ 1:** 20 సంవత్సరాల లోపు వారిలో వచ్చే వ్యాధి. ఇది ఆటోఇమ్యూన్ డిసీజ్‌గా చెబుతారు. ఇది చిన్నపిల్లలో కనిపించే సమస్య కనుక అది వారి మానసిక, శారీరక పెరుగుదల మీద చాలా ప్రభావాన్ని చూపుతుంది.

**టైప్-2:** డయాబెటీస్ 20 సంవత్సరాలు పైబడిన వారిలో కనిపిస్తుంది. ఏటా 5.1 మిలియన్ల మంది డయాబెటీస్ వల్ల మరణిస్తున్నారు. 2030 వరకు ప్రపంచంలోని ప్రతి ఇద్దరిలో ఒకరు డయాబెటీస్ బారిన పడే అవకాశం ఉందని అంచనా. టైప్-1, టైప్-2, టైప్-3 డయాబెటీస్ కుడా ఉంది ఇది జెస్టేషనల్ డయాబెటీస్ ముఖ్యంగా గర్భిణుల్లో కనిపిస్తుంది.




డా. మురళి అంకిరెడ్డి
M. D (Homeo)
స్టార్ హోమియోపతి


**లక్షణాలు:** ఆకలి, నీరసం, దాహం ఎక్కువగా ఉండటం. అతిమూత్రం, కళ్ళుమసకగా కనిపించడం, బరువు తగ్గడం. తలనొప్పి గుండెదడ, చెమటలు పట్టడం, గాయాలు నయం కాకపోవడం, కాళ్ళు, చేతులు తిమిర్లు రావడం.

**నిర్ధారణ పరీక్షలు.** ఫాస్టింగ్ బ్లడ్ షుగర్, పోస్‌డియల్ బ్లడ్ షుగరం, గ్లూకోజ్ టాలరెంట్ టెస్ట్, యూరిన్ షుగర్ లెవల్, రావడమే షుగర్ లెవల్, బ్లడ్ యూరియా లెవల్స్, సిరమ్ పరీక్షలు.

**హోమియోచికిత్స:** హోమియో వైద్యవిధానంలో వ్యాధి లక్షణాలు, మానసిక, శారీరక స్థితిగతులు, ఆహార వివరాలను పరిగణలోకి తీసుకొని చికిత్స అందించడ్ జరుగుతుంది. ఆటోఇమ్యూన్ డిజార్డర్స్ అన్నింటికీ హోమియోలో మంచి మందులు ఉన్నాయి. వీటితో ఎలాంటి దుష్ప్రభావాలు ఉండవు. ఇది అనుభవజ్ఞులైన హోమియో వైద్యుని పర్యవేక్షణలో చికిత్స తీసుకుంటే ఆటోఇమ్యూన్‌డిసీజ్‌ను సమూలంగా నయంచేయవచ్చు. మన రక్షణ వ్యవస్థను పటిష్ఠం చేయడం వ్యాధి మూలాలకు చికిత్స చేస్తూ వ్యాధి తిరగబడకుండా చికిత్స చేయడం హోమియోపతి యొక్కప్రాధాన్యం.



## సయాటికా (గుధ్రసీ వాతము)

ప్రస్తుత పరిస్థితిలో మానవుని జీవితం చాల యాంత్రికం గా మారిపోయింది. ముఖ్యంగా ఆహారపుఅలవాట్లు, దిన చర్య స్వప్నవిపర్యయం (పగటినిద్ర, రాత్రి సమయానికి నిద్రపోకపోవటం) లాంటి విషయాలలో అనేక మార్పులు రావటం వలన, ఆందోళన, మానసికఒత్తిడి లాంటి సమస్యల వలన మానవులనేక వ్యాధులబారిన పడుతు న్నారు. అందులో అతి ముఖ్యమైనది (నడుమునొప్పి) కటిశూల. నూటికి 90మంది తమ జీవితకాలంలో ఎప్పుడో ఒకసారి ఈనడుమునొప్పిసమస్యతో బాధ పడుతున్నారు. ఆయుర్వేద శాస్త్రంలో చరక, సుశ్రుత, వాగ్భటులు ఈ సమస్యను గుధ్రసీవాతం(సయాటికా)గా పేర్కొంటూ ఎంతో విపులంగా వివరించారు.

దీనికి సాధారణ కారణాలు పరిశీలించినట్లయితే... ఎక్కువగా ఒకే పొజిషన్‌లో కూర్చోవటం, స్థూల కాయం, అధికశ్రమతో కూడిన పనులు ఎక్కువ సేపు చేయటం, అధిక బరువులను మోయటం, ఎక్కువ దూరం ద్విచక్ర వాహనాలు, కార్లలోప్రయాణించటం, కొన్ని దీర్ఘకాలిక వ్యాధులువలన, కొన్ని వంశపారం పర్య వ్యాధులవలన, మరికొన్ని రోడ్డుప్రమాదాల వలన ఈ నడుము నొప్పి సమస్య వస్తుంటుంది. ముఖ్యంగా పైన వివరించిన కారణాలవలన శరీరంలో వాతప్రకోపంజరిగి, ముందుగా పిరుదులకు పైభాగాన స్తబ్ధతను, నొప్పినికలిగించి తరువాత కటి ప్రదేశం (నడుము), తొడలు, మోకాళ్ళు, పిక్కలు, పాదాలలో క్రమంగా నొప్పి కలుగుతుంది. దీనినే గుధ్రసీవాతాము (సయాటికా) అని అంటారు. ఈ సమస్య శీతాకాలంలో ఎక్కువ అవుతుంది. ముఖ్యంగా నడుముకు సంబంధించిన ఎల్4-ఎల్5, ఎస్1-ఎస్2 వెన్నుపూసల మధ్యగల సయాటికా అనే నరంపై ఒత్తిడి పడటం వల్ల ఈ నొప్పి వస్తుంది.

**డిస్క్‌లో వచ్చేమార్పులు:** ఈ వ్యాధిలో వెన్నుపూసలమధ్య ఉండే డిస్క్‌లో కొన్ని మార్పుల జరుగుతాయి. అవి డిస్క్ మీద ఒత్తిడి పెరగటం, వాపురావటం లేదా డిస్క్‌కి రక్త ప్రసరణ సరిగా లేకపోవటం, అరిగిపోవటం అనే సమస్యల వల్ల ఈ నొప్పి వస్తుంది. డిస్క్‌లో వాపు వస్తే దానిలోఉండే చిక్కనిద్రవం బయటకు వచ్చి మేరుదండం లేదా దాన్నుంచి వచ్చే నరాలపై ఒత్తిడి కలిగించటం వల్ల నొప్పి వస్తుంది.

**లక్షణాలు:** నడుములో నొప్పి కలగటం, వాపు, కొంచెం శారీరక శ్రమ చేయగానే నొప్పి తీవ్రత పెరగటం, ఈ నొప్పి సూదులతో గుచ్చినట్లుగా, ఒక్కోసారి తిమ్మిర్లు, మంటలతో కూడి ఉంటుంది. సమస్య తీవ్రమైనది అయితే స్పర్శహాని కూడా కలుగవచ్చు. ఒక్కోసారి మల మూత్రాలమీద నియంత్రణకూడా పోయేప్రమాదంఉంది. వెన్ను నొప్పి బాధ అనగానే సాధారణంగా పెయిన్‌కిల్లర్స్ తో కాలయాపన చేస్తుంటారు. దీనివల్ల తాత్కాలిక ఉప శమనం కల్గుతుంది. కాని మలబద్ధకం, జీర్ణా శయ సమస్యలు మొదలవుతాయి. కావున ఇలాంటి సమస్యల ను ప్రారంభదశలోనే గుర్తించి, జాగ్రత్త పడటం వల్ల ఈ వ్యాధిని సమూలంగా నయం చేయవచ్చు.

**ఆయుర్వేదచికిత్స:** ఆయుర్వేదంలో ఇలాంటి సమస్యల కు సమగ్రమైన చికిత్సాపద్ధతులుఉన్నాయి. అందులో **శమన చికిత్స:** ఇది దోషాలను బట్టి అభ్యంతరంగా వాడే ఔషధ చికిత్స ఇందులో వేదన, కాయకంగా ఔషదాలు ఉంటాయి. అలాగే వాతహార చికిత్సా పద్ధతులుంటాయి.

**శోధనచికిత్స:** శమన చికిత్స వలన ఒక్కోసారి మళ్ళీ వ్యాధి తిరగబెట్టవచ్చు. అందుకే ఆయుర్వేదంలో పంచకర్మ అనే ఒక ప్రత్యేక చికిత్సా పద్ధతి ఉంది. ఈ చికిత్సా పద్ధతీ ద్వారా ప్రకోపించిన వాతాది దోషాలను సమూలంగా తగ్గించవచ్చు.

**1.స్నేహకర్మ:** ఈ ప్రక్రియ ద్వారా వెన్నెముకలోని వెన్ను పూసల మధ్య స్నిగ్ధత్వాన్ని పెంపొందించి, తద్వారా జాయింట్స్‌లో కదలికలను తేలికగా వేయవచ్చును.

**2.స్వేదకర్మ:** ఈ పద్ధతిలో గట్టిగా అతుక్కొనిఉండే జాయింట్స్ ను మృదువుగా అయ్యేటట్లు వేయవచ్చును. కటివస్తి. ఈ ప్రక్రియ ద్వారా అరిగిపోయిన మృదులాస్థికి రక్త ప్రసరణను పెంచి తద్వారా నొప్పి తీవ్రతను తగ్గించ వచ్చును. అలాగే సర్వాంగధార, వస్తికర్మ అనే విశిష్ట చికిత్సా పద్ధతుల ద్వారా నాడీ కణాలలో కలిగిన లోపాల ను సరిచేయవచ్చు. అదేవిదంగా ప్రకోపించిన వాతాన్ని సమస్థితికి తీసుకురావచ్చు.

**జాగ్రత్తలు:** సరిఅయిన పోషకఆహారాలు తీసుకోవడం, నిదాన పరివర్జనం అనగా పైన చెప్పిన ప్రత్యేక వ్యాధి కారణాలను మళ్లీ చేయకుండా జాగ్రత్త పాటించినట్ల యితే ఈ సమస్యనుంచి శాశ్వతవిముక్తి పొందవచ్చును.


డా. లక్ష్మీ M. D (Ayurveda)
స్టార్ ఆయుర్వేద




# దడ పుట్టించే ప్రదేశాలు

**ఈ భూగోళంపై మనకు తెలియని ఎన్నో వింతలూ, విశేషాలూ ఉన్నాయి. అందమైన ప్రకృతి సుందర దృశ్యాలు, మనోహర ప్రదేశాలు, వింత ప్రదేశాలు ఎన్నో. చాలామందికి అవన్నీ తెలుసు. అయితే భయం గొలిపే ప్రదేశాలు కూడా ఎన్నో ఉన్నాయి!. దయ్యమా? అయితే నాకేం భయం? అనుకుంటే ఫర్వాలేదు కానీ అమ్మో దయ్యం! అని భయపడేవారికి మాత్రం ఆ ప్రదేశాలు నిజంగా గుండెల్లో దడ పుట్టిస్తాయి. అవి ఏమిటో ఒకసారి చూద్దాం!!**

భయం గొలిపే ప్రదేశాలు అనగానే అవి ఎక్కడో ఉన్నాయనుకుంటే పొరబాటే!

గుండెదడ పుట్టింటే అటువంటి అతి భయంకరమైన ప్రదేశాలు మనదేశంలోనే ఉన్నాయి.

చరిత్ర ఆధారంగా అక్కడ జరిగిన సంఘటనలను హాంటెడ్ ప్లేసెస్‌గా లెక్కేశారు. ఈ హాంటెడ్ ప్రదేశాలు గ్రామాల్లో, నిర్జన ప్రాంతాల్లో మాత్రమే ఉంటాయనుకుంటే పొరబడినట్టే. ముంబై, ఢిల్లీ, కోల్‌కతా, బెంగళూరు, ఉత్తరప్రదేశ్ వంటి ప్రధాన నగరాల్లో కూడా ఇవి ఉన్నాయట. వాటి గురించి మీరూ తెలుసుకోండి.

## రాజస్థాన్‌లో బ్రిజ్‌రాజ్ ప్యాలెస్

బ్రిజ్‌రాజ్ భవన్ ప్యాలెస్ రాజస్థాన్‌లో ఉంది. ఇది అతిపురాతనమైన ప్యాలెస్. దాదాపు 178 సంవత్సరాల క్రితం దీన్ని కట్టారు. 1980 సంవత్సరంలో హెరిటేజ్ హోటల్‌గా దీన్ని మార్పు చేశారు. ఈ ప్యాలెస్‌లో దయ్యాలు తిరుగుతుంటాయనేది అక్కడివారి వాదన. 1857 ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ సమయంలో మేజర్ బర్టన్ అతని ఇద్దరు కుమారులను మన సిపాయిలు ఈ ప్యాలెస్‌లో చంపేశారనీ, ఆ తర్వాత్తర్వాత బర్టన్ దయ్యంగా మారి ఆ ప్యాలెస్‌లో తిరుగుతున్నాడనీ అంటారు. అయితే ఇప్పటివరకు బర్టన్ ఆత్మ ఎవ్వరికీ ఎలాంటి హానీ చేయలేదని అక్కడి ప్రజలు చెప్తారు. నిజానిజాల సంగతి ఎలా ఉన్నా ఇప్పటికీ రాత్రిళ్ళు అక్కడికి వెళ్ళేందుకు ఎవరూ సాహసించరు.

## రాత్రిపూట నవ్వులు!

ఉత్తరప్రదేశ్ రాష్ట్రం మీరట్ జిల్లాలో ఉన్న జెపి బ్లాక్‌లో ఆత్మలు తిరుగుతాయట!

భయంకర ప్రదేశాలలో ఒకటిగా దీనిని చెబుతుంటారు. అక్కడ చాలా భయంకర సన్నివేశాలు చోటుచేసుకుంటుంటాయట. రాత్రి సమయంలో వింత వింత శబ్దాలు, నవ్వులు వినిపిస్తాయట. ఈ జెపి బ్లాక్‌లో కొందరు అమ్మాయిలు, అబ్బాయిలు ఆత్మహత్య చేసుకుని చనిపోయారనీ, వారి ఆత్మలు అక్కడ నివాసం ఉంటాయనీ స్థానికులు చెబుతుంటారు. అంతేకాదు కొంతమంది అబ్బాయిలు కొవ్వొత్తి కాంతిలో మందు తాగుతున్నట్లు, చిందులేస్తున్నట్లు అక్కడ చూసిన వారు చెబుతుంటారు. ఈ ఆత్మలను చూసి చాలామంది భయభ్రాంతులకు గురవుతుంటారట. ఇదంతా నిజమో అబద్ధమో తెలియదు కానీ ఆ ప్రదేశంలో దయ్యాలు ఉన్నాయని అక్కడివారికి మాత్రం గట్టి నమ్మకం ఉంది.

## డుమాస్ బీచ్

ఎవరైనా బీచ్‌కి ఎందుకు వెళతారు? కాసేపు హాయిగా ఆనందంగా ఎంజాయ్ చేయడానికే కదా..! అ బీచ్‌కి కూడా సందర్శకులు అదే ఉద్దేశంతో వెళతారుగానీ చీకటిపడితే మాత్రం ఆ బీచ్‌లో ఒక్కరు కూడా కనబడరు. రాత్రిళ్ళు బీచ్ దగ్గర ఎంజాయ్ చేద్దామనుకుని మీరు వెళ్ళినా గానీ అక్కడ ఎవ్వరినీ ఉండనివ్వరు కూడా! ఇంతకీ ఏంటా బీచ్ అనుకుంటున్నారా అదే డుమాస్‌బీచ్!

గుజరాత్‌లో అరేబియన్ సముద్రం వెంబడి ఉన్నదే డుమాస్ బీచ్. అక్కడ అనేక భయానక సంఘటనలు చోటు చేసుకున్నాయి. ఈ బీచ్‌లో ఇసుక కూడా వింతగా నలుపు రంగులో ఉంటుందట. ఆ ఇసుకని చూస్తే చాలామంది భయపడతారట. మార్నింగ్‌వాకర్స్‌కి, పర్యాటకులకు ఆ ప్రశాంత వాతావరణంలో చాలా సందర్భాల్లో గట్టిగా అరుపులు, వింత వింత ఏడుపులు, మూలుగులు వినిపించేవట. దాంతో అందరూ భయభ్రాంతులకు గురయ్యేవారట. అసలీ అందమైన బీచ్‌లో ఏముందో తెలుసుకోవాలనే ఉత్సుకతతో వెళ్ళిన చాలామంది జాడలేకుండా పోయారట. దాంతో రాత్రిపూట ఈ బీచ్‌లో ఎవ్వరినీ ఉండనివ్వరట. ఇదంతా వట్టి అబద్ధం అని కొట్టిపారేసేవారు కూడా లేకపోలేదు లెండి!!


బ్రిజ్‌రాజ్ ప్యాలెస్


డుమాస్ బీచ్


అగ్రసేన్ బావోలి

## అగ్రసేన్ బావోలి

అగ్రసేన్ బావోలి న్యూఢిల్లీలో ఉంది. ఇదొక అద్భుతమైన నిర్మాణం. 14వ శతాబ్దంలో బావోలి అగ్రసేన్ అనే వ్యక్తి ఈ నిర్మాణం చేశాడు. ఒకప్పుడు ఇది నీటితో నిండిపోయిన ప్రదేశం. కానీ ఇప్పుడు పూర్తిగా ఎండిపోయి ఉంది. అంతేకాదు నీళ్ళు ఉన్నప్పుడు ఆ నీరంతా నల్లగా ఉండేదట. నల్లగా ఎందుకుందన్నది ఎవరూ చెప్పలేకపోతున్నారు. ఆ నీటికి హిప్నటైజింగ్ చేసే శక్తి ఉందని స్థానికులు నమ్ముతున్నారు.

## మల్చామహల్

ఈ మహల్ ఢిల్లీలో ఉంది. ఢిల్లీలో బుద్ధ పార్కు వెనుక భాగంలో ఉండే అడవిలోనే ఈ ప్యాలెస్ ఉంటుంది. చూడటానికి చాలా భయంకరంగా ఉంటుంది. ఈ మహల్‌నే అక్కడివారు బిస్తారి మహల్ అని కూడా పిలుస్తారు. అక్కడ ఆత్మ తిరుగుతోందని వాదన. స్థానికులు చెబుతున్న కథనం ప్రకారం తన మనవరాలు బేగంకు నవాబ్ ఈ స్థలాన్ని కానుకగా ఇచ్చారు. ఆమెకు కుమారుడు రియాజ్, కుమార్తె సకీనా ఉన్నారు. అయితే కొన్ని ఇబ్బందుల వల్ల బేగం వజ్రాలను చూర్ణం చేసుకుని ద్రవంలో కలిపి తాగి ఈ మహల్‌లోనే ఆత్మహత్య చేసుకుంది. ఆమె శరీరం పది రోజుల పాటు అలానే ఉండిపోయి నల్లగా మారిపోయిందట. కర్మకాండలు జరిపించక మునుపు ఆమె పిల్లలు ఆమె శరీరంతో పాటే పక్కనే పడుకునేవారట. తల్లి మరణించిన తర్వాత యువరాణి సకీనా నలుపు రంగు దుస్తులు మాత్రమే ధరించేదట. ఇలా గగుర్పొడిచేలా ఉండే ఈ కథనం అక్కడ వినిపిస్తూ ఉంటుంది.

## ఫిరోజ్ షా కోట్ల

ఫిరోజ్‌షా తుగ్లక్ రాజుకి ఇష్టమైన స్థలం ఈ ఫిరోజ్‌షా కోట్ల. ఒకప్పుడు ఈ నగరం చాలా అందమైన ప్రదేశం. ప్రస్తుతం ఈ నగరం ఓ భయంకరమైన ప్రదేశంగా మారిపోయింది. ఈ ప్రదేశాన్ని దర్శించడానికి ఇంతకుముందు అనుమతి ఉండేది, కానీ ఇప్పుడు ఈ ప్రదేశాన్ని ఎవరూ చూడకూడదని ప్రభుత్వం ఆదేశాలు జారీచేసింది. ప్రస్తుతం విమానాల ద్వారా పైనుంచి దీన్ని సందర్శించవచ్చు. ఇంతకుముందు దీన్ని సందర్శించేందుకు వచ్చినవారు కారణం లేకుండానే ఇక్కడ ఆత్మహత్యలు చేసుకుని చనిపోయేవారట. వారు ఆత్మహత్యలు ఎందుకు చేసుకున్నారు? అనే విషయంపై అధికారులు కూడా ఇప్పటికీ స్పష్టమైన నిర్ధారణ ఇవ్వలేకపోతున్నారు. ఇది అత్యంత రహస్యమైన, భయంకరమైన ప్రదేశంగా పేరుగాంచినది.

## అడవిలో తలలేని బాలుడు!

పశ్చిమ బెంగాల్‌లో కుర్సియాంగ్ ఒక ఆహ్లాదకరమైన హిల్‌స్టేషన్. దానిపేరు డౌహిల్. ఇక్కడి వాతావరణం చాలా ప్రశాంతంగా ఉంటుంది. ప్రకృతి రమణీయతకు పెట్టింది పేరు ఈ ప్రాంతం. పాఠశాలలకు ఎక్కువగా ప్రసిద్ధి చెందింది డౌహిల్. ఐతే కేవలం పాఠశాలలకే కాదు మరణాలకు శరణాలయంగా కూడా పేరుగాంచింది. ఈ ప్రాంతాన్ని దాటే సమయంలో ప్రజలు భయంతో వణికిపోతుంటారట. ఈ ప్రాంతంలో రాత్రిళ్ళు వింత పాటలు, నవ్వులు వినబడుతుంటాయి. దయ్యం కనిపించడం, హఠాత్తుగా మాయమవడం ఇక్కడ మామూలే. అడవిని సందర్శించే పలువురు తల లేని బాలుణ్ణి చూసినట్టు చెబుతారు. మొత్తం మీద ఇది హాంటెడ్ ప్రాంతంగా ప్రసిద్ధిగాంచింది.

**దయ్యం అంటే భయపడేవారు కొందరుంటే అదంతా అపోహ అని కొట్టిపడేసేవారు మరికొందరున్నారు. అసలు దయ్యాలు ఉన్నాయా లేవా అనే విషయంలో ఎవరి నమ్మకం వారిది, కొన్ని గొప్ప గొప్ప పర్యాటక ప్రదేశాల వెనుక ఉన్న దయ్యాల కథలు తెలిసిన తర్వాత ఆ ప్రదేశాలను వెళ్ళి సందర్శిస్తారా లేక 'ఆ ఏముందిలే' అంటూ ఓ నవ్వు నవ్వి కొట్టి పారేస్తారా? ఏం చేస్తారు?**

## భాన్‌ఘర్ ఫోర్ట్

రాజస్థాన్ అళ్వార్ జిల్లాలో ఉంది ఈ భాన్ ఘర్ కోట. ఈ ప్రదేశానికి కొద్ది దూరంలో భారత ప్రభుత్వ పురావస్తుశాఖవారు ఒక బోర్డు కూడా పెట్టారు. అదేమిటంటే, 'సూర్యాస్తమయం తర్వాత, సూర్యోదయానికి ముందు ఈ కోటలోకి ప్రవేశం లేదు. ఈ ఆదేశాలు పాటించకపోతే చట్టపరమైన చర్యలు తీసుకోబడును' అని బోర్డుపై రాసి ఉంటుంది.

ఈ ప్రదేశంలో దయ్యాల మిస్టరీ గురించి చాలామంది చాలా రకాలుగా చెప్తుంటారు. వాటిల్లో రెండు కథనాలు ప్రసిద్ధి చెందినవి. ఈ పట్టణంలో గుడులు తప్ప ప్రజలు ఉండరని ఒక గురువు శాపం ఇచ్చాడన్నది ఒక కథనం. ఒక తాంత్రికుడు భాన్‌ఘర్ రాజకుమార్తెను వివాహం చేసుకోదలిచాడని, కానీ ఆమె అతని ప్రేమను తిరస్కరించడంతో ఆ మాంత్రికుడు ఆ ప్రదేశం అంతా శ్మశానంగా మారాలని శాపం ఇచ్చాడనేది మరో కథనం. ఇప్పటికి ఆ ప్రాంతంలో ఎన్నో మిస్టరీలు జరిగాయట.


మల్చామహల్


భాన్‌ఘర్ ఫోర్ట్

## అలేయా ఘోస్ట్ లైట్స్

బెంగాల్ రాష్ట్రంలో ఉన్న ఈ అలేయా ఘోస్ట్ లైట్స్ అడవిలో ఉంటాయి. అర్ధరాత్రి సమయంలో ఈ కారడవిలో కొన్ని స్థలాల్లో వెలుగులు కనిపిస్తాయి. అవి మిణుగురుపురుగుల వల్ల వచ్చిన వెలుగులే అని మొదట అనుకున్నారు కానీ అక్కడ మిణుగురు గుంపులు లేవట. దాంతో ఆ లైట్లు ఎలా ఎందుకు మెరుస్తున్నాయన్నది ఇప్పటికీ అంతుచిక్కని రహస్యంగా ఉండిపోయింది దీంతో అవి దయ్యాలేనని అనుకుంటున్నారు.

-సంతోషి




ఫిరోజ్‌షా కోట్ల


అలేయా ఘోస్ట్ లైట్స్

**ఆలోచనల్లో మునిగి ఉండగానే శ్రావణి ఆఫీసులో అడుగుపెట్టడం సీసీటీవీలో చూశాను. ఒక్క క్షణం గుండె కొట్టుకోవటం ఆగిపోయినట్టుగా అయింది. వెంటనే,**

**'హమ్మయ్య, ఓకే' అనుకున్నాను. 'ఫస్ట్ ఇంప్రెషన్ ఈజ్ బెస్ట్ ఇంప్రెషన్! మొన్న సినిమాలో చూసినట్టుగానే ఉంది, లైవ్‌లో కూడా'.**

రెండు నిమిషాల తర్వాత శ్రావణి నా రూంలోకి రాగానే, ఒక మెరుపు మెరిసినట్టయింది. నమస్కారం చేసి కూర్చుంది.

ఒక పాత తెలుగు సినిమా పాట ఉంది.

'నడుమేది అన్నాను, నవ్వింది వయ్యారి'.

అంటే

'ఒరేయ్ పిచ్చివెధవా, నడుమే లేదన్నంత సన్నని నడుమురా నాది' అని హీరోయిన్ నవ్వింది అన్న మాట.

శ్రావణిని చూడగానే, ఎంత సన్నని నడుమో అని అనుకున్న నాకు ఆ పాటే గుర్తొచ్చింది.

హీరోయిన్లు ఆడిషన్స్ అనగానే వాళ్ళకున్న ప్లస్ పాయింట్లన్నీ ప్రదర్శించే ఏర్పాట్లు చేసుకునే వస్తారు.

అలాగే శ్రావణి కూడా సన్నని నడుము, ఘనమైన వక్ష సంపద, బరువైన జఘనాన్ని ప్రదర్శించే కాస్ట్యూమ్స్, ప్రస్ఫుటమైన ఫేషియల్ ఎక్స్‌ప్రెషన్స్‌తో, కెమేరాలో పడేలా మేకప్‌తో వచ్చింది. ఆమె నడుస్తుంటే భూమి కందిపోతుందేమోనన్నంత సుకుమారంగా, పచ్చని పచ్చికబయళ్ళలో పరిగెత్తే కుందేలు పిల్లలా అనిపించింది.

కానీ, నా సినిమాలో, శారీరక అందంకన్నా, భావ వ్యక్తీకరణకే ఎక్కువ ప్రాముఖ్యం ఉంటుంది కాబట్టి మేము తయారుచేసిన కాస్ట్యూమ్స్ అంటే ముదురు ఆకుపచ్చ ముతక చీర, అతుకులు వేసిన పాత కాలపు రవిక, జారిపోయిన జుట్టు ముడి, మేకప్పు మొత్తం తీసేసి, కష్టాలతో కమిలిన ముఖం కోసం కొంచెం బ్లాక్ కలర్ ముఖానికి పూసి, వందశాతం డీ గ్లామర్ చేసి తీసుకు రమ్మన్నాను.

ఆమె మేకప్ మాన్‌తో కలిసి బైటకు వెళ్ళింది.

ఆ సీన్ గనుక నేననుకునే విధంగా వస్తే ఎలా ఉంటుందోనని ఊహించుకుంటుండగానే, శ్రావణి ఫుల్‌మేకప్‌లో నా రూంలోకి వచ్చింది. ఆమెను నేను గుర్తుపట్టలేకపోయాను. భువన మోహన సౌందర్యంతో అలరారే ఒక పరువాల పడుచు, బజార్లో ఎదురయ్యే బిచ్చగత్తెలా మారిపోయింది.

పురాణాల్లో, జానపద చిత్రాల్లో, పరకాయ ప్రవేశం అనే మంత్రవిద్య ఉంది. వేరే వారి శరీరంలోకి ప్రవేశించడం అందులో ప్రత్యేకత.

అలా శ్రావణి, నా హీరోయిన్ పాత్రలోకే పరకాయ ప్రవేశం చేసినట్టనిపించింది.

కానీ, ఆమె కళ్ళల్లో మెరుపు మాత్రం అలానే ఉంది.

"యస్, యస్! అద్భుతం!" అన్నాను.

ఆమె ఆడిషన్ చేసేద్దామంది.

"అప్పుడేనా? ఇంకా డైలాగ్స్ ప్రాక్టీస్ చేయాలి. యాక్సెంట్, ఎమోషన్, బాడీ లాంగ్వేజ్, తల విసుర్లు, కన్నీళ్ళు ఇవన్నీ కావాలి నాకు" అన్నాను నేను, కొంచెం సీరియస్‌గా.

నాకు తెలియదు, మేకప్ వేస్తున్న అర గంట టైంలో నవీన్‌ని పక్కన కూర్చోబెట్టుకుని తను డైలాగ్స్ ప్రాక్టీస్ చేసేసిందని.

"నేను ముందు చేస్తాను సార్, చూడండి' అంది.

ఆమె ఆత్మవిశ్వాసానికి నేను కొంచెం ఆశ్చర్యపోయాను.

ఆడిషన్ మొదలు కాగానే, మా ఆఫీస్ రూం చెరువుకట్ట మీది రచ్చబండగా మారిపోయింది.

వందలాది ప్రజల ముందు, పంచాయితీ పెద్దల ముందు మా హీరోయిన్ విశ్వరూపం ప్రదర్శించింది. వ్యంగ్యంగా నవ్వింది. ఏడ్చింది. కళ్ళల్లో నిప్పులు కురిపించింది. కళ్ళను జలపాతాలు చేసింది.






రకరకాల విన్యాసాలు.

రకరకాల భంగిమలు.

హాలంతా తిరుగుతూ, యుద్ధరంగంలో చెలరేగిన రాణీ రుద్రమలా, కేరళ ప్రాచీన యుద్ధ విద్య 'కలరిపాయట్టు'లా, మెషర్డ్ మూవ్‌మెంట్స్‌తో, తన పదునైన డైలాగులతో శత్రువులను దునుమాడింది. దయనీయమైన స్థితిలో పలికిన డైలాగులతో పంచాయితీ పెద్దల గుండెలను కరిగించింది. చివరకు స్పృహ తప్పి కింద పడిపోయింది.

కింద పడడం మా స్క్రిప్టులో లేదు. కానీ, అలా పడకపోతే, ఆ సీన్ ఇంతలా పండి ఉండేది కాదు. దటీజ్ ఇంప్రూవ్‌మెంట్.

నేనైతే, చెమర్చిన కన్నులను తుడుచుకోవటం మరిచిపోయి, ఆమెనే చూస్తూ ఉండిపోయాను.

మా కెమేరా ఆవురావురుమంటూ ఆ దృశ్యాలను మింగేస్తోంది.

ఇంతలో నవీన్‌తో పాటు మిగిలిన వాళ్ళందరూ చప్పట్లు కొట్టారు. నేను విభ్రాంతి నుండి తేరుకుని, నోట మాట రాకుండా నిలబడిపోయాను.



ఆమె నటనకు, భాష మీద ఆమెకున్న పట్టుకు, ఒక్కసారి చదవగానే దాదాపు రెండు పేజీల డైలాగులను బట్టీ పట్టినట్టు వల్లించిన ఆమె జ్ఞాపకశక్తికి నేను ఫ్లాట్ అయిపోయా.

టాలీవుడ్‌లోగానీ, ఏ 'వుడ్'లోగానీ, నటీనటుల్లో ఎవరైనా నచ్చిన వెంటనే నచ్చారని చెప్పరు. దాన్ని గుంభనంగా దాచిపెడతారు. అవతలి వాళ్ళలో సస్పెన్స్, టెన్షన్ క్రియేట్ చేస్తారు. ఓ పదిరోజులు తిప్పించుకుని, ఔననో కాదనో చెబుతారు. అమ్మాయిల విషయంలో అయితే, ఓకే చేసేముందు చాలా విషయాలు మాట్లాడుకోవాలి అని అంటుంటారు. నాకు మొదట్లో అర్థమయ్యేది కాదు.

అమ్మాయిలను సెలెక్ట్ చేసేముందు చాలా తతంగం జరుగుతుంది.

టాలీవుడ్ పెద్దలు ఒప్పుకోని, అందరూ ముక్తకంఠంతో, ఏకకంఠంతో ఖండించే కఠిన సత్యం, చేదునిజం.

అదే...

"క్యాస్టింగ్ కౌచ్!"

హీరోయిన్లు, ఒక కో ఆర్డినేటర్ కంట్రోల్‌లో ఉంటారు. కో ఆర్డినేటర్లు మేనేజర్ల కనుసన్నలలో పని చేస్తుంటారు.

ఒక అమ్మాయి నచ్చిందని అనగానే, వీళ్ళంతా రంగంలోకి దిగుతారు.

రెమ్యునరేషన్ ఎంతో మాట్లాడుకునేటప్పుడే, కమిట్‌మెంట్స్ గురించి మాట్లాడతారు. 'కమిట్‌మెంట్' అనే మాటకు డిక్షనరీ అర్థం... 'త్రికరణశుద్ధిగా తన కర్తవ్యాన్ని నిర్వర్తించే భావన' అని.

కానీ బాలీవుడ్‌లో గానీ, ఏ 'వుడ్'లో గానీ కమిట్‌మెంట్ అర్థం అది కాదు.

ప్రొడ్యూసర్‌తో ఎన్నిరాత్రులు, సెక్స్ కోసం గడుపుతుందన్న అంకెకు పర్యాయపదమే 'కమిట్‌మెంట్'. ఎన్ని కమిట్‌మెంట్స్! ఐదు కమిట్‌మెంట్స్ అయితే అందులో ప్రొడ్యూసర్‌తో మూడు, మిగిలినవి ఎవరితో అనే విషయాలన్నీ మేనేజర్, ప్రొడ్యూసర్, కో ఆర్డినేటర్ స్పష్టంగా ఒక అండర్‌స్టాండింగ్‌కి వస్తారు. రాతపూతలు ఉండవు గానీ, స్ట్రిక్ట్‌గా అమలు జరుగుతాయి.

అందుకే అమ్మాయి సెలెక్ట్ అయిన వెంటనే ఓకే చెప్పరు.

ఈ విషయాలన్నింటిలో అంగీకారం కుదిరిన తర్వాతే అడ్వాన్స్ ఇచ్చి, అగ్రిమెంట్ చేసుకుంటారు.

పెద్ద హీరోయిన్లకు, సొంతంగా మేనేజర్లు ఉన్న హీరోయిన్లకు ఈ న్యూసెన్స్ ఉండదు. వాళ్ళు ఎప్పుడూ డిమాండ్‌లో ఉంటారు కాబట్టి వాళ్ళను చాలా గౌరవంగా చూస్తారు.

అలా అని కమిట్‌మెంట్ ఇచ్చిన హీరోయిన్లను సెట్టులో అగౌరవపరచడం అంటూ ఉండదు. వారిని కూడా చాలా మర్యాదగా ట్రీట్ చేస్తారు. కానీ, ఒక రహస్య సంబంధం ఉండడం మూలంగా ఒక రకమైన క్లోజ్‌నెస్ ఏర్పడుతుంది.

అయితే, ఇప్పుడు పరిస్థితులు చాలా మారుతున్నాయి. బాగా చదువుకున్న అమ్మాయిలు, బాగా రిచ్ కుటుంబాల అమ్మాయిలు, సినిమారంగానికి చెందిన అమ్మాయిలు వస్తుండడం; న్యూ వేవ్ ప్రొడ్యూసర్లు, డైరెక్టర్లు మంచి సినిమాలు తీస్తుండడం, సినిమాలో చెప్పే మోరల్స్ నిజజీవితంలోనూ పాటించాలనే దృక్పథం ఉన్నవాళ్ళు పెరగడంతో కొంత.. ఓ యాభై శాతం మార్పు వచ్చింది.

హీరోయిన్లకైతే ఈ మెలిక ఉంటుంది కాబట్టి, సెలెక్ట్ అయ్యారా లేదా? అన్న విషయాన్ని సస్పెన్స్‌లో

### జరిగిన కథ

ఆస్కార్ అవార్డుల పోటీల్లో అన్యభాషా చిత్రాల జాబితాలో అతడి చిత్రం ఎంపికైన సందర్భంగా అమెరికా వెళుతున్నాడతను. విమానంలో కూర్చుని గతం గుర్తుచేసుకున్నాడు. అతడో తెలుగు దర్శకుడు. జూనియర్ ఆర్టిస్టు హత్యాయత్నం కేసులో తన బండారం బైటపెట్టిన ఆ దర్శకుడికి, డీసీపీ పుష్పాకిరణ్ ప్రమేయంతో, లిఫ్ట్ ఇస్తాడు నిర్మాత. దాంతో గొప్ప సినిమా నిర్మించేందుకు సన్నద్ధమవుతాడు ఆ దర్శకుడు. అంతలోనే నటి జలజ హత్యకు గురైంది. పకడ్బందీగా ప్లాన్‌చేసి, సయీమ్‌ని ఎన్‌కౌంటర్ చేస్తారు. డీసీపీని వేరే ప్రాంతానికి బదిలీ చేస్తారు. ఆడిషన్‌కోసం వచ్చిన కిరణ్‌ని చూసి సరైన హీరో దొరికాడనుకుంటాడు డైరెక్టర్. హీరోగా అతన్ని సెలెక్ట్ చేస్తాడు. పార్టీకి వెళ్ళిన కిరణ్, డ్రగ్స్ కేసులో ఇరుక్కుని జైలుపాలవుతాడు. ఆ బాధతో సినిమాకి వెళ్ళిన డైరెక్టర్‌కి, ఆ సినిమాలో నటి అతణ్ణి బాగా ఆకర్షిస్తుంది. ఆ తర్వాత.....



## ఐష్ ఐటెంసాంగ్?

మిగతా హీరోయిన్లలాగా ఐష్ ఐటెంసాంగ్ వైపు ఎప్పుడూ దృష్టి పెట్టలేదు. అప్పుడెప్పుడో ఓ సాంగ్ చేసింది అంతే! ఇప్పుడు తిరిగి ఐటెంసాంగ్ మీద ఐష్ మనసు పడిందట! సంజయ్‌లీలా భన్సాలీ సినిమా 'పద్మావతి'లో ఐటెంసాంగ్ చేయబోతోంది. ఆ సినిమాలో తనకూ భాగం కావాలని ఉంది అని సంజయ్‌లీలా భన్సాలీని ఐష్ అడిగిందట! దాంతో ఆయన వెంటనే సినిమాలో ఓ ఐటెంసాంగ్ పెట్టేశాడట! కాకపోతే ఈ సాంగ్‌లో ఐష్ అందాల మీద కాకుండా డ్యాన్స్ మీద దృష్టిపెడతాడట! ఐష్ నిర్ణయం కొందరికి సంతోషం కలిగించినా, అవకాశాలు తగ్గు ముఖం పడుతుండడంతో ఉన్నంతలో క్యాష్ చేసుకోవాలనే ఆలోచనతోనే ఐష్ వీటికి ఓకే చెప్పిందని కొందరు అంటున్నారు.

పెడతారు గానీ హీరోల విషయంలో కూడా అదే పద్ధతి అవలంబిస్తారు. కొత్త హీరోలైతే, వాళ్ళేమైనా పెట్టుబడి పెడ్తారా లేక డబ్బులు ఫైనాన్స్‌కు అరేంజ్ చేస్తారా అనే ప్రశ్నలు మొదలవుతాయి.

నా వరకైతే నేను కొత్త యాభై శాతంలోని వాణ్ణే.

ఎటువంటి ప్రలోభాలకూ లొంగను. ఎవ్వరి మాటా వినను. నచ్చకపోతే నచ్చలేదని నిర్మొహమాటంగా ముఖం మీదే చెబ్తాను. ఒకవేళ నచ్చితే, వెంటనే చెప్పేస్తాను. అందుకే, అలాగే, కిరణ్‌కి హీరోగా సెలెక్ట్ అయ్యాడని చెప్పాను.

శ్రావణి నాకు బాగా నచ్చింది. కెమేరామెన్, మేనేజర్, నవీన్ వద్దంటున్నా వినకుండా 'సెలెక్టెడ్' అని శ్రావణికి చెప్పేశాను.

రెమ్యునరేషన్ విషయంలో బేరసారాలు మొదలయ్యాయి.

ఆ డిస్కషన్స్‌లో నేనూ, శ్రావణీ ఇంట్రెస్ట్ చూపించలేదు.

పాత్ర క్యారెక్టరైజేషన్ ఎలా ఉండాలో ఆమెకు ఒక అవగాహన రావడానికి, మానిటర్‌లో సునీల్ కుమార్ రెడ్డిగారు డైరెక్ట్ చేసిన 'సొంతూరు' సినిమాలో 'తీర్థ' నటించిన పాత్రను నేను ఆమెకు చూపించాను. అదే విధంగా పాత్ర స్వభావం కేర్‌లెస్‌గా, ఒంటి మీద బట్టలు సరిగ్గా ఉన్నాయా లేదా అనే విషయం పట్టించుకోకపోవటం, ఒక సందర్భంలో తన ప్రతీమాటలో సమాజం మీద తిరుగుబాటు ధోరణి, హీరో కనపడగానే ఆమె ముఖంలో కనిపించే వెలుగు, కొంత ఎక్స్‌పోజింగ్, కొంత దిగజారుడుతనం కనిపించాలని స్పష్టంగా చెప్పాను.

రెమ్యునరేషన్, వాళ్ళు అడిగినంత ఇవ్వడానికి నవీన్ ఒప్పుకోలేదు. మేనేజర్ మా వైపు మాట్లాడుతున్నట్టు అనిపించినా, అతని ఇంట్రెస్టు వాళ్ళకు ఎక్కువ ఇప్పించడం, ఎక్కువ కమీషన్ కొట్టేయడంలోనే ఉంటుంది.

నవీన్ గీసి గీసి బేరమాడి ఫైనల్ చేసే ముందు నా దగ్గరికొచ్చాడు. వాళ్ళెంత అడిగిందీ, తనెంతకు ఒప్పించిందీ గర్వంగా చెప్పాడు. నేను వాళ్ళు అడిగినంతా ఇచ్చేయమన్నాను. నవీన్ నోరెళ్ళబెట్టాడు. 'నువ్వు ఈ ఫీల్డ్‌కు పనికిరావురా!' అన్నాడు.

'పర్వాలేదు' అన్నాను.

'నీ ఇష్టం' అంటూ ముఖం గంటు పెట్టుకుని వెళ్ళిపోయాడు.

అగ్రిమెంట్ తయారైంది.

నా సినిమాలో పాత్ర సొంతూరు సినిమాలో 'తీర్థ' పోషించిన పాత్రను పోలి ఉంటుందని అగ్రిమెంట్‌లో కూడా రాసి, దానికి తనకు అంగీకారమనే విషయాన్ని ఒప్పుకుంటున్నట్టుగా స్పష్టంగా రాసుకున్నాను. ఆ ఒక్క విషయం తప్ప వేరే కమిట్‌మెంట్స్ లేవు.

శ్రావణి సంతోషంగా అంగీకరించింది.

వెళ్ళేప్పుడు షేక్‌హ్యాండ్ ఇచ్చింది.

ఆమెను, ఆ క్షణంలో ముట్టుకోవాలంటేనే బెరుకుగా అనిపించింది.

ఆమె నా ఆఫీసులో అడుగుపెట్టిన క్షణం నుండి తనను శ్రావణిగా కాకుండా, నా సినిమా హీరోయిన్‌గానే భావించాను.

"వావ్, ఐ గాట్ మై హీరోయిన్!"

•••

మా ఆఫీసులో మూడు బెడ్‌రూములున్నాయి. ఒకటి నాకు, ఒకటి ప్రొడ్యూసర్‌కి, ఒకటి ప్రొడక్షన్ సామాను పెట్టడానికి వాడతాం. నవీన్‌తో సహా మిగిలిన స్టాఫ్ అంతా హాల్లో కూర్చుంటారు.

నాకు, నా రూములో కూర్చోవడం కన్నా, అందరితో కలిసి కూర్చోవడమే ఇష్టం. అయితే, అప్పుడప్పుడు డైరెక్టర్ హోదా ప్రదర్శించవలసిన సందర్భంలో మాత్రం, నా రూములో కూర్చుంటాను.

ఆరోజు మేమందరం హాల్లో కూర్చుని మాట్లాడుకుంటున్నాం.

శ్రావణి హీరోయిన్‌గా సెలెక్ట్ అయింది కాబట్టి, హీరో కోసం ప్రయత్నాలు ముమ్మరం చేశాను. నాకు ఎవరూ సాధారణంగా నచ్చకపోవడంతో, ఆఫీసు వాళ్ళు కొంచెం చిరాకుగా ఉన్నారు.

"సార్! మన సినిమాకు కొత్తహీరోనే ఎందుకు తీసుకోవాలి? పాపులర్ హీరోలను తీసుకోవచ్చుగదా?" అని అభిషేకం గారు ప్రశ్నించారు.

సమాధానం ఏం చెప్పాలా అని నేను కూడా ఆలోచించాను.

ఆ ప్రశ్నకు సమాధానం చెప్పగలిగితే, నా మనసులో ఉన్న సందేహాలు కూడా క్లియర్ అవుతాయి. నా మనసులో కూడా ఇదే ప్రశ్న చాలా రోజులుగా నలుగుతోంది. నేను పాపులర్ హీరోలను వద్దని అనుకుంటున్నాను గానీ, దానికి కారణాలేమిటో నేనెప్పుడూ నిర్వచించుకోలేదు.

ఇప్పుడు చెప్పాల్సిన సమయం ఆసన్నమైంది. దాట వేయవచ్చు. కానీ, వాళ్ళ దృష్టిలో నా విలువ తగ్గిపోతుంది. కుంటిసాకులు చెబుతున్నానను కుంటారు.

నేను సన్నద్ధమయ్యాను.

"ప్రపంచంలో ఏ చిత్రపరిశ్రమలో లేని ఒక విచిత్ర పరిస్థితి టాలీవుడ్‌లో నెలకొని ఉంది. ఇక్కడ హీరోలు హీరోలు కాదు. అభిమానులకు సాక్షాత్తూ దేవుళ్ళు. వారు తెలుగు సినీసామ్రాజ్య చక్రవర్తులు. వారిని డైరెక్ట్ చేయడమంటే, డైరెక్టర్ అసిధారవ్రతం చేయడం లాంటిదే. హీరోలు ఎంతసేపటికీ తమను ఎంతబాగా ప్రొజెక్ట్ చేస్తున్నారనే విషయం మీదనే దృష్టిపెడతారు. కథనానికి, కథాగమనానికి ఇబ్బంది కలిగినా పర్వాలేదు గానీ, తమ ఇమేజ్ చట్రం నుండి బయటకు రావడానికి ఇష్టపడరు. వాళ్ళ సినిమాలో హీరోకు, భూ ప్రపంచంలో ఎవ్వడూ చేయలేని ఫైట్లు కంపోజ్ చేసి ఉండాలి. ఇద్దరు ముగ్గురు హీరోయిన్లు కంపల్సరీగా ఉండాలి. ఐదారు పాటలు ఉండాలి. అందులో రెండో మూడో పాటలు, సినిమా షూటింగు జరుపుకుంటున్న సీజన్‌ను బట్టి, అంటే ఎండాకాలమైతే చల్లటి ప్రదేశాల్లో, చలికాలమైతే వెచ్చటి విదేశాల్లో ఉండాలి.

డైరెక్టర్లు హీరోలను 'బాబూ, బాబూ' అంటూ దాదాపు బెగ్గింగ్ చేసినట్టు అడుక్కుని నటింపచేయాలి. ఇక, చిన్న సినిమాలు తీసి తమ టాలెంట్‌తో వాటిని లాభాలబాట పట్టించిన తర్వాత పెద్ద హీరోల మోజులో, వాళ్ళ సినిమాలను డైరెక్ట్ చేసే అవకాశం పొందిన యంగ్ డైరెక్టర్లయితే, కేవలం యాక్షన్ చెప్పడం వరకే వాళ్ళ పని. మిగిలిన డైరెక్షన్ అంతా ఆ పెద్దహీరోనే చూసుకుంటారు. ప్రతీ సీను, సినిమా మొదటి సీనులో హీరో ఇంట్రడక్షన్ సీనులా ఉండాలని, స్లో మోషన్‌లో ఉండాలని ఆజ్ఞలు జారీచేస్తారు. హీరో ప్రతి అడుగుకు భూమి దద్దరిల్లిపోవాల్సిందే. చేతిలో పిస్టల్ ఉందంటే, ఎప్పుడూ పేలుతుండాల్సిందే! ఈ మధ్య వచ్చిన

**పురాణాల్లో, జానపద చిత్రాల్లో పరకాయ ప్రవేశం ద్వారా వేరేవాళ్ల శరీరాల్లోకి ప్రవేశించి రకరకాల విన్యాసాలు చేస్తుంటారు. అలా ఆమె హీరోయిన్ పాత్రలోకి పరకాయ ప్రవేశం చేసినట్టనిపించింది డైరెక్టర్‌కి. అద్భుతమనిపించింది. రూపం బిచ్చగత్తెలా ఉన్నా ఆమె కళ్ళలో మెరుపు మాత్రం తగ్గలేదు. రకరకాల భంగిమలు, హావభావాలతో నటనకే నిలువెత్తు రూపం అన్నట్లుంది ఆమె నటన. ఆ హాలంతా చప్పట్ల మోతలతో మారుమోగింది. ఆమె ఎవరు? ఎందుకు అలా నటించింది?**

ఒక హిట్ సినిమాకు సీక్వెల్‌లో, ప్రతీ ఫ్రేములో హీరో వేలు పెట్టడం మూలంగానే సినిమా పోయిందన్న విషయం బహిరంగ రహస్యం.

ఇక ఈ హీరోల మూడ్స్ చిత్రవిచిత్రంగా ఉంటాయి. హీరోకు ఇష్టమైతే రెండు మూడు రోజులు షూటింగ్ చేస్తాడు. లేకపోతే, మిగిలిన వారందరూ అయ్యగారి దర్శనానికై చకోర పక్షిలా ఎదురు చూడాల్సిందే.

వీటికి తోడు పాపులర్ హీరోలను నేను వద్దన డానికి మరో కారణం వారి గొంతెమ్మ కోరికలు. ఆ కోర్కెలు తీర్చేంత బడ్జెట్ నా సినిమాకు లేక పోవడం ఒక కారణమైతే, వారి ఆటిట్యూడ్ భరిం చడం నా వల్లకాదు. ఆ ఆటిట్యూడ్ మూలంగానే వాళ్ళ సినిమాలు ఫ్లాప్ అవుతున్నాయనే విషయం గమనించలేనంత అంధకారంలో వాళ్ళు ఉన్నారు. ఫ్రెష్ ఐడియాలతో, కొండంత ఆత్మవిశ్వాసంతో టాలీవుడ్‌లోకి వచ్చే కొత్త దర్శకులు ఎవ్వరూ ఈ టాప్‌హీరోల టాంట్రమ్స్ సహించే మానసిక స్థితిలో లేరు. అందుకే, స్ట్రాంగ్ స్టోరీ లైన్ ఉంటే యంగ్, చిన్న హీరోలను పెట్టుకుని గొప్ప విజయాలు సాధిస్తున్నారు. పెద్ద హీరోలను పెట్టుకుని ముప్పై నలభై కోట్ల బడ్జెట్లో ఓ సంవత్సరం పాటు తీసే సినిమాతో హిట్‌కొట్టడం టాలీవుడ్‌లో, ఈ రోజుల్లో, చాలా కష్టమైన పని. ఈ హై బడ్జెట్ సినిమాలు కేవలం ప్యాకేజ్ డైరెక్టర్లకే లాభసాటిగా మారుతు న్నాయి. ఈ డైరెక్టర్లు ప్యాకేజ్ మాట్లాడుకుని ఓ ఆస్థాన హీరోనో, ఫ్లాపులతో మరుగునపడే ప్రమా దంలో ఉన్న హీరోనో పెట్టుకుని, గబగబా చుట్టేసి,

## సినీవాలి
## కూపన్ నెం.9 విజేత
## ఆదూరి పద్మావతి
## నిజాంపేట్, హైదరాబాద్

రెండు వేలు, మూడు వేల స్క్రీన్లలో రిలీజ్ చేసి, ప్రజల మీదకు వదులుతుండడంతో చాలా సిని మాలు ఫ్లాప్ టాక్ తెచ్చుకుంటున్నాయి.

ప్రేక్షకులు కూడా ఈ రోజుల్లో తెలివి మీరారు. ఇట్లాంటి గిమ్మిక్కులను, కాపీ సినిమాలను వెంటనే పట్టేస్తున్నారు. ఈ మధ్యనే, ప్రపంచం మొత్తం మీద తెలుగు సినిమా సత్తా చాటిందన్న సినిమా ఫస్ట్ పోస్టర్ రిలీజ్ అయిన గంటల్లోనే దాని ఒరిజి నల్‌ను పట్టేసి ఫేస్‌బుక్‌లో పెట్టి గోలగోల చేశారు. ఈ ప్యాకేజ్ డైరెక్టర్ల మీద డిస్ట్రిబ్యూటర్లు, నిర్మా తలు... నిర్మాతల మండలికి ఫిర్యాదుచేయడం; డైరెక్టర్లు, నిర్మాతల మీద... డైరెక్టర్ల సంఘానికి కంప్లైంట్ చేయడం ఈ మధ్య ఎక్కువైంది. ఇవన్నీ లైవ్ టెలికాస్ట్ చేసి రచ్చరచ్చచేసిన టీవీ ఛానళ్ళు ఎంత అగ్రెస్సీగా ప్రారంభించాయో, అంత అర్ధాంతరం గానే ముగించడంలో లోగుట్టు పెరుమాళ్ళకే ఎరుక.

ఈ రోజుల్లో, మీ అందరికీ తెలుసు. మార్నింగ్ షో అయిపోయేసరికల్లా వెబ్‌సైట్లలో, ఛానళ్ళలో ఫ్యాన్స్, క్రిటిక్స్ రివ్యూలు, కామెంట్లు రాసిపడేసి, చెత్త సిని మాలను చీల్చి చెండాడుతూ, రేటింగులను ఇచ్చి పడేస్తున్నాయి.

'కబాలి' లాంటి సినిమానే ఖండఖండాలుగా నరికి సినిమా విడుదలైన మొదటిరోజే నాశనం చేశాయి. ప్రేక్షకులు గందరగోళంలో పడిపోయారు. ప్రేక్షకుడు సినిమా చూసి తన జడ్జిమెంటు ఇవ్వక ముందే, క్రిటిక్స్ సినిమాకు మరణ శాసనం రాసే స్తున్నారని సినిమా నిర్మాతలు మొత్తుకుంటున్నారు. క్రిటిక్స్ కూడా పక్షపాతాలకు, ప్రలోభాలకు అతీ తులేం కాదు. వారు కొన్ని సినిమాలకు అనుకూ లంగా, కొన్ని సినిమాలకు ప్రతికూలంగా రాసి పడేస్తున్నారు. లేకపోతే, ఒక ఛానల్లో బ్రహ్మాండ మైన రేటింగ్ వచ్చిన సినిమాకు పక్క ఛానల్లో దరిద్రపు రేటింగు ఎలా వస్తుంది? ఈ రేటింగు లను నమ్ముకుని సినిమా చూసే ప్రేక్షకులు చాలా మందే ఉన్నా, వారి నమ్మకాన్ని నిలుపుకునే క్రిటిక్స్ ఒక్కరో ఇద్దరో మాత్రమే ఉన్నారు. ఒక హీరో సినిమా రిలీజ్ అయితే, ఆ హీరో ఫ్యాన్స్ ఆ సిని మాను ఆకాశానికి ఎత్తేయడం, మిగిలిన హీరోల ఫ్యాన్స్ దాన్ని పాతాళానికి తొక్కేయడం సాధా రణంగా జరుగుతుంటుంది.

అందుకే, మనం ఈ లంపటంలో చిక్కుకోకూ డదు. మనం క్రిటిక్స్ రివ్యూలకు భయపడి, మన లైన్‌కి వ్యతిరేకంగా సినిమా తీయాల్సిన పనిలేదు.

అందుకే, ఒకవేళ నా బడ్జెట్ పర్మిట్ చేసినా కూడా నేను పెద్ద హీరోల జోలికి వెళ్ళను. ఎందు కంటే, వాళ్ళు ఇమేజ్ చట్రం నుండి బయటకు రాలేరు. అలా వాళ్ళు రావాలనుకున్నా వాళ్ళ ఫ్యాన్స్ ఒప్పుకోరు. పనికిరాని, పసలేని పంచ్ డైలాగులు,

**ఈవారం సినీవాలి చదివారు కదా!**
**మా ప్రశ్నకు మీ జవాబు క్రింది కూపన్‌లో స్పష్టంగా రాసి**
**కూపన్‌ని కత్తిరించి మాకు పంపండి. లక్కీడిప్‌లో ఫ్యాన్సీ చీర గెలుచుకోండి!**

### సినీవాలి -11 (28-12-2016)

మా ప్రశ్న: శ్రావణికి డైరెక్టర్ ఏ సినిమా చూపించాడు?

మీ జవాబు------------------------------------------------------------

చిరునామా------------------------------------------------------------

---------------------------------------------------------------------

------------------------------పిన్------------------ఫోన్‌నెం------------------

**ఈ కూపన్‌ను 27 డిసెంబర్ 2016 తేదీలోగా మా కార్యాలయానికి పంపగలరు.**

మా చిరునామా:నవ్య వీక్లీ, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం. 76, రోడ్ నెం 70, అశ్వనీ లే అవుట్, హుడా హైట్స్, జూబ్లీ హిల్స్, హైదరాబాద్-33

వివాహాది శుభకార్యాలకు కంచిపట్టు చీరల నిలయం పి.యన్.మూర్తి క్లాత్‌స్టోర్స్ మెయిన్ రోడ్, హన్మకొండ వారి సౌజన్యంతో...

సెన్సారుకు దొరకకుండా వాడే బూతు మాటలు, రంకు డ్యాన్సులు, తొడలు కొట్టడాలు, ఒక్క గుద్దుకు వంద మందిని రక్తం కక్కుకునేటట్లు కొట్టడం, హీరోను చూస్తేనే చిరాకుపుట్టే వ్యక్తిత్వంతో రూపొం దించడం నా వల్ల కాదు.

తెలుగు సినిమాల్లో ఇప్పుడు కొంచెం తగ్గింది కానీ, ఇంతకు ముందు బూతు ప్రవాహాలు, మురికి కాలువల్లా ప్రవహించేవి.

ఒక సినీ కవి ఒక పాటలో 'పుచ్చుకుంటాలే నీ పూతరేకు' అని హీరోతో పాడించి దానికి సమాధా నంగా హీరోయిన్‌తో 'విచ్చుకుంటా గానీ వీడిపోకు' అని అనిపిస్తాడు. తెలుగు సినిమాల్లో ఇలాంటి ద్వంద్వార్థాలకు కొదవే లేదు.

ఇట్లాంటి భావ దారిద్ర్యం నాకొద్దు. హీరోకు సెక్స్ కోరిక కలిగితే, దాన్నే చూపిద్దాం కానీ, ఈ బూతుమాటలు నా సినిమాలో ఉండకూడదు. అందుకే, నా మటుకు నేను పూర్తిస్వేచ్ఛగా పని చేయాలనుకుంటాను. ఎవ్వరు సలహా ఇచ్చినా తీసుకుంటాను. కానీ, ఫైనల్ డెసిషన్ మాత్రం నాదే. సినిమా కంటెంట్, దర్శకత్వానికి సంబంధించి నంత వరకు నన్ను డిక్టేట్ చేయడానికి నేను ఒప్పు కోను" అని, ఆగి ఊపిరి పీల్చుకున్నాను.

"ఈ విషయాలన్నీ బయటకు చెప్పలేం కాబట్టి మీరు కూడా ఎవరితోనూ అనకండి!" అని నవ్వాను.

ఎన్నోఏళ్ళుగా సినీరంగంలో ఉన్న వాళ్ళకు, ఈ విషయాలన్నీ తెలియనివి కావు. కానీ.... నాకు తెలి యదని వాళ్ళ ఉద్దేశం. నేను ఇంత నిర్మొహమా టంగా నా అభిప్రాయం చెప్పడం వాళ్ళకి నచ్చ లేదని వాళ్ళ ముఖాలు చూస్తేనే అర్థమవుతోంది. ఎందుకంటే, వాళ్ళకు సినిమాకు సంబంధించినంత వరకు ప్రయోజనం, లాభాలు మాత్రమే. నా దృష్టిలో సినిమా ప్రయోజనం ఇంకా విస్తృతమైంది.

నా అభిరుచికి అనుగుణంగా 'కిరణ్' దొరి కాడు. కానీ, దురదృష్టవశాత్తు అతడు జైలు పాల య్యాడు. మరో హీరో కోసం వెతుకుతుంటే, పద్మా వతి అనే కో ఆర్డినేటర్ 'రాం' అనే అబ్బాయిని పంపించింది. 'కిరణ్' పోలికలు అతనిలో కొట్టొచ్చి నట్లు కన్పించాయి. లక్కీగా, 'రాం' పర్ఫార్మెన్స్ కూడా బాగుంది. కానీ 'రాం' ముఖం లేతగా ఉంది. అంతటి బరువైన పాత్ర అతను పోషించలేడని కెమేరామెన్, నవీన్ అభిప్రాయపడ్డారు. నాకేమో అతన్ని వదులుకోవాలని అనిపించలేదు. అందుకే, ఓ వారం రోజుల పాటు గడ్డం పెంచుకున్న తర్వాత మరోసారి ఆడిషన్ చేద్దామని చెప్పాను.

హీరో హీరోయిన్లు ఫైనలైజ్ అయిన తర్వాత ఇంక షూటింగ్ ఆపడానికి వీల్లేదు. ఎందుకంటే, మా హీరో కొత్తవాడే అయినా, హీరోయిన్ చాలా సినిమాల్లో చేస్తోంది. ఆమె మాకు కేటాయించిన డేట్లలో ఎట్టి పరిస్థితుల్లోనూ షూటింగ్ జరపాల్సిందే. లేకపోతే, మళ్ళీ ఆమెకు ఎప్పుడు వీలవుతుందా అని ఎదురు చూడాల్సిన పరిస్థితి ఏర్పడుతుంది.

అందుకే, ఒకపక్క హీరోహీరోయిన్ల కోసం, ఆడి షన్స్ జరుగుతుండగానే, మరో టీం లొకేషన్ల వేటలో పడింది.

నా కథ ప్రకారం, హీరోకు ఫ్లాష్‌బ్యాక్‌లో తల్లి దండ్రులు, హీరోయిన్, ఆమెతో ప్రేమ వ్యవహారం గుర్తొస్తుంది. ఈ ఫ్లాష్‌బ్యాక్ ఎపిసోడ్ చాలా అద్భు తంగా తీయాలని నేను ముందునుంచే ప్లాన్ చేసు కున్నాను. ఎందుకంటే, సినిమా జరుగుతున్న ప్రస్తు తంలో హీరోను ఒకరకమైన మానసిక స్థితిలో చూపించదలుచుకున్నాను. దానికి పూర్తి వ్యతిరే కంగా ఒక జుబిలియెంట్ మూడ్‌లో, ఫ్లాష్‌బ్యాక్‌లో చూపించాలనుకున్నాను. అందుకు, పచ్చటిపొలాలు, పల్లెటూరి అందాలు, సూర్యోదయాలు, సూర్యాస్త మయాలు, ఆరుబయట వెన్నెలలు, పక్షుల కిల కిలారావాలు ఉంటే శృంగారం బాగా పండుతుంది.

లక్కీగా, ఈ సమయంలో వర్షాలు ఆగిపోయి, ప్రకృతి అంతా, పచ్చటి పైట వేసుకున్న పల్లె పడు చులా పరవళ్ళు తొక్కుతుంది. సూర్యోదయం కూడా తొందరగా అవుతుంది. పొద్దున్నే వచ్చే ఎండలో సీన్లు అద్భుతంగా పండుతాయి. కెమేరామెన్లకు ఇష్టమైన టైం అది.

అయితే, సినిమాలో హీరోది ఓ మారుమూల పల్లెకు చెందిన దిగువ మధ్యతరగతికి చెందిన రైతు కుటుంబం. సినిమాను నిజజీవితానికి దగ్గ రంగా తీయాలంటే సెట్లు వేసి స్టూడియోల్లో షూట్ చేయడం సాధ్యం కాదు. రియల్ లైఫ్ లొకే షన్లలో అయితే, 1970 ప్రాంతాలలో కనిపించే ఆ ప్రాపర్టీస్, ఆ తలుపులు, అరుగులు, చెక్కగుంజలు, పాడైపోయిన ఫ్లోరింగ్, పాతకాలపు బావులు ఉంటే సీన్లకు బలం చేకూరుతుంది. హీరో ఇంటి కోసం నాకు పాతకాలపు మండువా ఇల్లు లేదా చతుశ్శాల భవంతి కావాలి. అలాగే ఒక చెరువు, గుడి సెలు, పాతకాలపు గుడి, పశువులు, గడ్డిమేటలు, పాతకాలపు వ్యవసాయ పనిముట్లు, ఎడ్లబళ్ళు కూడా ఉంటే చక్కటి గ్రామీణ వాతావరణం సమ కూరుతుంది.

మా కెమేరామెన్ తిరుపతిరెడ్డికి తెలిసిన ఒక ఫ్రెండుది నర్సాపూర్. మాకు కావలసిన రిక్వైర్మెంటు అతనికి చెబితే, నర్సాపూర్‌కు నాలుగైదు కిలో మీటర్ల దూరంలోని 'రుస్తుంపేట', 'కాగజ్‌మద్దూర్' వంటి ఊళ్ళు ఉన్నాయని, ఆ ఊళ్ళల్లో మాక్కావల సిన లొకేషన్లు ఉన్నాయని చెప్పడంతో ఒకరోజు అసిస్టెంట్ కెమేరామెన్‌వెళ్ళి షూట్ చేసుకుని వచ్చాడు. ఆ లొకేషన్లు మాక్కూడా నచ్చడంతో ఒకరోజు ఉద యాన్నే నేను, తిరుపతిరెడ్డి, నవీన్ బయల్దేరాం.




సిటీ పొలిమేరలు దాటగానే, నర్సాపూర్ అడవి ప్రత్యక్షమైంది. అడవితల్లి... హరితహారం ధరించి, స్వచ్ఛమైన ప్రాణవాయువులతో, ఆహ్లాదకరమైన ఎండతో మాకు ఆహ్వానం పలికింది. సినిమా వాళ్ళకు, ఔట్‌డోర్ షూటింగులో, అత్యంత ఆవశ్యక మైంది, ప్రీతిపాత్రమైంది ఎండనే!

ఎండ ఉంటేనే షూటింగ్. లేకుంటే లేదు. వంద లైట్లు పెట్టినా, ఎండ ఎండే!

నర్సాపూర్ అడవిలో అడుగుపెట్టగానే, ఆకర్షించే వింత ఒకటి ఉంది. అడవి ప్రారంభం కాగానే అరటి పళ్ళ బళ్ళు అనేకం ఉంటాయి. మా డ్రైవర్ కూడా కారాపి ఐదు డజన్ల అరటిపళ్ళు తీసుకున్నాడు. వాటిని చిన్నచిన్న ముక్కలుగా కట్ చేయించాడు. మేమంతా ఆశ్చర్యంగా చూశాం.

కారు ఓ అరమైలు కూడా పోకుండానే, రోడ్డు పక్కన క్రమశిక్షణ కలిగిన సైనికుల్లా ఒక చక్కటి వరుసలో కోతులు నిలబడి ఉన్నాయి. డ్రైవర్ కారు మెల్లగా, అరటిపళ్ళ ముక్కలను విసురుతూ డ్రైవ్ చేయసాగాడు. దారి పొడుగునా కోతులన్నీ నిల బడి మాకు స్వాగతం పలికాయి. నాలుగు మైళ్ళ అడవిలో ప్రయాణం ముగించేసరికి అరటి పళ్ళు అయిపోయాయి. కోతులూ మాయమయ్యాయి.

"అడవి ప్రారంభం కాగానే అరటిపళ్ళు వేస్తేనే, ఆ కారో, మోటార్‌సైకిలో తమ దగ్గరికి వచ్చిన పుడు మాత్రమే కోతులు లేచి నిలబడతాయి. అరటి పళ్ళు వేయని వాహనాలు వస్తే కోతులు సైలెం టుగా, రోడ్డుకు దూరంగా కూర్చుంటాయట. మరి వాటికి ఫలానాకారులో వాళ్ళే అరటిపళ్ళు వేస్తారని ఎలా తెలుస్తుందో గానీ, ఆ వాహనం వస్తేనే నిల బడతాయి" అంటూ డ్రైవర్ చెబుతుంటే ఆశ్చర్యంగా విన్నాం. బహుశా వాటికి, మనలోలేని, ఏదో టెలీ పతి లాంటి జ్ఞానం ఉందేమోననిపించింది.

నర్సాపూర్ చౌరస్తాలో మా ఫ్రెండ్ కలిశాడు. అతనితో కలిసి చుట్టుపక్కల చాలా ఊళ్ళు తిరిగాం.

*(ఇంకావుంది)*

# భూమిలాంటి మరో గ్రహం!

అన్ని గ్రహాలకీ లేని ప్రత్యేకత భూగ్రహానికి ఉంది. అదే అనుకూలమైన వాతావరణం. భూమిపైనే కాకుండా ఇతర గ్రహాలపైన నివసించే వాతావరణం ఉందా లేదా అని పరిశోధకులు నేటికీ వారి పరిశోధనలు కొనసాగిస్తూనే ఉన్నారు. ఈక్రమంలో నాసా పరిశోధకులు ఇటీవల ఒక గ్రహాన్ని గుర్తించారు.

ఈ గ్రహం మన సౌరమండలానికి అవతల, అతి సమీపంలోనే ఉంది. దీని సైజు మన భూగ్రహం కన్నా కాస్త పెద్దది. అక్కడి వాతావరణం అంతా మన భూగ్రహాన్నే పోలి ఉందట. సూర్యుని నుంచి మరీ దూరంగా కాకుండా, అలాగని మరీ దగ్గరగా కాకుండా సమదూరంలో ఉన్నందువల్ల అందులో నీటి ఆనవాళ్లు కూడా ఉండే అవకాశం ఉందని పరిశోధకులు అంచనా వేస్తున్నారు. నీటి ఆనవాళ్లు అనేకంటే అక్కడ ఒక పెద్ద సముద్రమే ఉన్నా ఆశ్చర్యం అవసరం లేదని వారు చెబుతున్నారు. ఇదే కనుక నిజమైతే ఆ గ్రహంపై నివసించడానికి ఛాన్సు ఉంటుందని ఊహిస్తున్నారు.

భూమికి దూరంగా ఉన్న ఈగ్రహాన్ని నాసాకి చెందిన కెప్లర్ స్పేస్ టెలిస్కోప్ సెంటర్ గుర్తించింది.



ఈ విషయాన్ని స్పేస్‌క్రాఫ్ట్‌లోని వ్యోమగాములు గుర్తించారు. ఈగ్రహానికి సూపర్ ఎర్త్ అన్న పేరును నిర్ణయించారు. సూపర్ ఎర్త్‌కి సంబంధించి సూచనలను గత నాలుగు సంవత్సరాలుగా కెప్లర్ స్పేస్‌క్రాఫ్ట్ అందిస్తూనే ఉంది. ఇప్పుడు కూడా ఈ గ్రహానికి సంబంధించిన మరింత సమాచారాన్ని ఈ సంవత్సరం కూడా అందించింది స్పేస్‌క్రాఫ్ట్.

ఇది మన సౌరవ్యవస్థకి దూరంలో ఉంది. భూమి నుంచి దీని దూరం 150 మిలియన్ల కాంతి సంవత్సరాలు. ఈ సూపర్ ఎర్త్ ప్లానెట్, ఇరవై మైళ్ల వ్యాసం కలిగి, భూమి కన్నా 1.5 రెట్లు పెద్దగా ఉంటుందని వారు చెబుతున్నారు. గ్రహంపై ఉష్ణోగ్రతలు 40 డిగ్రీల వరకు ఉండొచ్చు. భూమి సూర్యుని చుట్టూ ఎలా తిరుగుతుందో అలానే ఈగ్రహం కూడా సూర్యుని కన్నా చిన్నదైన నక్షత్రం చుట్టూ తిరుగుతుంది. సూపర్ ఎర్త్ ఉన్న నక్షత్ర మండలాన్ని కొద్ది క్షణాల పాటు శాస్త్రవేత్తలు పరిశీలించారు. కెనడాకి చెందిన మరికొన్ని శాటిలైట్స్ ద్వారా కూడా ఈ నక్షత్ర మండలాన్ని గమనించి, సూపర్ ఎర్త్ ఉందన్న విషయాన్ని కనుగొన్నారు. ఇంకా దీనిపై వివిధ రకాలైన పరిశోధనలు కొనసాగించాలని నాసాశాస్త్రవేత్తలు భావిస్తున్నారు.

## పుస్తక సమీక్ష



**భయం**

**ఓషో**

**అనువాదం:** భరత్

**ధర:** 180 రూపాయలు

**పేజీలు:** 120

**ప్రతులకు:** అన్ని ప్రముఖ పుస్తక దుకాణాలు

భయం నీడ లాంటిది. అది వెంటే వస్తుంది. భయపడితే భయపెడుతుంది. ఏ మనిషైనా జయించాల్సింది భయాన్నే. ప్రేమ ఆ భయాన్ని నాశనం చేస్తుందంటారు ఓషో. భయాన్ని అర్థం చేసుకోవడానికీ, దాన్ని ఎదిరించడానికీ దోహదంచేసే ఒక ఆయుధం లాంటి రచన ఈ పుస్తకం. ప్రతి ఒక్కరూ చదవాల్సిన రచన.

**దాలి**

**తెలంగాణ దీర్ఘకవిత**

**సుంకిరెడ్డి నారాయణరెడ్డి**

**ధర:** 30 రూపాయలు, **పేజీలు:** 66

**ప్రతులకు:** అన్ని పుస్తక కేంద్రాలు

ప్రత్యేక తెలంగాణ నినాదం బలంగా ముందుకు వస్తున్న సమయంలో వచ్చిన తొలి దీర్ఘ కవిత 'దాలి'. తెలంగాణ నిర్దిష్టతను, అస్తిత్వాన్ని బలంగా చెప్పిన దీర్ఘ కవిత ఇది. తెలంగాణకు చెందిన విభిన్న అంశాలు ఇందులో కవిత్వమై ఒలుకుతాయి.





**తావు**

**కవిత్వం**

**సుంకిరెడ్డి నారాయణరెడ్డి**

**ధర:** 40 రూపాయలు

**పేజీలు:** 112

**ప్రతులకు:** అన్ని పుస్తక కేంద్రాలు

నల్లగొండజిల్లా రైతుబిడ్డ, ఉస్మానియాలో ఉనికి చాటుకుని అంతర్మథనంతో అక్షర శిల్పిగా మారిన కవి సుంకిరెడ్డి నారాయణ రెడ్డి. 42 కవితల సంకలనమిది. పరాయీకరణలో ధ్వంసమౌతున్న తెలంగాణ ఉనికి, సంస్కృతి, తెలంగాణ భాష, ప్రతిష్ఠపట్ల ఆత్మఘోష ఆయన కవిత్వం.

**బొడ్రాయి**

**మేరెడ్డి యాదగిరిరెడ్డి కథలు**

**ధర:** 100 రూపాయలు,

**పేజీలు:** 132

ప్రతులకు అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలు

వ్యవసాయదారుడు, సాహిత్య వ్యవసాయ దారుడు యాదగిరిరెడ్డి. పదమూడు కథల సంపుటి ఇది.

ఇందులోనివన్నీ రైతు ఆత్మకథలే. వ్యవసాయ రంగంలో మార్పులు, ప్రపంచీకరణ ఆటుపోట్లు కథా వస్తువులుగా తీసుకుని రాసిన రైతు కథలివన్నీ.



## స్వీకారాలు

**ఉత్తర రామచరితము**

**ద్విపద కావ్యము**

**తోడిశెట్టి రాములు**

ధర: 300 రూపాయలు, **పేజీలు:** 458

ప్రతులకు: రచయిత, ఇంటి నెం.4-9-357/3/1, సంజయనగర్, ఆదిలాబాద్-01.

సెల్: 94407 52332

**అక్షర నివాళి**

కవితా సంకలనం

**సంపాదకులు:** బైస దేవదాస్

ధర: 100 రూపాయలు, **పేజీలు:** 62

**ప్రతులకు:** నేటి నిజం తెలుగు డైలీ, ఎస్సార్టీ-74, జవహర్‌నగర్, హైదరాబాద్-20

ఫోన్: 040-27662477

**కవిత -2015**

**కూర్పు విశ్వేశ్వరరావు**

ధర: 150 రూపాయలు, **పేజీలు:** 192

నవోదయ పబ్లిషర్స్, కార్ల్‌మార్క్స్‌రోడ్, విజయవాడ-2 ఫోన్: 0866-2573500

**స్వర్ణపుష్పాలు**

**బాలగేయ కథామాల**

**బాలబంధు అలపర్తి వెంకట సుబ్బారావు**

ధర: 35 రూపాయలు

**పేజీలు:** 64

**ప్రతులకు:** మంచి పుస్తకం, 12-13-439, వీధి నెం-1, తార్నాక, సికింద్రాబాద్-17

సెల్: 97907 46614.

**ఒక వేసవి రోజు**

**మాధురి పురందరే**

ధర: 50 రూపాయలు, **పేజీలు:** 86

**ప్రతులకు:** మంచి పుస్తకం, 12-13-439, వీధి నెం-1, తార్నాక, సికింద్రాబాద్-17.

సెల్: 97907 46614

**-లలితా త్రిపుర సుందరి**




# కెఫే ప్లెజెంట్ లవ్ కాఫీ

**హత్య అని నిరూపించే ఆధారాలు లేవు. దాదాపు ఆత్మహత్య అనే అనుకున్నాం. కానీ టేబుల్‌మీద రెండు గ్లాసులు ఉండటంతో హతునితో గదిలో మరోవ్యక్తి ఉన్నట్టు, అతడే డ్రింకులో నిద్రమాత్రలు కలిపి ఉంటాడనీ అనుమానించాల్సి వస్తోంది. వేలిముద్రల కోసం గ్లాసులు ల్యాబ్‌కి పంపా' గబగబా చెప్పాడు ఇన్‌స్పెక్టర్ విజయ్.**

విజయ్ చెప్పింది వింటూ గదిని పరిశీలిస్తున్నాడు డిటెక్టివ్ శరత్.

ప్రఖ్యాత కథారచయిత సుధీర్ ఓ కథా సమావేశంలో పాల్గొనేందుకు రెండురోజులు ముందుగానే హైదరాబాద్ వచ్చేశాడు. నిర్వాహకులకు చెప్పలేదు. నిర్వాహకుల ప్రకారం సుధీర్ రెండ్రోజుల తర్వాత రావాలి. అతనికోసం నిర్వాహకులు వేరే హోటల్‌గది బుక్‌చేశారు. అంటే, రహస్యంగా ఎవరినో కలిసేందుకే వచ్చినట్టున్నాడు! ఆలోచిస్తూ గదిలో దొరికిన వేలిముద్రలు, ఇతర ఆధారాలు సేకరించాడు శరత్.

•••

'బాస్... ఇదిగో, సుధీర్ ముద్రిత రచనలు, అముద్రిత రచనలు' అంటూ ఓ పుస్తకాల గుట్ట, పేపర్ల కట్టలు టేబుల్‌పై పెట్టాడు అసిస్టెంట్ రాము.

'సుధీర్ నేపథ్యం తెలుసుకున్నావా?' అడిగాడు శరత్.

'చాలా పేద కుటుంబం. కష్టపడి పైకివచ్చాడు. ఒక దశలో రోజువారి కూలీపని చేశాడు కూడా. అలా చేస్తూనే కథలు రాశాడు. పేరు వచ్చింది. పూర్తిస్థాయి రచయితగా ఎదిగి సినిమాల్లోనూ చేస్తున్నాడు'.

'పెళ్ళైందా?'

'అయింది. ఇద్దరు పిల్లలు'.

'వృత్తిపరమైన అసూయలు, స్పర్ధలూ....?'

'సినీరంగంలో పైకి వస్తున్నాడంటే స్పర్ధలూ, కుట్రలూ ఉంటాయిగానీ, హత్య చేసేంత స్పర్ధలు మాత్రం లేవు. ఎందుకంటే, ఇతడు రాసిన రెండు మూడు సినిమాలు ఫెయిలయ్యాయి. పైగా డైలాగులు ఉపన్యాసాల్లాగా ఉంటాయనే టాక్ వచ్చింది'.

తల ఊపాడు శరత్. ఇంతలో ఓ వ్యక్తి వచ్చి 'ఇన్‌స్పెక్టర్ విజయ్‌గారు మీకిది ఇమ్మన్నారు' అంటూ ఓ ఫైల్ ఇచ్చాడు.

తీసి చదవడం ఆరంభించాడు శరత్.

'ఉదయం ఎంతసేపటికీ తలుపు తెరవలేదు, ఫోను ఎత్తలేదు. హోటల్ వారికి అనుమానం వచ్చి తలుపులు తెరిచారు. మంచంపై పడి ఉన్నాడు సుధీర్. పోలీసులకు ఫోను చేశారు. ఇంతలోనే హోటల్‌వారు పక్క గదిలోనే ఉన్న డాక్టరు దంపతులను అభ్యర్థించి సుధీర్‌కి ప్రాథమిక పరీక్షలు చేయించారు. అతడు మరణించినట్టు చెప్పారు వాళ్ళు. ఇంతలో పోలీసులువచ్చి గదిని సీల్ చేశారు. గదిలో సుధీర్ వేలిముద్రలతో పాటు ప్రాథమిక పరీక్షలు చేసిన డాక్టర్ సౌమ్య దంపతుల వేలిముద్రలు, హోటల్ పనివారి వేలిముద్రలు దొరికాయి!

వేలిముద్రలు దొరికిన ప్రదేశాల జాబితా చూస్తున్న శరత్ కళ్ళు చిన్నవయ్యాయి.

'సుధీర్ వ్యక్తిగత జీవితం ఎలాంటిది?' రామూని అడిగాడు శరత్. రాము నవ్వాడు.

'మద్యం అలవాటు, అమ్మాయిల పిచ్చి కూడా ఉంది. అతడి అభిమానులైన అమ్మాయిలతో పిచ్చిగా ప్రవర్తించిన సంఘటనలున్నాయి. కొందరు లొంగారు. కొందరు చీదరించుకున్నారు. కానీ అమ్మాయి పరిచయమైతే మాత్రం ప్రయత్నం మానడు'.

ఆలోచిస్తూ తలవూపి సుధీర్ రచనలు చదవటం ఆరంభించాడు శరత్.

•••

శరత్ చెప్పింది విని నిట్టూర్చింది మానసిక శాస్త్రవేత్త మానవి. సుధీర్ రచనల్లో శరత్ అండర్లైన్ చేసిన పంక్తులు చదివింది. 'రచయిత మనస్తత్వం, వ్యక్తిత్వం అతడి రచనల్లో కనిపిస్తోంది. నువ్వు చెప్పింది కూడా విన్నాక, ఈ రచయిత తీవ్ర న్యూనతాభావంతో బాధపడుతున్నాడని పిస్తోంది. బాల్యంలో దారిద్ర్యంవల్ల వచ్చిన న్యూనతాభావాన్ని ఆధిక్య భావనగా మార్చుకుని ఎదుటివారిని తన రచనల్లో తక్కువచేసి నీచంగా చూపించడం ద్వారా సాధించుకుంటున్నాడనిపిస్తోంది. అంతేకాదు, హై సొసైటీ అమ్మాయిలంతా లైంగిక అసంతృప్తితో కొట్టుమిట్టాడుతూ, కనపడ్డ ప్రతివాడితో క్లీనర్‌తో, ఎలక్ట్రిక్ రిపేరర్‌తో, డ్రైవర్‌తో చివరికి అడుక్కునే బిచ్చగాడితోనూ సెక్స్ చేసినట్టు రచనల్లో వర్ణించటం వెనుక తనని నిరాకరించిన హైసొసైటీ వనితల పట్ల కసి, అక్కసు వెళ్లగక్కుతున్నట్టు కనిపిస్తోంది.

ఆమె మాటలు విని ఆలోచిస్తుండగా శరత్ ఫోన్ మోగింది.

'నిద్రమాత్రల డోసు అధికం కావడమే మరణానికి కారణమని పోస్ట్‌మార్టమ్ రిపోర్టులో తేలింది. కానీ అతడికి స్లీపింగ్ మాత్రల అలవాటు లేదు' ఆ వైపు నుంచి చెప్పారు.

ఆలోచిస్తూ లేచాడు శరత్.

•••

'రండి' శరత్‌ని ఆహ్వానించారు డాక్టరు సౌమ్య, ఆమె భర్త భాస్కర్.

'చాలా విషాదం. సుధీర్ నా అభిమాన రచయిత. అతడు మేమున్న పక్క గదిలోనే ఉన్నట్టు తెలిసింది. కానీ అతన్ని కలవాలనుకునేసరికే మరణించాడు' విషాదంగా చెప్పింది సౌమ్య.

'ఆ గదిలో గ్లాసులపై మీ వేలిముద్రలు దొరికాయి' అన్నాడు శరత్.

కాస్సేపు ఆలోచించి, 'అలాగా.. బహుశా, శవాన్ని పరిశీలించేందుకు వెళ్ళేటప్పుడు దారిలో ఉంటే పక్కకు జరిపి ఉంటాను. కిందపడి ఉంటే పైన పెట్టి ఉంటాను. వాటిని తాకిన గుర్తులేదు. కానీ అంతకుమించి మరో కారణం ఉండదు, ఏమంటారు?' అంటూ భర్తవైపు చూసింది.

'అవును. నీకు గుర్తుండి ఉండదు. నువ్వు మంచం దగ్గరకు వెళ్తూ కిందపడి ఉన్న గ్లాసు తీసి టేబుల్‌మీద పెట్టావు' అన్నాడు ఆమె భర్త భాస్కర్.

'అలాగా.. అంతా వేగంగా జరిగింది. ఏమైందో గుర్తు లేదు అందామె. ఆమెవైపు ఆలోచనగా చూస్తూ నీళ్లు తాగిన గ్లాసును టేబుల్‌పై పెట్టబోయి టేబుల్ లేనిచోట పెట్టాడు శరత్. గ్లాసు కార్పెట్‌పై మెత్తగా పడింది.

'సారీ' అని శరత్ గ్లాసు తీసేందుకు లేవబోయాడు.

'ఇట్స్ ఆల్‌రైట్' అంటూ ఆమె గ్లాసు తీసి టేబుల్‌పై పెట్టింది.

•••

'సుధీర్‌ని ఇంతకుముందు కలిశారా? పూర్వ పరిచయం ఉందా?' అడిగాడు శరత్.

'లేదు, మేం ప్రత్యక్షంగా కలవలేదుగానీ, నా ఇంటర్వ్యూ కావాలని ఓసారి ఫోను చేశాడు.

**అతడొక ప్రముఖ కథా రచయిత. ఆ నగరానికి వచ్చి హోటల్ గదిలో మరణించాడు. అది హత్య అని తెలుస్తోందిగానీ ఎలాంటి ఆధారాలూ లేవు. ఇన్‌స్పెక్టర్, డిటెక్టివ్ ఇద్దరూ ఘటనా స్థలానికి చేరుకున్నారు. ఒకనొక సమావేశంలో పాల్గొనేందుకు నిర్వాహకులకు చెప్పకుండా రెండు రోజుల ముందే అక్కడికి వచ్చేశాడతను. ఎందుకతను ముందుగా వచ్చాడు? వచ్చి ఏం చేశాడు? ఇంతకీ అతణ్ణి ఎవరు చంపినట్టు?**

సక్సెస్‌ఫుల్ లేడీ డాక్టర్‌గా నన్ను పరిచయం చేస్తానన్నాడు. నా హాస్పిటల్‌కి పబ్లిసిటీ వస్తుందని సరేనన్నాను. ఇంటర్వ్యూకి ఓ కాఫీ షాప్‌కి రమ్మన్నాడు. నేను నా ఆఫీసుకి రమ్మన్నాను. ఒకరినొకరు సన్నిహితంగా తెలుసుకుంటే ఇంటర్వ్యూ బాగా రావటమే కాదు తన రచనలో నన్ను హీరోయిన్‌గా చేసి రాస్తానన్నాడు. నాకు నచ్చలేదు. ఆఫీసుకు వచ్చి కలవమన్నాను. మళ్ళీ శవమైన తరువాతనే కలిశాను' అంది.

ఆమెని పరిశీలనగా చూస్తూ లేచాడు శరత్. అతని మనస్సులో తాను చదివిన సుధీర్ రచనలు మెదులుతున్నాయి. మహిళా డాక్టర్ పాత్రలు మెదులుతున్నాయి.



•••

వేలిముద్రలు దొరికిన స్థలాల ఫొటోలు పరిశీలించటం ఆరంభించాడు శరత్. ముఖ్యంగా గ్లాసుపై దొరికిన వేలిముద్రలు పరిశీలించాడు.

హోటల్ గదిలో గ్లాసులున్న టేబుల్, ద్వారం నుంచి మంచానికి వెళ్లే దారి పరిశీలించాడు.

అతడి ముఖం నవ్వుతో వెలిగిపోయింది.

తరువాత మహిళా డాక్టర్ పాత్రలున్న కథలు మరోసారి చదవటం ఆరంభించాడు.

ఇంతలో రాము నుంచి ఫోను వచ్చింది. 'బాస్.. కేఫే ప్లెజెంట్ లవ్ కాఫీ' చెప్పాడు రాము.

నవ్వుతూ లేచాడు శరత్.

•••

తలుపు తెరిచి శరత్, విజయ్‌లవైపు ప్రశ్నార్థకంగా చూసింది డాక్టర్ సౌమ్య.

'నేను డ్యూటీకి వెళ్ళే టైమైంది' అంది.

'అయిదు నిమిషాలు చాలు' అన్నాడు శరత్.

ఆమె లోపలకు దారి తీసింది. టేబుల్ దగ్గర కూర్చుని పేపర్ చూస్తున్న ఆమె భర్త భాస్కర్ వాళ్ళవైపు అనుమానంగా చూశాడు.

'మంచి నీళ్లిస్తారా?' అడిగాడు శరత్.

ఆమె టేబుల్‌మీద ఉన్న గ్లాసులు వాళ్ళకి ఇచ్చి, తనూ ఓ గ్లాసు తీసుకుని తాగటం ఆరంభించింది.

ఆమె గ్లాసును పట్టుకున్న విధానం చూసిన శరత్ అడిగాడు. 'సుధీర్‌ని ఎందుకు హత్య చేశారు? మీతో అనుచితంగా ప్రవర్తించినందుకా? మీ గురించి అసభ్యంగా కథల్లో రాసినందుకా?'

ఆమె చేతిలో గ్లాసు కింద పడింది. కార్పెట్ నీళ్ళతో తడిసింది.

'వాట్ డూ యూ మీన్?' కోపంగా లేచాడు ఆమె భర్త.

'మిమ్మల్ని అతడు పిలిచాడు. మీరు కెఫీ ప్లెజెంట్ కాఫీలో అతన్ని కలిశారు. మీ బాధలన్నీ వెళ్లబోసుకున్నారు. మీ భర్త ఊళ్లోలేడు. మీ ఇంటికి తీసుకువచ్చారు. మీ పిల్లవాడికి నిద్రమాత్ర ఇచ్చి పడుకోబెట్టి, అతన్ని బెడ్రూమ్‌లోకి తీసుకెళ్ళారు. మీలో అణగి ఉన్న లైంగిక అసంతృప్తిని తీర్చుకునేందుకు, అతడిని బెడ్‌రూమ్‌లోకి లాగి అతడిపై విరుచుకుపడి విజృంభించారు. ఏళ్ళ తరబడి మీలో దాగి వున్న కసి తీరేదాకా అతడితో..'

శరత్ చెంప ఛెళ్లుమంది. 'స్టాపిట్' అరిచిందామె కోపంతో ఊగిపోతూ. 'హైక్లాస్ సొసైటీతో ఏ మాత్రం పరిచయం లేకున్నా తన ఊహల ప్రకారం వాళ్ళని నీచంగా ఊహించి రాసి సంతృప్తి పడే క్షుద్రుల రాతల్ని నమ్మే నీలాంటి వాళ్ళంటే నాకు అసహ్యం. వాడు పరిచయం చేసుకుందాం అంటే వెళ్ళాను. కాఫీ తాగుదాం అంటే కాఫీయేనా డ్రింకు తాగి బెడ్‌రూమ్‌కి వెళ్దామా? మనం సన్నిహితం కావాలి కదా! అన్నాడు. తిట్టి వచ్చేశాను. ఇదిగో వాడి కుళ్ళు ఊహలన్నీ రాసేశాడు. నేను వాణ్ణి కలవటానికి వెళ్తున్నట్టు నా భర్తకి చెప్పలేదు. మీలాగే నా భర్త అది చదివి నిజం అనుకున్నాడు. మా ఇద్దరి మధ్య గొడవలు మొదలయ్యాయి. నా భర్తకు నిజం చెప్పమంటే, 'అనుమానం భర్తతో ఏం కలిసి బ్రతుకుతావు' నా కథని నిజంచేద్దాం రా' అన్నాడు వెధవ. అందుకని కాన్ఫరెన్స్‌కి వెళ్తున్నాను రమ్మన్నాను. రాత్రికి కలుద్దామన్నాను. పక్కగదే కదా, వెళ్ళి డ్రింకులో నిద్రమాత్రలు కలిపాను. చచ్చాడు కుళ్ళు వెధవ. అమ్మాయిలంటే 'అందుకే' అనుకుంటున్నాడు. మా ఆయనకీ చెప్పాను. ఇంకోసారి కుళ్ళు వెధవల రాతలునమ్మి నన్ను అనుమానిస్తే ఆయన గతీ అంతే' కోపంగా చెప్పింది.

•••

'అవునూ... ఏం ఆధారాలు లేకుండా ఆమె హంతకురాలని ఎలా ఊహించారు బాస్' అడిగాడు రాము.

'సింపుల్. కథలు ఒక ఆధారాన్నిస్తే గ్లాసు మీద వేలిముద్రలు మరో ఆధారాన్ని ఇచ్చాయి. మనం తాగేటప్పుడు గ్లాసును ఓ రకంగా పట్టుకుంటాం. అందించేటపుడు మరో రకంగా పట్టుకుంటాం. కిందపడితే తీసేటప్పుడు పట్టుకునే స్థలం వేరే. ఆమె నీళ్ళు తాగే విధానం గమనించాను. గ్లాసుపై ఆమె వేలిముద్రలు దొరికిన స్థలం చూశాను. అది కిందపడితే తీసి పైన పెట్టే పట్టు కాదు. కూర్చుని స్థిరంగా తాగే పట్టు. అదీగాక, గది తలుపు నుంచి బెడ్‌కు ఉన్న దారిలో టేబుల్ లేదు. గ్లాసు లేదు. అవి మరోవైపు ఉన్నాయి' చెప్పాడు శరత్.

-కస్తూరి మురళీకృష్ణ,
సెల్: 98496 17392




**"పోట్లగిత్తలా అలా అందరిమీదా ఎగిరి పడకపోతే ప్రశాంతంగా ఉండి అందరి చేతా మంచి కుర్రాడివని అనిపించుకోవచ్చు గదా! ఏం తోచకపోతే గుడికో, పార్క్‌కో వెళ్ళొచ్చు గదా!" అంది తులశమ్మ మనవడికి కాఫీ కప్పు అందించి పక్కన కూర్చుంటూ.**

**"గుడికి ఎందుకు?" అడిగాడు రాఘవ.**

**"మన వీధిలోనే అమ్మవారి గుడి ఉంది. అమ్మవారి అనుగ్రహం ఉంటే నీకు ముద్దుల మూటలు కట్టే మగువను భార్యగా అనుగ్రహిస్తుంది" అంది బామ్మ.**

"నువ్వే నాకు కనిపించే ప్రత్యక్ష దేవతవు. మా అమ్మ నాన్నలు చిన్నప్పుడే చనిపోతే నువ్వే నన్ను పెంచావు. చదివించాక సాఫ్ట్‌వేర్ ఇంజ నీరునయ్యాను. నీ దయవల్ల ఐదంకెల జీతం వస్తున్నది. అంతకంటే నాకింకేం కావాలి? పచ్చని చెట్ల పూలలో, పసిపిల్లల్లో దేవుడు కనిపిస్తాడు నాకు. మళ్ళీ గుడికి వెళ్ళి దర్శనంకోసం క్యూలో నిలబడటం ఎందుకు?"

"అమ్మవారి ఆలయం చుట్టూ విశాలమైన ఆవరణ ఉందిరా! అక్కడ కూర్చున్నావంటే మనస్సు ప్రశాంతంగా ఉంటుందిరా పిచ్చి సన్నాసి! చక్కని చుక్కలు గుడికి వస్తారు. నీకు నచ్చిన అమ్మాయి తారసపడుతుంది" అంది బామ్మ నవ్వుతూ.

"నీ పక్కన కూర్చుంటేనే నాకు మనస్సు ప్రశాంతంగా ఉంటుందే బామ్మ! మన రోడ్డులో ఓ స్కూలు ఉంది. ఇరుకిరుకు గదుల్లో పిల్లలు కూర్చుని చదువుకుంటూ ఉంటారు. గాలి వెలుతురు రాదు ఆ గదుల్లోకి. వాళ్ళు ఆడుకోవడానికి ఆటస్థలం ఉండదు. మరి దేవాలయాల చుట్టూ అంత ఆవరణ ఎందుకే బామ్మా?"

"నీతో వాదించలేనురా బాబూ! నీకు ఇష్టం లేకపోతే గుడికి వెళ్ళొద్దు గాని కాఫీ తాగేసి కప్పు ఇచ్చెయ్, వంటగదిలో నాకు పని ఉంది" అందామె.

"నీతో పది నిమిషాలు మాట్లాడితే మెదడులో పేరుకుపోయిన ఆఫీసు ఒత్తిడి అంతా క్షణాల్లో కరిగిపోతుంది. ఫొటోల్లో చూడటంతప్పితే మా అమ్మ ఎలా ఉంటుందో నాకు తెలియదు. నువ్వే మా అమ్మవి, వరాలు ఇచ్చే దేవతవి" అన్నాడతను బామ్మ పాదాలు నిమురుతూ.

"పిచ్చి నాగన్నా! నేను దేవతను ఎందుకవు తాను. నా కన్న కొడుక్కి పుట్టినవాడివిరా నువ్వు. నీకు ఊహ వచ్చేలోపే మీ అమ్మానాన్నలు చని పోయారు. మనవణ్ణి పెంచడం నా బాధ్యత. అందులో పెద్ద విశేషమేముంది? అది సరేగాని పొద్దున్నే శివరావుగారి మీద ఎగిరిపడ్డావట. ఆ దూకుడే మంచిది కాదని చెప్పేది ఎప్పుడూ నీకు".

ఉదయం జరిగిన సంఘటన గుర్తుకు వచ్చింది రాఘవకు.

ఇంటిముందు రకరకాల పూలమొక్కలు పెంచాడు తను. కొన్ని మొక్కలు ప్రహరీ గోడ దగ్గర ఉన్నాయి. రంగురంగుల పూలతో మొక్కలు తలలు ఊపుతూ ఉంటే మనస్సు పులకరించిపోతూ ఉంటుంది.

తెల్లవారుజామున ప్లాస్టిక్ బ్యాగులతో బయ ల్దేరుతారు కాలనీలోని వాళ్ళు. వాళ్ళందరికీ కాల నీలో పెద్ద పెద్ద బిల్డింగులున్నాయి. ఇంటిముందు ఖాళీస్థలం వదలకుండా రోడ్డు మీదకు భవం తులు కట్టేశారు. పూల అంగడిలో డబ్బులిచ్చి పూలు కొనరు. కాలనీలో పూలమొక్కలు పెంచే వాళ్ళ ఇళ్లముందు వాళ్ళు నిద్ర లేవకముందే వచ్చేసి పూలు తెంపుకుపోతూ ఉంటారు. ఇంటి

ఓనరు నిద్రలేచి ఇంట్లోంచి బైటకువచ్చి చూస్తే ఒక్క పువ్వు కూడా కనిపించదు.

శివరావు చేతిలో ఉన్న ప్లాస్టిక్ బ్యాగ్‌నిండా పూలున్నాయి.

"ఎందుకండీ అన్ని పూలు కోశారు?" అడిగాడు తను.

"దేవుడి పూజకు బాబూ."

"దేవుడు అన్నిచోట్లా ఉన్నాడని చెబుతారు గదా! పూల మొక్కల్లో కూడా దేవుడు ఉన్నాడు... మొక్కలకు, చెట్లకు నమస్కరిస్తే దేవుడు కరుణిస్తాడు గదా!"

"దేవాలయాల్లో, పూజగదుల్లో ఉన్న పవిత్రత బైట అన్ని ప్రాంతాల్లో ఉండదు. మహానుభావులు, మునులు ధ్యానం చేస్తూ దేవుణ్ణి దర్శించగలుగుతారు. సామాన్యులకు అన్నిచోట్లా భగవంతుడు కనిపించడు".

"మీ పూజగదిలో మీకు దేవుడు కనిపించాడా?"

తన మాటలు ఆయనకు నచ్చినట్టులేదు.

"ఎటువంటి ఆటంకాలు కల్పించినా ఏకాగ్రత కోల్పోకుండా ఋషులు దేవుణ్ణి పూజిస్తారు, కళ్ళు మూసుకుని ధ్యానంలో మునిగిపోతారు.. నాబోటి సామాన్య భక్తుడు పుష్పం, ఫలం, తోయం సమర్పించి భగవంతుణ్ణి పూజిస్తాడు" అన్నాడు ఆయన.

"నిర్మలమైన భక్తితో రెండు మూడు పుష్పాలు సమర్పిస్తే చాలు. పూలన్నీ ఎందుకు కోస్తున్నారు? చెట్లకు పూలు ఉంటే కళగా కనిపిస్తాయి. పూలలో ఉండే మకరందం కోసం సీతాకోకచిలుకలు, తేనెటీగలు, హమ్మింగ్ బర్డ్స్ వస్తాయి ఉదయాన్నే! మీరంతా పూలు కోసుకుని వెళ్ళిపోతే పూలు కన్పించక అవి బిక్కుబిక్కు మంటాయి. ఆకలితో అలమటిస్తాయి" చెప్పుకుపోయాడు తను.

ఆయనకు కోపం వచ్చింది.

"ఎందుకు బాబూ అంత గింజుకుంటావు? నాలుగు పూలు కోసుకుంటే నీ ఆస్తి అంతా తరిగిపోయినట్టు బాధపడతావ్. మీ బామ్మగారు పూలు కోసుకుంటే అభ్యంతరం పెట్టదు. 'మా పూలతో మీరు పూజ చేస్తే, మీకు వచ్చే పుణ్యంలో మాక్కూడా భాగం వస్తుంది' అంటుంది ఆమె.

## పద్ధతిగా కనిపించిందట!



ఈ మాట మరే హీరోయిన్ నోటి వెంట వచ్చినా నమ్మొచ్చేమో కానీ, ముదివాడ తేజస్విని అదేనండీ ఐస్‌క్రీం పాప నోటి నుంచి వస్తే మాత్రం నమ్మడం కష్టం! ఎక్స్‌పోజింగ్‌కూ, లిప్ లాక్‌లకూ అభ్యంతరాలు పెట్టకుండా ఎలా కావాలంటే అలా చేసే తేజస్విని తన తాజా సినిమా 'నాన్న నేనూ నా బాయ్ ఫ్రెండ్స్' సినిమాలో ఐటెంసాంగ్‌ని చాలా పద్ధతిగా చేసిందట! ఐటెంసాంగ్ అంటేనే అందాల ఆరబోతగా ఉంటుంది. అలాంటిది పద్ధతిగా ఎలా కనిపిస్తారు? అనే అనుమానం చాలామంది వ్యక్తం చేస్తున్నారు కానీ, సినిమా చూస్తే తప్ప ఈ పద్ధతి ఏంటో తెలియదు అంటున్నారు.

**మిమ్మల్ని ఎక్కడో చూశాను అందామె. ఇక్కడికి రావడం ఇదే మొదటిసారి, మిమ్మల్ని చూడటం కూడా ఇప్పుడే అన్నాడతను. కానీ ఆమె ఒప్పుకోలేదు. బాగా జ్ఞాపకం చేసుకుంది. మీరు ఎప్పుడైనా అమెరికా వచ్చారా? మిమ్మల్ని న్యూజెర్సీలో చూసినట్టు గుర్తు అందామె. లేదు, లేదు, ఆ ఛాన్సేలేదు. అసలు నాకు వీసా కాదుకదా, పాస్‌పోర్టు కూడా లేదు అన్నాడతను. ఆమె మళ్ళీ సందిగ్ధంలో పడింది! మళ్ళీ గుర్తుచేసుకుంది. అసలు కథేంటి?**

నువ్వు పూలు కొయ్యవద్దంటే మీ ఇంటివైపు రానులే" అనేసి వెళ్ళిపోయాడు శివరావు.

"చిన్న చిన్న విషయాలు పట్టించుకోకూడదు. ఎవరితోనూ ఘర్షణ పడకూడదు! మనకు నచ్చని పనులు ఇతరులు చేస్తున్నా ప్రతిదానికీ స్పందించకూడదు. సర్దుకుపోతూ ఉండాలి! అప్పుడే జీవితం ఆనందంగా గడిచిపోతుంది. మనం పుట్టక ముందు కొన్ని వందలకోట్ల సంవత్సరాలు గడిచిపోయాయి. మనం పోయిన తరువాత కూడా వందలకోట్ల సంవత్సరాలు గిర్రున తిరిగిపోతూనే ఉంటాయి! మూడు నాళ్ళ ముచ్చటే ఈ బ్రతుకు! మొన్నటిదాకా చదువు చదువన్నావ్, బి.టెక్ పాసయ్యావు. ఉద్యోగం కూడా వచ్చేసింది. చక్కని చుక్కను చూసుకుని మెడలో మూడుముళ్ళూ వెయ్యి! నలుగురు పిల్లలు పుడితే నువ్వూ పూల సజ్జ పట్టుకుని బయల్దేరతావ్!" అంది తులశమ్మ మనవడితో.

"ఎప్పుడూ నీకు నా పెళ్ళి గోలే!" అన్నాడు బామ్మ బుగ్గలు పట్టుకుని లాగి.

•••

"మీ మావయ్య కబురు చేశాడురా! షష్ఠి పూర్తి చేసుకుంటున్నాడట. రమ్మని చెప్పాడు. ఎప్పుడు వెళ్దాం హైదరాబాద్?"

"మావయ్య ఎవరు?" బామ్మని అడిగాడు రాఘవ.

"అదేరా కనకయ్యగారు... నీ మేనత్త మొగుడు"

చిరాకుపడ్డాడు రాఘవ.

ఎప్పుడో చిన్నప్పుడు చూశాడు కనకయ్య మావయ్యను. మేనత్త చనిపోయినప్పుడు తనను హైదరాబాద్ తీసుకువెళ్ళింది బామ్మ. కూతురు చనిపోయిన ఆర్నెల్లకే అల్లుడు మళ్ళీ పెళ్లి చేసుకోవడం నచ్చలేదు బామ్మకి. కూతురు స్థానంలో వచ్చిన సుభద్ర ప్రవర్తన నచ్చకపోవడంతో రాకపోకలు తగ్గిపోయాయి. ఉత్తరంముక్క రాయడం గానీ ఫోన్లో మాట్లాడుకోవడంగానీ ఏమీలేవు రెండు కుటుంబాల మధ్య.

ఆ తర్వాత ఇన్నాళ్ళకి మళ్ళీ హైదరాబాద్ రమ్మని వాళ్ళ దగ్గర నుంచి కబురు రావడం ఇదే! అందుకే రాఘవకు చిరాకు వచ్చింది.

"ఆయన రమ్మనగానే మనం పరిగెత్తాలా? మా అమ్మానాన్నలు చనిపోయినప్పుడు రాలేదని బాధపడుతూ ఉండేదానివి. మనం వాళ్ళింటికి వెళ్ళడం ఎందుకు?"

"అవన్నీ ఎప్పుడో పాతికేళ్ల కిందటి సంగతులు. మళ్ళీ మనల్ని చూడాలని ఉందేమో మావయ్యకు. పాత సంగతులు మర్చిపోయి ఓసారి వెళ్ళి చూసి వద్దాం! అమర్యాదగా మాట్లాడితే తిరిగొచ్చేద్దాం!"

"నాకు సెలవులు దొరకవు"

"నేను ఒక్కదాన్నీ వెళ్ళలేనురా బాబూ! నాలుగు రోజులు సెలవు పెట్టు."

బామ్మ మాట కాదనలేకపోయాడు.

గోదావరి ఎక్స్‌ప్రెస్‌లో హైదరాబాద్ వెళ్ళారు బామ్మా మనవడూ ఇద్దరూ.

అత్తగారిని చూసి కనకయ్య ఎంతో సంతోషపడ్డాడు. కూతురులేని ఇంట్లోకి అడుగుపెడుతూ ఉంటే కళ్ళు చెమర్చాయి తులశమ్మకు.

"రండి... రండి... మీ గురించి మావారు ఎప్పుడూ చెబుతూనే ఉంటారు" సాదరంగా ఆహ్వానిస్తూ అంది కనకయ్య రెండో భార్య సుభద్ర.

కనకయ్యకు ఎదురుగా ఉన్న కుర్చీలో కూర్చున్న అరవయ్యేళ్లున్న పెద్దాయన ఒకరు ఏవో కాగితాలు తిరగేస్తూ కనిపించాడు.

కళ్ళజోడు సవరించుకుని "జాతకాలు కుదర్లేదండి. రెండు సంబంధాలు మీ అమ్మాయికి కుద

## కవిత

నిట్ట నిలువునా తడుస్తున్న
ఆ పావురాల రెక్కలపై
జారుతున్న వాన చినుకులన్నీ
ఐదో అంతస్తు డాబా గోడపై నుంచి
జాలువారుతున్న

### వానలో పావురం చూపు

ధారలన్నీ నేల మాళిగలోకి!
విసుగుతో ఒక పావురం
ఆ పంక్తిలోంచి
రివ్వున ఆకాశంలోకి ఎగురుతూ
నగరాన్ని వీక్షిస్తూ
తిన్నగా మలక్‌పేట్
రేస్‌కోర్స్ షెల్టర్‌పై వాలింది
రేసుగుర్రాలన్నీ కొట్టాలలో
నిలువు నిద్రను చాలించి
జూలు విదిలిస్తున్నాయి,
సెప్టెంబర్ వర్షపాతం
తాతలనాటి ఇళ్ళపై మృత్యుఘాతం
ఆ నాటి పొలాలని-
చెరువులనీ మింగిన
రియల్ ఎస్టేట్ అక్రమ నిర్మాణాల చుట్టూ
వరదనీటి ఎదురుదాడి,
తన పాత ఉనికి కోసం
జలప్రళయ ఘోష!!

-నిఖిలేశ్వర్
సెల్:91778 81201

రవు. అబ్బాయిల జాతకాలు, మీ అమ్మాయి జాతకం కుదరడం లేదు, మరో సంబంధం చూస్తే మంచిది" అన్నాడు సిద్ధాంతి.

"ఈ రోజుల్లో కూడా జాతకాలు చూసుకునే పెళ్లిళ్లు చేస్తున్నారా?" అడిగాడు రాఘవ.

"ఇప్పుడు జాతకాల పిచ్చి ఇంకా ఎక్కువ య్యిందయ్యా బాబూ! అమ్మాయి తరపు వాళ్ళం కదా, మన జాగ్రత్తలో మనం ఉండాలి!" అన్నాడు కనకయ్య.

"జాతకాలుచూసి, మంచి ముహూర్తంచూసి చేసిన పెళ్లిళ్లు సవ్యంగా ఉంటున్నాయా? మా ఎదురింటి పెద్దాయన ముగ్గురు అబ్బాయిలకు జాతకాలు చూసి పెళ్లిళ్లు చేశాడు. ముగ్గురూ విడాకులు తీసుకున్నారు" అన్నాడు రాఘవ.

"జాతకంలో తప్పు ఉండదు, వాస్తు దోషం ఉండి ఉంటుంది మీ ఎదురింటికి. వాస్తుదోషం తొలగితేగానీ వాళ్ళ సంసారం సవ్యంగా సాగదు" అన్నాడు సిద్ధాంతి.

"ఆ ఇల్లు వాళ్ళది కాదండీ, అద్దె ఇంట్లో ఉంటున్నారు."

"దోషం ఉన్న ఇంట్లో అద్దెకు ఉన్నా ఇబ్బం దులు తప్పవు."

వాళ్ళ వాదనలో జోక్యం చేసుకున్నాడు కనకయ్య.

"నమ్మకం ఉన్నవాళ్ళకే వాస్తు, జాతకం వర్తించేది. నమ్మకం లేకపోతే ఏ చిక్కూ లేదు! ఇతర మతాలవాళ్ళు ఈ వాస్తులు, జాతకాలు చూసుకోవడం లేదు కదా! ఒకరినొకరు అర్థం చేసుకుంటే దాంపత్యం సజావుగా సాగిపోతుంది, లేకపోతే చిక్కులు తప్పవు సిద్ధాంతిగారూ, మళ్ళీ మరోసారి మనం కలుద్దాం!" అన్నాడు కనకయ్య.

సిద్ధాంతి వెళ్ళిపోయాడు.

మేడమీద గదిలోంచి మెట్లుదిగి హాల్లోకి వచ్చింది హరిత.

"మా అమ్మాయి హరిత. యు.యస్‌లో సాఫ్ట్ వేర్ ఇంజనీర్‌గా పనిచేస్తూ ఉంది. నెలరోజులు ఇక్కడే ఉంటుంది. మంచి సంబంధం కుదిరితే పెళ్లి చేసెయ్యాలనుకుంటున్నాను" అన్నాడాయన కూతుర్ని పరిచయం చేస్తూ.

ఆ అబ్బాయి ఎవరన్నట్లు తండ్రివైపు చూసింది.

"ఈ అబ్బాయి మన దగ్గరి బంధువుల కుర్రాడు. పేరు రాఘవ. బి.టెక్ చేసి ఉద్యోగం చేస్తున్నాడు."

అతనికేసి తదేకంగా చూసింది హరిత.

"మిమ్మల్ని ఎక్కడో చూసినట్టుందే!" అంది ఆ అమ్మాయి.

"ఎక్కడ చూశారు? నేనుండేది విశాఖపట్నంలో. ఆంధ్రా యూనివర్సిటీలో చదివాను. ఉద్యోగం అక్కడే! హైదరాబాద్ రావడం ఇదే మొదటి సారి" తన గురించి చెప్పుకుపోయాడు రాఘవ.

"ఎప్పుడన్నా అమెరికా వచ్చారా? న్యూజెర్సీలో మిమ్మల్ని చూసినట్టు అన్పిస్తూ ఉంది"

"నాకు పాస్‌పోర్ట్, వీసాలే లేవు. ఇండియా తప్పితే మరే దేశంలోనూ కాలు పెట్టలేదు నేను."

"లేదు... లేదు మిమ్మల్ని ఇంతకుముందు ఒక సారి చూశాను. విశాఖపట్నం రెండు మూడుసార్లు వచ్చాను. అక్కడ మిమ్మల్ని చూసి ఉంటాను" అందామె.

భోజనాలయ్యాక తన గదికి రాఘవను తీసుకెళ్ళింది హరిత. బుక్స్‌ర్యాక్‌లో పుస్తకాలు నీటుగా సర్దివున్నాయి. ఓ పక్కన బుద్ధుడి బొమ్మ కన్పించింది. గదిలో ఓ పక్కన క్యాండిల్ స్టాండ్ కన్పించింది. కిటికీలకు ఆకుపచ్చని కర్టెన్స్, ఉడెన్ యూనిట్‌పై ఫ్లవర్‌వాజ్.. అన్నీ కళాత్మకంగా అమర్చి ఉన్నాయి.

ఆమెకు అతన్ని చూస్తుంటే ఇంతకుముందే బాగా పరిచయం ఉన్నట్లు అన్పిస్తూ ఉంది. అత నేమో తనని ఎప్పుడూ చూడలేదు అంటున్నాడు. ఏమిటి ఈ విచిత్రం?

అతన్ని తను అసలు ఎప్పుడు చూసింది? ఎక్కడ చూసింది?

"అమెరికాలో ఉద్యోగం చేసే ఉద్దేశం ఉందా మీకు?" అడిగిందతన్ని.

"చదువుకున్నవాళ్ళంతా అమెరికా, ఆస్ట్రేలియా పరిగెత్తితే ఎలా? మన దేశంలో ఉండి మన తెలి వితేటలు మనవాళ్ళకు ఉపయోగపడటానికి కొంతమందైనా ఇక్కడ ఉండాలి గదా!" నవ్వుతూ సమాధానం ఇచ్చాడు రాఘవ.

సాయంత్రం మల్లెపందిరి దగ్గర కన్పించింది హరిత.

"అమెరికా వెళ్ళినా మల్లెలమీద మమకారం తగ్గినట్లు లేదే?" అన్నాడు ఆమె పక్కన నిలబడి.

"పూలంటే మక్కువ చూపని మగువ ఉంటుందా?"

'పూలన్నీ మీ ఆడవాళ్ళు కోసుకుని తలలో తురుముకుంటే పూలమొక్కలు, సీతాకోకచిలు కలు బాధపడవూ!' అందామనుకున్నాడు.

ఆమెతో వాదనకు దిగకపోవడం ఆశ్చర్యాన్ని కలిగించిందతనికి.

"మళ్ళీ అమెరికా వెళ్ళిపోతారా?" అడిగాడతను.



"ఏమిటి? మీ మొహంలో ఏదో దిగులు కని పిస్తోంది. మీకు అభ్యంతరం లేకపోతే అదేమిటో చెప్పండి" అడిగింది హరిత.

"అయామ్ వెరీ హ్యాపీ! నాకేం దిగులు?" తొట్రుపాటు పడుతూ అన్నాడు. మరింత నిశి తంగా సూటిగా అతని మొహంలోకి చూసింది.

"ఆ! ఇప్పుడు గుర్తుకు వచ్చింది. మిమ్మల్ని రెండేళ్ళ కిందట చూశాను. మనిద్దరం పక్కప క్కనే కూర్చున్నాం" అందామె.

ఆమెని చూడటం వాళ్ళింట్లోనే. బయట ఎక్కడా ఆమెను కలుసుకోలేదు తను. అంతకు ముందు కలిశామని ఆమె చెబుతోందిగానీ ఎప్పుడు కలి శామో గుర్తుకు రాలేదు.

"ఎప్పుడు కలిశాం?" ఆత్రుతగా అడిగాడు.

"విశాఖపట్నం ఆర్.కె బీచ్‌లో కలిశాం"

మనోఫలకంపై మెరిసిన దృశ్యాన్ని వివరిం చడం మొదలుపెట్టింది.

సాయంత్రం పూట...

సముద్ర కెరటాలు మరింత ఉత్సాహంతో ఎగిసిపడుతున్నాయి.

ఎటుచూసినా సముద్రం ఒడ్డున గంతులు వేస్తూ అల్లరి చేస్తున్న పిల్లలు, ఆడవాళ్ళు, మగ వాళ్ళు గుంపులు గుంపులుగా కనిపించారు. అన్నీ మర్చిపోయి సముద్రంకేసి చూస్తూ మైమరిచి పోతూ ఉన్నారు.

కాలు బెణికినట్లుంది. వెంటనే లేవలేకపోయింది. అతని పక్కనే కూర్చుంది.

సముద్రగాలికి చెలరేగిపోతున్న చీర కొంగును మాటిమాటికీ సర్దుకుంటూ అతనివైపు చూస్తూనే ఉంది. అతనిలో ఏదో ఆకర్షణ తన గుండెను పట్టేస్తూ ఉంది.

అతను ఎవరో తనకు తెలియదు. మళ్ళీ అతన్ని కలిసే అవకాశం ఉండకపోవచ్చు! పొర పాటున అతను తనను కలిస్తే తప్పకుండా అత నితో పరిచయం పెంచుకుంటుంది. ప్రేమలో పడి పోతుంది. పెళ్లంటూ చేసుకుంటే అతన్నే చేసు కుంటుంది అనుకుంది మనస్సులో.

"బీచ్‌లో కనిపించింది మీరే! ఇసుకలో నడుస్తూ మీ ముందు పడిపోయాను. మీరు నన్ను లేవ దీసి కూర్చోబెట్టి వాటర్ బాటిల్ ఇచ్చారు. గుర్తుకు వచ్చిందా మీకు ఆ సంఘటన! తొలి చూపులోనే మీరు నన్ను ఆకట్టుకున్నారు. ఆ దృశ్యం ఇప్పటికీ నా కళ్ళెదుట కదలాడుతూనే ఉంది" అందామె.

బీచ్‌లో ఆమె చూసింది ఎవరినో! తనను మాత్రం కాదు!

రెండు నిమిషాలు మౌనంగా ఉండిపోయాడు.

"నేను చెప్పింది కరెక్టే కదూ! ఆ రోజు నాకు కన్పించింది మీరే కదూ!" రెట్టించి అడిగింది.

ఆలోచనలో పడిపోయాడు రాఘవ.

ఏ విషయమైనా కుండబద్దలు కొట్టినట్లు

ఆమె కళ్ళు మెరుస్తూ ఉండటం గమనించాడు.

ఏదో సాధించానన్న విజయగర్వంతో మల్లె పందిరి దగ్గరనుంచి ఇంట్లోకి నడిచింది హరిత. తన వెనుకే నడుస్తున్న అతన్ని చూడగానే నవ్వు ఆపుకోలేకపోయింది. ఆమె వెనుక నడవడం అప్పుడే కాదు, పెళ్లి అయ్యాక గుడికికూడా ఆమె వెనకే నడిచివెళ్లాడు, అతడికి ఆ అలవాటు లేక పోయినా!

*సెల్: 99085 87876*



## స్నేహం కోసం డబ్బు వద్దనుకుంది

తమన్నా డబ్బు వ్యవహారాల్లో చాలా కచ్చితంగా ఉంటుంది. ఆఖరికి సోషల్ మీడియాలో ప్రచారం చేయాలన్నా ఇంతని వసూలు చేస్తుంది. అలాంటి తమన్నా, రణవీర్ కోసం సోషల్ మీడియాలో ఫ్రీగా ప్రచారం చేసింది. ఎలాగంటారా... 'బేఫికర్' సినిమాని ఎప్పుడెప్పుడు చూస్తానా? అన్నంత ఆత్రుతగా ఉందని, టికెట్లు కూడా ముందుగానే కొనేసుకున్నానని అంటూ మొన్న ఓ ఫోటోను సోషల్ మీడియాలో పోస్ట్ చేసింది. తమ అభిమాన హీరోయిన్నే ఆ సినిమా కోసం అంత ఆత్రుతగా ఉందంటే సినిమా ఎంత బాగుందో అని ఆమె అభిమానులు మరి కొందరు ట్విటర్‌లో స్పందించారు. ఈ విధంగా 'బేఫికర్'కు తమన్నా సాక్షిగా సోషల్ మీడియాలో బాగానే ప్రచారం దక్కిందట! ఇంతకీ బయ టకు తెలియని విషయం ఏమిటంటే ఈ ప్రచారానికి లోపాయికారిగా ఒప్పం దాలు జరిగిపోయి ఉంటాయి అంటున్నారు నెట్‌జనులు.

ఎర్త్ ప్లానెట్ మీద మూడొంతులు నీళ్లే! భూమి మీద కన్పించే జీవరాసుల్లాగే సముద్ర గర్భంలో కూడా రంగురంగుల ప్రపంచం ఉంది. రకరకాల జీవరాసులు ఎన్నో ఉన్నాయి సముద్రంలో.

ఆలోచిస్తూ ఇసుకలో నడుస్తూ ఉంది. జన సంచారం తక్కువగా ఉన్న ప్రాంతం దాకా వెళ్ళింది. ఓ చోట అడుగులు తడబడి కూలబడి పోయింది, ఓ అబ్బాయి ముందు.

ఆ అబ్బాయి తన భుజాలు పట్టుకుని లేపాడు.

"కళ్లు తిరిగి పడినట్లున్నారు. మంచినీళ్లు తాగండి" చేతిలోని వాటర్ బాటిల్ తనకు ఇచ్చాడు.

మాట్లాడటం అలవాటు రాఘవకి. ఆమె చూసింది ఎవరినో. ఆ వాస్తవం ఆమెకు చెప్పేస్తే! సముద్రం ఒడ్డున మీ పక్కన నేనె ప్పుడూ కూర్చోలేదు. మీరు భ్రమ పడు తున్నారు, అందామనుకున్నాడు! కానీ ఆ మాటలు పెదవులు దాటి రాలేదు. మొద టిసారి అబద్ధం చెప్పాడు.

"మళ్ళీ మీ పక్కన సముద్రం ఒడ్డున వెన్నెల కురిసే సమయంలో కూర్చోవాలని ఉంది" అన్నాడు రాఘవ, హరిత భుజం మీద చెయ్యేసి.



# రిటైర్మెంట్‌పై దిగులొద్దు



**ఉద్యోగంలో చేరిన తర్వాత పదవీ విరమణ పొందాల్సిందే. అయితే ఉద్యోగంలో ఉన్నంత కాలం తెలియదుగానీ రిటైర్మెంట్ తర్వాత చాలామందికి ఏమీ తోచదు. ఏంచేయాలో తెలియదు. అంతేకాదు అప్పటివరకు నెలనెల ఇంటికి సరిపడా జీతం వచ్చేది కానీ రిటైర్మెంట్ అయ్యాక పింఛనుతోనే కాలం గడపాల్సివస్తుంది. అందుకే రిటైర్మెంట్ తర్వాత జీవితం ఏంటి? అనే ప్రశ్న ఇప్పుడు అత్యధిక శాతం మంది భారతీయ ఉద్యోగులను వేధిస్తోందట.**

దాదాపు 80 శాతం ఉద్యోగులు రిటైర్మెంట్ తర్వాత జీవితం ఎలా గడపాలనే విషయంపైనే ఆలోచన చేస్తున్నారట. రిటైర్మెంట్ వయసు దగ్గర పడుతున్నకొద్దీ భారతీయ ఉద్యోగుల్లో ఆందోళన, ఆవేదన పెరుగుతున్నాయి. ఇలా మనస్సంతా ఆవేదన, ఆందోళన, దిగులు నింపుకున్న వారి సంఖ్య 78 శాతం దాకా ఉన్నట్టు ఓ సర్వేలో వెల్లడైంది. దాదాపు 12 దేశాల్లో సర్వే నిర్వహించిన ఓ సంస్థ భారతీయుల గుండెల్లో గూడు కట్టుకున్న ఆందోళనను పసిగట్టింది. మరి పదవీ విరమణ తర్వాత జీవితాన్ని ఎలా గడపవచ్చో తెలుసుకోండి!

### సురక్షితంగా దాచుకోండి

పెట్టుబడిని సురక్షితంగా ఉంచుకోవడమే ఈ వయసులో ప్రధాన లక్ష్యం కావాలి. జీవితాంతం కష్టపడి, మలివయసులో కాస్త విశ్రాంతి తీసుకోవాలని కోరుకునేవారు చాలా మందే ఉంటారు. ఇలాంటి సమయంలో అప్పటి వరకు సంపాదించిన డబ్బుపై క్రమం తప్పకుండా వడ్డీ వస్తుంటే, ఆర్థికంగా కూడా ఎలాంటి లోటూ రాకుండా జీవితాన్ని హాయిగా గడిపేయచ్చు.

అయితే 60 ఏళ్ళ వయసు పైబడిన వారు డబ్బును పొదుపు పథకాల్లో పెడుతున్నప్పుడు కొంచెం కూడా నష్టంలేనివి ఎంచుకోవడం చాలా అవసరం. సాధ్యమైనంత వరకూ ఈక్విటీలకు దూరంగా ఉండి డెట్ పథకాల్లోనే మదుపు చేయాలి. పదవీ విరమణ చేసిన వారికి నెలవారీ, మూడు నెలలకోసారి రాబడి వచ్చేలా ఉంటే బాగుంటుంది. అందుకే పెద్దల పొదుపు పథకం (సీనియర్ సిటిజన్ సేవింగ్ స్కీం)లాంటి వాటిని పరిశీలించవచ్చు. దీనికి ప్రభుత్వ హామీ ఉంటుంది. కాబట్టి పెట్టుబడికి ఎలాంటి ఇబ్బందీ ఉండదు. రాబడి హామీ కూడా ఉంటుంది. పన్ను మినహాయింపు పథకాల్లో మదుపు చేసేటప్పుడు వయసే కాకుండా, ఆదాయాలను కూడా పరిగణనలోకి తీసుకోవాల్సి వస్తుంది.

### ఎప్పటికప్పుడు సమీక్ష

మీకున్న ఆర్థిక లక్ష్యాలను చేరుకోడంలో మీరు ఎంత వరకు విజయవంతమవుతున్నారు అనే అంశాన్ని తరచూ సమీక్షించుకుంటే మంచిది. అందుకోసం ఓ బుక్ మెయింటైన్ చేయండి. దేనికి ఎక్కువ ఖర్చు పెడుతున్నారు? వాటిని తగ్గించుకునే అవకాశాలు ఏమైనా ఉన్నాయా? అనేది చూడండి. దీనివల్ల మీరు చేసే తప్పులు, మీ పెట్టుబడుల్లో లోపాలు మీకు తెలుస్తాయి. ఎప్పటికప్పుడు ఇలా ఆర్థిక పరిస్థితిని సమీక్షించుకుంటూ పోతే లక్ష్యాలకు మీరెంత దూరంలో ఉన్నారనేది తెలుస్తుంది. దానికనుగుణంగా మీ ఐడియాలు మార్చుకోవచ్చు.

### అరవై దాటిన తర్వాతే కాదు

రిటైరయ్యాక ఆలోచిద్దాం, ఇప్పటి నుంచే ఎందుకులే అని కొంతమంది ఉదాసీనంగా వ్యవహరిస్తారు. ఇప్పుడు ఉన్న లైఫ్ ఎంజాయ్ చేద్దాం, పొదుపు విషయం తర్వాత అనే ఆలోచనతో ఉన్నవారు కూడా ఉంటారు. అలాంటి వారు ఆలోచనలు మార్చుకోవడం ముఖ్యం. ఎంజాయ్ చేయడం మంచిదే, అవసరమే కానీ

### రిటైర్మెంట్ ప్లాన్

రిటైర్మెంట్ తర్వాత పెద్దగా ఖర్చులు ఏం ఉంటాయి? అని చాలామంది అనుకుంటారు. ఇప్పుడు వస్తున్న ఆదాయంలో కనీసం 70 శాతం వచ్చినా సరిపోతుందని అనుకుంటారు. రిటైర్మెంట్ వయసులో ఆదాయం ఉండదుగానీ, ఖర్చుల్లో మాత్రం పెద్ద తేడా ఉండదనే విషయం గుర్తుంచుకోవాలి. పైగా ఇంకా ఖర్చులు పెరిగే అవకాశాలు ఉన్నాయని ఆర్థిక నిపుణులు హెచ్చరిస్తున్నారు కూడా! కాబట్టి రిటైర్మెంట్‌కి ముందునుంచే కాస్త పొదుపు చేయమని చెబుతున్నారు.

## పొదుపు ఖాతాలో వేయడానికే...

నిజానికి ఇతర దేశాలతో పోల్చుకుంటే మన దేశంలో పొదుపు స్పృహ ఎక్కువ. పొదుపు విషయంలో చైనా ఉద్యోగులు ఫస్ట్ ప్లేస్‌లో ఉంటే భారతీయ ఉద్యోగులు రెండో స్థానంలో ఉంటారు. అమెరికా లాంటి పాశ్చాత్య దేశాల తరహాలో అప్పు చేయాలంటే భయపడేవారి సంఖ్య మనదేశంలో ఇప్పటికీ ఎక్కువే. భారతీయ ఉద్యోగులు సగటున తమ సంపాదనలో కనీసం 16 శాతం పొదుపు ఖాతాలో వేయడానికి ప్రాధాన్యం ఇస్తున్నట్టు ఓ సర్వేలో తేలింది.

12 దేశాల్లో సాగిన ఈ సర్వే మరికొన్ని ఆసక్తికర విషయాలను కూడా బైటపెట్టింది. 40 ఏళ్ళు నిండినవారిలో రిటైర్మెంట్ ప్లాన్ ఆలోచన మొదలవుతుంది. నాలుగు పదుల వయసులోకి ప్రవేశించిన క్షణం నుంచే రిటైర్మెంట్ ప్లాన్‌కు సంబంధించిన కార్యాచరణను మొదలు పెడుతున్నారు. సొంత ఇల్లు సమకూర్చుకోవాలన్న ఆకాంక్ష కూడా ఈ వయసులోనే బలీయమవుతుంది. ఇక యాభై ఏళ్లు దాటిన వారికి రిటైర్మెంట్ ప్లానే అత్యంత ప్రధానాంశంగా మారుతున్నట్లు సర్వేలో వెల్లడైంది.



దేనికి ఎంత ఖర్చుపెట్టాలనేది నిర్ణయించుకోవడం ఇంకా బెటర్. రిటైరయ్యాక చేయాల్సిన పనులు అప్పుడే ఉంటాయి కాబట్టి భవిష్యత్తు అవసరాల దృష్ట్యా ఉద్యోగంలో చేరినప్పటి నుంచే నెలకు కొంత రిటైర్మెంట్ సేవింగ్స్ ప్రారంభిస్తే మేలు. అప్పటికి ఆ సేవింగ్స్ అధికమొత్తంలో సమకూరి భవిష్యత్తులో ఉపయోగపడవచ్చు. అలాంటి ముందస్తు ఏర్పాట్లు చేసుకున్నవారికి రిటైర్‌మెంట్ వయసు దగ్గరపడినప్పటికి కూడా టెన్షన్ లేకుండా ఉండగలుగుతారు. ప్రీప్లాన్డ్‌గా ఉండడం వల్ల ఆ వయసులో ఎదురయ్యే ఒత్తిడిని తగ్గించుకోవచ్చుకూడా!

### రిటైర్మెంట్ హోమ్స్

ఆస్తిమొత్తం వారసులకే ఇచ్చి తమకంటూ గూడు లేకుండా ఆక్రోశించే తల్లిదండ్రులు చాలామందే ఉన్నారు. అదేవిధంగా రిటైరైన తర్వాత కూడా అద్దె ఇంట్లోనే కాలం గడపుతున్న వారు కూడా ఎక్కువమందే ఉన్నారు. మలివయసులో శారీరకంగా, మానసికంగా కుంగిపోతున్న వృద్ధుల సమస్యలు అన్నీ ఇన్నీ కావు. ఆదరణ కరువై కొంతమంది బాధపడుతుంటే ఆర్థికపరమైన ఆసరా లేక మరికొందరు ఇబ్బంది పడుతున్నారు. అందుకోసం మలివయసులో కూడా వృద్ధులకు ఒంటరితనాన్ని దూరం చేస్తూ, వారి అభిరుచులకు తగ్గ ఇల్లు ఉండాలి. అప్పుడే వారు ఆనందంగా ఉండగలుగుతారు. అదిగో! అలాంటివే రిటైర్మెంట్ హోమ్స్ అన్నమాట! ప్లాన్డ్‌గా పొదుపు చేసుకున్న మొత్తమే రిటైర్మెంట్ హోమ్స్‌కు పెట్టుబడి అని చెప్పుకోవచ్చు. రిటైర్మెంట్‌కు ముందే ఒక ప్రణాళిక వేసుకుని కొంత సొమ్ము ఆదా చేసుకోవాలి. దాన్నే పెట్టుబడిగా పెడితే ఆ తర్వాత మన అభిరుచులకు అనుగుణంగా ఓ కొత్త ఇల్లు సిద్ధంగా ఉంటుంది. ఈ రిటైర్‌మెంట్ హోమ్స్ మనదేశంలో ఇప్పుడిప్పుడే ప్రాధాన్యం సంతరించుకుంటున్నాయి. కానీ విదేశాలలో ఎక్కువగానే ఉంటున్నాయి. తల్లిదండ్రులు రిటైర్ అయ్యాక పిల్లలే వారికోసం ఇల్లు కొని బహుమతిగా ఇస్తారట. కొన్ని కంపెనీలు కూడా తమ దగ్గర పనిచేసే ఉద్యోగి రిటైరైన తర్వాత ఇలాంటి హోమ్స్ గిఫ్ట్‌గా ఇస్తున్నాయట. ఇది కేవలం ఉద్యోగస్తులు మాత్రమే కొనుగోలు చేయాలన్న నిబంధన ఏమీ లేదు, వయసులో ఉండగానే పొదుపు చేసుకున్న డబ్బు పెట్టుబడిగా పెడితే చాలు. ఈ ఇళ్ళను వృద్ధులకు అనుగుణంగా డిజైన్ చేస్తారు. చెన్నై, బెంగళూరు లాంటి నగరాల్లో ఇప్పటికే ఇవి ఉన్నాయి. ఇప్పుడిప్పుడే మన హైదరాబాదులోనూ వీటి నిర్మాణం చేస్తున్నారు.



### వీలునామా రాయాలంటే?

ఒక వ్యక్తి తన తదనంతరం తాను సంపాదించిన స్థిరాస్తి, చరాస్తుల బదిలీ విషయాలకు సంబంధించి ముందస్తుగా రూపొందించే చట్టమే వీలునామా. సాధారణంగా వీలునామాకు కొన్ని ప్రత్యేక సందర్భాల్లో తప్ప మామూలుగా రిజిస్ట్రేషన్ అవసరం లేదు. కొంతమంది వారసులు లేని వ్యక్తులు తమ ఆస్తులను ఎన్జీవోలకో, అనాథ శరణాలయాలకో బదిలీ చేయాలనుకుంటారు. అలాంటి ఆలోచన ఉన్నవారు మాత్రం రిజిస్ట్రేషన్ చేయడం మంచిది. వీలునామా తయారు చేస్తున్నప్పుడు ప్రతి పేజి మీద సంఖ్యవేసి, పేజి కింది భాగంలో విధిగా సంతకం చేయాలి. ఇందులో ఎవరి బలవంతం లేదని స్పష్టంగా రాతపూర్వకంగా ప్రకటించాలి. అలాగే ఎవరికైతే మన స్థిర, చరాస్తులను పంపిణీ చేయాలనుకుంటున్నామో వారి పేరు, చిరునామాల వివరాలను విధిగా అందులో పొందుపర్చాలి. సాక్షుల సంతకాలు కూడా ప్రతి పేజీమీద తప్పనిసరిగా తీసుకోవాలి. వీలైతే ఆఖరిపేజీలో ఆస్తి పంపకంలో భాగంగా కొన్ని నియమ నిబంధనలను కూడా చేర్చవచ్చు. అదే విధంగా వీలునామా మొత్తం పేజీల సంఖ్యను చివరి పేజీలో వేయాలి. ప్రస్తుతం ఆన్‌లైన్‌లో వీలునామా రాసి, భద్రపరుచుకునే అవకాశం ఉంది.

- నివేదిత




# సాఫ్ట్‌వేర్‌లో సరిగమలు

- కంఠంనేని స్వప్న

**బ్రహ్మీకి ఫోన్ చేశాడు కుమార్. అర్జంట్‌గా కలవాలని తన క్యాబిన్‌కి రమ్మన్నాడు. అతను ఆ కంపెనీలో ట్రావెల్ ఆఫీసర్.**

**ఏ దేశపు వీసా కావాలన్నా, దానికి అవసరమయ్యే డాక్యుమెంట్లు, నియమ నిబంధనలు, మళ్ళీ వాటిలో లొసుగులు, మతలబులు అన్నీ అతనికి కంఠోపాఠం. అందుకే అతడిని ఆ కంపెనీలో అందరూ గౌరవిస్తారు.**

బ్రహ్మి వెళ్ళేసరికి విచారంగా మొహం పెట్టి ఫోన్‌లో మాట్లాడుతున్నాడు కుమార్. కూర్చోమని సైగ చేశాడు.

చిన్న బౌల్‌లో చాక్‌లెట్స్ పెట్టి ఉంటాయెప్పుడూ, అతని టేబుల్ మీద.

ఒకటి తీసుకుని నోట్లో వేసుకున్నాడు బ్రహ్మి.

ఫోన్ ముగించి బ్రహ్మి వేపుకి తిరిగాడు.

"మీ టీమ్‌లో ఇద్దరిని అమెరికా పంపటానికి వీసా కావాలన్నారు కదా. బిజినెస్ వీసా అయితే వాళ్ళక్కడ ఏ పనీ చేయకూడదు. మీటింగ్స్ మాత్రమే అటెండ్ చేసి చర్చల్లో పాలు పంచుకోవచ్చు. పని చేయకూడదు" చెప్పాడు.

"పని చేయకుండా వట్టిగా ఎందుకు వెళ్ళటం? ఫోన్లో మాట్లాడొచ్చుగా" బుర్ర గోక్కున్నాడు బ్రహ్మి.

డైలమా అర్థమైంది కుమార్‌కి.

"పని చేయటం తప్పనిసరి అంటే 'ఎల్-వన్'కి అప్లయ్ చేద్దాం" చెప్పాడు.

ఊపిరి పీల్చుకునేలోపు యాభైపేజీల అప్లికేషన్ చేతిలో పెట్టాడు.

"అర్జంట్‌గా ఇది నింపి పంపించమనండి. రెండు నుంచి నాలుగు నెలల మధ్యలో వీసా వచ్చేస్తుంది" చెప్పాడు.

"మా టీమ్ వెళ్ళాల్సింది రెండు వారాలే, వేరే దారి లేదా?" అడిగాడు బ్రహ్మి.

"మెక్సికో పంపి బోర్డర్‌లో నుంచి ఇల్లీగల్‌గా అమెరికా పంపటం తప్ప మరో మార్గంలేదు" వెటకారం ధ్వనిస్తోంది అతని గొంతులో.

"సరే, ఆలోచించి చెప్తాను. క్లయింట్‌తో కూడా మాట్లాడాలి" లేవబోయాడు బ్రహ్మి.

"ఒక్క నిమిషం" లేచి డోర్ వేశాడు కుమార్.

బ్రహ్మి భయంగా చూస్తున్నాడు.

"నా భార్య హాస్పిటల్‌లో ఉంది. అర్జంట్‌గా యాభై వేలు కావాలి" దీనంగా అడిగాడు.

"అయ్యో, ఏమిటి ప్రాబ్లమ్?" అడిగాడు బ్రహ్మి.

"అల్సర్స్ బాగా పెద్దగా అయి, పొట్టలోనే ఒకటి బ్లాస్ట్ అయింది. చాలా సీరియస్‌గా ఉంది" చెప్పాడు.

"ఇప్పుడే నా డెస్క్‌కివెళ్ళి వైర్ ట్రాన్స్‌ఫర్ చేస్తాను" చెప్పాడు బ్రహ్మి. కుమార్ శాలరీ తనకి రెండింతలుంటుందనీ, హెల్త్ ఇన్స్యూరెన్స్.. ఇలాంటి ఖర్చులన్నిటినీ వంద శాతం కవర్ చేస్తుందనీ గుర్తు రాలేదతనికి.

తన ల్యాప్‌టాప్ బ్రహ్మికి అందించాడు కుమార్.

ఇవ్వకుండా తన రూమ్‌లోంచి బయటికి వెళ్ళే పరిస్థితి లేదని అర్థమైంది అతనికి.

మాట్లాడకుండా ఆన్‌లైన్ ట్రాన్స్‌ఫర్ చేసి బయటికి నడిచాడు.

•••

"ప్రాజెక్ట్ ఖర్చు తగ్గించాలి. సేవింగ్స్ ఎక్కువ ఉండాలి" పై మేనేజ్‌మెంట్ నుంచి అందరికీ ఆదేశాలు వెళ్ళాయి. వాళ్ళ డిపార్ట్‌మెంట్ ఆ ఏడాది టార్గెట్స్‌ని సాధించాలంటే పెనుమార్పులు జరిగి తీరాలని అందరికీ నోటీసులు వచ్చాయి.

బ్రహ్మి తల పట్టుకున్నాడు.

ప్రాజెక్ట్ ఇంకా ఆరు నెలలు ఉంది.

స్టాఫ్‌ని పెంచాల్సిందే తప్ప తగ్గించే అవకాశం లేదు.

ప్రాజెక్ట్ మేనేజర్లు, డెలివరీ మేనేజర్లు చర్చించుకున్నారు. ఇంతలో సీనియర్ మేనేజ్‌మెంట్ నుంచి అందరికీ మీటింగ్ ఇన్విటేషన్ వచ్చింది.

అంతా కాన్ఫరెన్స్ రూమ్‌లో గుమికూడారు.

అందరినీ ఏమైనా ప్రశ్నలున్నా, సమస్యలున్నా చెప్పమన్నారు సీనియర్ మేనేజ్‌మెంట్ టీమ్.



అంతా విన్నాక గొంతు సవరించుకున్నాడు సీనియర్ లీడర్.

"వీటన్నిటికీ ఒక పరిష్కారం ఉంది. మన స్టాఫ్‌కి మనం గంటకి పే చేసే మొత్తం, వేరే కంపెనీల నుంచి కాంట్రాక్ట్ బేసిస్ మీద మన కంపెనీలో పనిచేసే వాళ్ళకిచ్చేదానికి మూడింత లుంటుంది. కాబట్టి మనం వాళ్ళని నియమించు కుంటే స్టాఫ్ రెట్టింపు అవుతారు. కాస్ట్ సగం తగ్గు తుంది. మరిన్ని ఎక్కువ ప్రాజెక్టులు చేసి బిజినెస్ పెంచుకోవచ్చు. ప్రతి ప్రాజెక్ట్‌లో ముఖ్యమైన వాళ్ళని ఉంచి మిగతా అంతా కాంట్రాక్ట్ ఉద్యోగులతో నింపండి".

చివరగా ఒక హింట్ కూడా ఇచ్చాడు.

"న్యూలుక్ ఏజెన్సీ వాళ్ళు మనకి డిస్కౌంట్ ఇస్తున్నారు. వాళ్ళకి సంబంధించిన కాంట్రాక్ట్‌లు త్వరగా ఓకే చేసేయొచ్చు.

●●●

విషయం విని గొల్లుమన్నారు అక్షయ్, సుధీర్.

## జరిగిన కథ

అదో మల్టీ నేషనల్ కంపెనీ! రెండేళ్ళుగా ఆ కంపెనీలోనే పనిచేస్తున్నాడు అక్షయ్. కష్టపడేసే అందంతోపాటు, క్రమశిక్షణ, తెలివితేటలు అతని సొంతం. కావ్య కూడా అదే ఆఫీసులో ఫ్రెషర్‌గా జాయినైంది. అక్షయ్, కావ్య కోడ్‌ని రివ్యూ చేసి, బగ్స్ ఫిక్స్ చేయమని చెప్పి వెళ్ళిపోయాడు. అదే ఆఫీసులో కొత్తగా చేరిన సీమ, సరాసరి అక్షయ్ దగ్గరకెళ్ళింది. అక్షయ్, సీమ స్నేహితులని తెలిసి ఉడికిపోయింది కావ్య. రాజేష్, కావ్య పర్ఫార్మెన్స్ రివ్యూ చేశాడు. అతడి ప్రపోజల్‌కి కావ్య అంగీ కరించలేదు. దాంతో ఆమెపై పనిభారం పెంచాడు రాజేష్. అతడిబారి నుంచి తప్పించుకోవడానికి సాంబతో ఒప్పందం కుదుర్చుకుని దెబ్బతింది కావ్య. **ఆ తర్వాత...**





'వాళ్ళ కోడింగ్ చాలా చెత్తగా ఉంటుంది. పేరుకి మనుషుల్ని ఇస్తారంతే. పనంతా చేయలేక మేము చచ్చిపోవాలి".

"తప్పదయ్యా" సీరియస్‌గా చెప్పాడు బ్రహ్మీ.

"కావాలంటే ఇంటర్వ్యూలు చేసి తీసుకుం దాము" అన్నాడు.

ఇంటర్వ్యూల ప్రహసనం మొదలైంది.

రెండు, మూడు ప్యానెల్స్‌గా ఏర్పడి ఇంట ర్వ్యూలు చేస్తున్నారు.

ఒకళ్ళు వద్దన్న వాళ్ళని మళ్ళీ మర్నాటికి ప్రిపేర్ చేసి ఇంకో ప్యానెల్ వద్దకి పంపటం, ఇంట ర్వ్యూలు జరిగిన వాళ్ళందరి దగ్గరా ఏయే ప్రశ్నలు అడిగారో సేకరించి, మిగతావాళ్ళకి జవాబులు నేర్పి ఇంటర్వ్యూకి పంపుతుండటంతో ఎడా పెడా అందరూ సెలక్ట్ అయిపోతున్నారు.

ఏమీ చేయలేక చేతులెత్తేశారు లీడ్స్.

పెద్దగుంపుగా 'న్యూలుక్ ఏజెన్సీ' నుంచి అభ్య ర్థులను ప్రతీ ప్రాజెక్ట్‌లోనూ దూర్చేశారు.

●●●

ప్యాంట్రీలో రౌండ్‌టేబుల్స్, చుట్టూ సోఫాలు వేసున్నాయి. కాఫీ తాగుతూ పేపర్ చూస్తున్నాడు అక్షయ్. రెండువైపుల నుంచి అనుకోకుండా అప్పుడే పాంట్రీలోకి అడుగు పెట్టారు సీమ, కావ్య.

"హలో?" తనే పలకరించింది సీమ.

సీమ గ్రీన్ టీ కలుపుకోవటం చూసి కావ్య మొహం చిట్లించింది.

'దీనికెప్పుడూ సౌందర్య పోషణే!'

కావ్య మొహం చూస్తే అర్థమైందేమో... "గ్రీన్ టీ వల్ల శరీరంలో టాక్సిన్స్ అన్నీ బయటికి వెళ్ళిపోతాయి. సన్నగా, హెల్దీగా కూడా అవ్వచ్చు" చెప్పింది సీమ.

"ఏడ్చావ్ లే" లోపల్ అనుకుంది కావ్య.

పైకి శ్రద్ధగా విన్నట్లు నటిస్తూ తలూపింది.

వెళ్ళి అక్షయ్ ఎదురుగా కూర్చుంది సీమ.

'ఎకనామిక్ టైమ్స్' పేపర్ తీసి చదవసాగింది.

కావ్యకి మండిపోయింది.

"అన్నీ డ్రామాలే. ఒంటి కలర్ ఆ గులాబీ రంగు పేపర్‌కి మ్యాచ్ అవుతుందని తప్ప దీనికేం అర్థమై చస్తుంది" మనసులో చచ్చేట్టు తిట్టుకుంది.

ఇంకో టేబుల్ దగ్గర కూర్చుంది కావ్య. సినిమా పేజీలు తిరగేయటం మొదలెట్టింది.

అక్షయ్, సీమలని గమనించసాగింది మధ్యమధ్యలో.

కావ్య చూడటం గమనించింది సీమ. లేచి వెళ్ళి అక్షయ్ పక్కన కూర్చుంది.

"అక్కీ! ఇది చూడు" న్యూస్‌పేపర్ పైకి ఎత్తి పట్టుకుంది. ఏదో చూపిస్తోందతనికి. వాళ్ళిద్దరి

**చైనీస్ రెస్టారెంట్‌లో కూర్చున్నారిద్దరూ. కాసేపయ్యాక నువ్వు చాలా అందంగా ఉంటావ్ అన్నాడతను. ఎప్పుడూ వినే డైలాగే అనుకుందామె. నీకు ఏ కలర్ అంటే ఇష్టం? ప్లేట్‌లో బొమ్మలు గీస్తూ అడిగాడు. టీనేజర్‌లాగా ఎలా అడుగుతున్నాడో చూడు, ఆఫీసులో పెద్ద కాసనోవాలాగా బిల్డప్పు గొణుక్కుంది. ఇంతలో ఆమె పక్కకి ఇద్దరు వచ్చి నిలబడ్డారు. అతడిని కిచెన్‌లోకి లాక్కెళ్ళారు. వాళ్ళిద్దరూ ఎవరు? అసలేం జరిగింది?**

మొహాలు కనబడటం లేదు కావ్యకి.

'అక్కీ అంట అక్కీ.... తొక్కిపారేయాలిద్దరినీ..'

లేచి విసవిసా వెళ్ళి తన డెస్క్ దగ్గర కూర్చుంది.

ఆమె వెనక్కితిరిగి చూస్తే వాళ్ళిద్దరూ నవ్వాపుకోవటం కనపడేది.

●●●

రాజేష్ ముఖ్యమైన మీటింగ్స్ అన్నీ వాయిదా వేసుకున్నాడు.

బ్రహ్మి, కావ్య, సుధీర్‌లాంటి వాళ్ళంతా సీమని జుగుప్సగా చూస్తుండగా ఆమె రాజేష్‌తో లంచ్‌కి బయలుదేరింది.

పార్కింగ్ లాట్ వరకూ వెళ్ళాక చెప్పింది.

"ఎవరి కార్‌లో వాళ్ళు వెళ్దాము. నేను లంచ్ అవగానే ఇంటికి వెళ్ళిపోవాలి. కాస్త పనుంది".

అసహజంగా అనిపించిందతనికి, ఒకేచోట నుంచి బయలుదేరి వెళ్తూ విడివిడిగా వెళ్ళటం. అభ్యంతరం వ్యక్తం చేస్తే మొత్తానికే రావటం మానేస్తుందేమోనని సరేనన్నాడు. కాస్త అటూ ఇటూగా ఇద్దరూ రెస్టారెంట్‌కి చేరుకున్నారు.

అదొక చైనీస్ రెస్టారెంట్.

పగలయినా కాస్త చీకటిగా ఉంది లోపల.

నారింజ రంగు గోడలు, ముదురు ఎరుపు రంగు కుర్చీలు, టేబుల్స్, ప్రతి టేబుల్ మీదకి ఒక లాంప్ పైనుంచి వేలాడగట్టినట్లుంది. లాంప్‌షేడ్ చుట్టూ బాంబూ స్టిక్స్ అతికించినట్లున్నాయి. చైనీస్ రెస్టారెంట్ అని నిరూపించే ప్రయత్నంలో చైనా సిల్క్ ఫ్లోరల్ డిజైన్స్ ఉన్న సిల్కీ బట్టలు టేబుల్ మీద పరచి ఉన్నాయి. గోడలకి గోల్డ్‌కలర్ డ్రాగన్ పెయింటింగ్స్...

చిన్న కప్పుల్లో టీ, సెలరీతో చేసిన సాలడ్ తెచ్చి ముందు పెట్టాడు వెయిటర్.

ప్లేట్లోకి సాలడ్ తీసుకుంటుండగానే రంగంలోకి దిగిపోయాడు రాజేష్.

"నువ్వు చాలా అందంగా ఉంటావు".

నవ్వింది సీమ. "పరమ బోర్. ఇప్పటికి ఎన్ని సార్లు విని ఉంటానో ఈ కామెంట్!"

గతుక్కుమన్నాడు రాజేష్. 'ఒళ్ళంతా కొవ్వే' పళ్ళు నూరాడు.

ప్రాజెక్ట్ గురించి ఏదో మాట్లాడబోయింది సీమ.

"అబ్బ. ఇక్కడ కూడా ఆఫీస్ విషయాలా? వద్దు. వేరే ఏదైనా మాట్లాడుకుందాం" అన్నాడు.

"నీకే కలర్ అంటే ఇష్టం?" అడిగాడు ప్లేట్‌లో బొమ్మలు గీస్తూ.

వెధవా! టీనేజర్‌లాగా ఏ కలర్ ఇష్టం, ఏ యాక్టర్ ఇష్టం, ఇలానా అడిగేది? పైగా పెద్ద కాసనోవాలాగా ఆఫీస్‌లో బిల్డప్. నీ చేతిలో ఉన్న పవర్ చూసి వస్తారేమో కానీ నీతో లంచ్‌లకీ, డిన్నర్‌లకీ. అసలు నీలాంటి వెధవలకి ఎవరూ పిల్లని కూడా ఇవ్వరు. చెత్తఫేస్. ఛీ" తిట్టుకుంది.

ఇంతలో పక్కటేబుల్ నుంచి ఇద్దరు వచ్చి సీమ పక్కన నిలబడ్డారు.

ఇద్దరూ ఎత్తుగా లావుగా, బలంగా కండలు తిరిగి బౌన్సర్స్‌లా ఉన్నారు.

"ఇక్కడెందుకు ఉన్నావు?" వాళ్ళలో ఒకతను అడిగాడు సీమని.

"ఆఫీస్ లంచ్ అన్నా!" చెప్పింది సీమ.

"ఆఫీస్ లంచ్ అయితే మిగతా వాళ్ళేరి?" అడిగాడు.

నీళ్ళు నమిలింది సీమ.

"ఇంటికెళ్ళు. నీ సంగతి తర్వాత చెప్తాను" అన్నాడు రెండో అతను.

రాజేష్ నిర్ఘాంతపోయి చూస్తుండగానే సీమ గబగబా బయటికి వెళ్ళిపోయింది. రాజేష్‌ని ఎలకని పట్టుకున్నట్టు రెండు చేతులూ పట్టుకుని కిచెన్‌లోకి ఈడ్చుకెళ్ళారు. వాళ్ళ కసి తీరే వరకూ కొట్టి, బయటికి తీసుకొచ్చి అతని కార్ దగ్గర వదిలేశారు.

కన్నుచుట్టూ నల్లగా కమిలిపోయింది. పెదాలు చిట్లి రక్తమోడుతున్నాయి.

ఒంటిమీద కనబడని దెబ్బలు సలుపుతున్నాయి.

ఇంటివరకూ అతి కష్టం మీద కార్ నడుపుకుంటూ వెళ్ళాడు.

తర్వాత రెండురోజుల వరకూ అతను ఎమర్జెన్సీ లీవ్‌లో ఉన్నాడు.

ఈ రెండు రోజులూ అతన్ని వేధించిన ప్రశ్నలు రెండే.

"వాళ్ళు నిజంగా సీమకి అన్నలేనా? అసలు ఎటువంటి పోలికలూ కనపడట్లేదు. సరిగ్గా తన కారు దగ్గరకే తీసుకొచ్చి దిగబెట్టారు. వాళ్ళకెలా తెలిసింది?"

●●●

తిరిగి ఆఫీస్‌కి రాగానే సీమ గబగబా ఎదురొచ్చి పరామర్శించింది.

"సో సారీ! మా అన్నయ్యలు అక్కడికెందుకొచ్చారో తెలీదు. తర్వాత నన్ను కూడా కొట్టారు" అనుమానంగా చూశాడు రాజేష్.

ఎక్కడా ఒక్క దెబ్బ పడ్డట్టు లేదు. ఫ్రెష్‌గా, హాయిగా కనబడుతోంది.

"గెట్‌వెల్ సూన్!" తియ్యగా నవ్వి, చేతిలో తెలుపురంగు గులాబీలున్న బొకే పెట్టింది.

ఉబ్బితబ్బిబ్బయ్యాడు రాజేష్.

ఇంకా ఏదో సంజాయిషీలు ఇవ్వబోయింది సీమ. ఎవరైనా వింటే బాగా అయిందనుకుంటారేమోననే అనుమానం అతన్ని పీడిస్తోంది.

"తర్వాత మాట్లాడదాం" చెప్పాడు.

"ఈసారి వేరేచోటికి వెళ్దాం, డిన్నర్‌కి" ఉత్సాహంగా అంది సీమ.

ఎందుకో అతనికి భయమేసింది. బలవంతంగా నవ్వి తలూపాడు.

●●●

ఆ రోజు చాలా లేట

## రాశీని కష్టపెడుతున్న మెగాహీరో?

అపార్థం చేసుకోవలసిన అవసరం లేదు. ఈ మెగా హీరో నేరుగా రాశీని ఏమీ కష్టపెట్టడం లేదు. ఇంతకీ అసలు సంగతేమిటంటే...సుకుమార్ దర్శకత్వంలో మెగాహీరో చేస్తున్న ఓ సినిమాలో రాశికి అవకాశం వచ్చింది. ఈ వార్త కన్‌ఫామ్ కాలేదు. అయితే దర్శకుడు మాత్రం రాశిని బరువు తగ్గి సన్నజాజితీగలా తయారవ్వమని సలహా ఇచ్చాడట! ఆయన సలహా మేరకు రాశి విపరీతంగా జిమ్‌లో వర్కవుట్లు చేస్తూ తెగ కష్టపడిపోతోంది. ఇప్పటికే చాలా బరువు తగ్గి నాజూకుగా కనిపిస్తున్న రాశి మరింత బరువు తగ్గడం కోసం ఇంకా కష్టపడుతోందట! ఆ సినిమాలో అవకాశం వచ్చినా రాకపోయినా తను మాత్రం మిగతా హీరోయిన్లలాగా స్లిమ్‌గా మారిపోతున్నానని రాశి తెగ సంబరపడిపోతోంది.

యింది. ఇంకా చచ్చేంత పని ఉంది.

టీ తెచ్చుకుని కారిడార్‌లో వేసున్న సోఫాలో కూర్చుని ఫోన్ చూసుకుంటోంది మానస. ఆమె సర్వీసెస్ డివిజన్ ఫైనాన్స్ టీమ్‌లో పనిచేస్తుంది. నెలాఖరు టైమ్. అన్ని బ్యాలన్స్ షీట్స్ టాలీ చేయాలి. టీమ్‌లో మరొకతను సెలవు మీద వెళ్ళటంతో పని మొత్తం తన మీద పడింది.

పక్కనే ఉన్న క్యాబిన్ నుంచి మాటలు వినపడుతున్నాయి.

సీనియర్ మేనేజ్‌మెంట్ ఏవో లెక్కలు మాట్లాడుకుంటున్నారు. ఫైనాన్స్ ఆమెకి చాలా ఇష్టమైన సబ్జెక్ట్ కావటంతో వద్దన్నా చెవిన పడుతున్నాయి. వాళ్ళ మాటలు వింటున్న కొద్దీ నిర్ఘాంతపోసాగింది.

సీనియర్ డైరెక్టర్లలో ఒకతని భార్య పేరుమీద ఉంది న్యూలుక్ ఏజెన్సీ కంపెనీ. ఆ ఏజెన్సీ నుంచీ కాంట్రాక్ట్ కింద తీసుకున్న ప్రతి నియామకానికీ, కంపెనీలో మిగతా డైరెక్టర్లకి కూడా కొంత కమీషన్ ముడుతుంది.

మానస కొన్ని ఆదర్శాలతో పెరిగింది. చేసే ప్రతీ పనిలో నిజాయితీ ఉండాలనీ, అవినీతిని తుడిచేయాలనీ అనుకుంటుంది. ఆమె ఒక ఐడియల్ వరల్డ్‌లో జీవిస్తుంటుంది.

సడన్‌గా క్యాబిన్ డోర్ తెరుచుకుంది.

లోపలున్న వాళ్ళు ఒకరి వెనుకగా ఒకరు బయటికొస్తున్నారు.

అక్కడే ఉన్న మానసని చూసి ఖంగుతిన్నారు. ఆమె మొహంలో కంగారుచూసి తమ మాటలన్నీ ఆమె విన్నదని వాళ్ళకి అర్థమైపోయింది. తమ హావభావాలు తెలియనీయకుండా, ఆమెని మాట్లాడించాడొక మేనేజర్.

"ఇంకా ఆఫీసులోనే ఉన్నావు? పని ఎక్కువగా ఉంటోందా?"

"నెలాఖరు కదా!" నవ్వింది మానస.

తను విన్న సంగతి వాళ్ళకి తెలిసినట్టు లేదనుకుంది.

ఆమె ఫైనాన్స్ రూమ్‌లోకి వెళ్ళగానే, ఆమె ప్రతి మెయిల్‌నీ వాచ్ చేయమనీ, తమ అనుమతి లేకుండా మానస సిస్టమ్ నుంచి మెయిల్స్ ఎవరికీ వెళ్ళకూడదనీ సిస్టమ్స్ అడ్మినిస్ట్రేటర్‌కి ఆదేశాలు వెళ్ళాయి.

●●●

ఆ రోజు సాయంత్రం షేవింగ్ క్రీమ్ కొనాల్సి ఉండి వాల్‌మార్ట్ షాపింగ్‌మాల్‌కి వెళ్ళాడు బ్రహ్మీ. అక్కడ కుమార్‌తోపాటు అతని భార్య కూడా కనిపించింది. భార్య హాస్పిటల్లో ఉందన్నాడు, ఆమె ఇక్కడ కనిపిస్తోందేమిటో అనిపించింది బ్రహ్మీకి. 'అప్పుడే డిశ్చార్జ్ అయిపోయిందా?' అడుగుదామని దగ్గరకి వెళ్ళాడు.

"ఎలా ఉంది మీకిప్పుడు?" అడగబోతుండగా కుమార్ అతని నోరు నొక్కినంత పనిచేసి పక్కకు లాక్కెళ్ళాడు.

"తనకి అంత సీరియస్ అనే విషయం ఆమెకి తెలీదు. డాక్టర్ చెప్పొద్దన్నాడు".

ఆవిడ చెంగు చెంగున ఎగురుతూ షాపింగ్ చేస్తుంటే, ఆమెకి సీరియస్ ఏమిటో బ్రహ్మీకి అర్థం కాలేదు. అలా అతను చాలామంది వద్ద అప్పులు చేశాడనీ, గట్టిగా తిరిగివ్వమని అడిగితే వీసాలు డిలే చేయిస్తాడనీ తర్వాత టీమ్‌వాళ్ళ నుంచి విని షాకయ్యాడు. "తనకంటే చాలా ఎక్కువ జీతం వస్తుందతనికి. డ్రగ్ అడిక్టా? లేకపోతే ఇన్ని డబ్బులేం చేసుకుంటాడు?"

●●●

మానసకి రెండు రోజుల నుంచి నిద్ర పట్టడం లేదు.

సీనియర్ మేనేజ్‌మెంట్ చేస్తున్న పని అనైతికం. కంపెనీని మోసం చేసి ఇష్టం వచ్చిన వాళ్ళని తీసుకోకూడదు. పైగా వాళ్ళకి ఆ కంపెనీలో పార్టనర్‌షిప్ ఉండటం ఇంకా పెద్ద తప్పు. కంపెనీలో చేరినప్పుడు ఇచ్చిన ట్రైనింగ్ ప్రోగ్రామ్స్ గుర్తొస్తున్నాయి.

ఎథిక్, లీగల్ కంప్లయెన్స్ టీమ్‌కి మెయిల్ పంపితే? మిగతా రీసెర్చ్ వాళ్ళే చేసుకుంటారు.

మొత్తం వివరాలు సేకరించింది.

గత రెండేళ్ళుగా మిగతా కంపెనీల నుంచి ఎంతమందిని రిక్రూట్ చేశారు. న్యూలుక్ ఏజెన్సీ కంపెనీ నుంచి ఎంతమందిని తీసుకున్నారు? ఒక్కో కంపెనీకి ఎంత పేమెంట్ చేశారు. పేమెంట్ అప్రూవల్ ఏ కంపెనీకి ఎంత త్వరగా జరిగింది? లాంటి డేటాని ఈ- మెయిల్‌లో పెట్టింది. తను విన్న వివరాలతో సహా మెయిల్ రాసింది.

మెయిల్ పంపాకే ఆమె రిలీఫ్‌గా ఫీలయింది.

మెయిల్ సర్వర్‌లో కొత్తగా చేర్చిన రూల్స్ వల్ల ఆమె మెయిల్ అక్కడే ఫిల్టర్ అయిందనీ, ఒక కాపీ సీనియర్ మేనేజ్‌మెంట్‌కి చేరిందనీ ఆమెకి తెలీదు.

●●●

శుక్రవారం రాత్రి తల్లిదండ్రులతో కలిసి సినిమాకి వెళ్ళింది కావ్య.

"నువ్వీ మధ్య ఏంటో మూడీగా ఉంటున్నావు. నీ వయసులో ఎంత ఉత్సాహంగా ఉండాలి. నీకేం తక్కువైందని?" సినిమాకి బయల్దేరటానికి ముందు చాలాసేపు పెప్‌టాక్ సెషన్ జరిగింది.

ఉత్సాహంగానే బయలుదేరింది కావ్య.

సినిమా సగంలో గమనించింది కావ్య. తమ ముందు వరుసలో కూర్చున్న సీమ, అక్షయ్, హర్షలని. మళ్ళీ మొహం మాడిపోయిందామెకి. బిగదీసుకుపోయింది.

'మళ్ళీ ఏమొచ్చిందే?' అడిగింది కావ్య తల్లి.

ఇంటర్వెల్‌లో లైట్స్ వెలగగానే సీమ, కావ్య వాళ్ళని చూడనే చూసింది. ముగ్గురూ దగ్గరకొచ్చి పలకరించారు. సీమ కావ్య తల్లిని కౌగలించుకున్నంత పని చేసింది. "మా పిన్ని అచ్చు మీలాగే ఉంటుంది ఆంటీ" అంది.

## ఎంగేజ్‌మెంట్ పెటాకులైందట!

రాఖీ సావంత్ ఎంగేజ్‌మెంట్ అంటే బాలీవుడ్‌లో అందరికీ ఓ పెద్ద జోక్. దీనికోసం రాఖీ వేసే వేషాలు అన్నీ ఇన్నీ కావు. ఎట్టకేలకు కొన్ని నెలల క్రితం ఓ ఎన్నారైతో రాఖీ ఎంగేజ్‌మెంట్ అయింది. అతగాడు రాఖీ పేరున ఓ ఖరీదైన ఫ్లాట్‌ను బహుమతిగా ఇచ్చాడు. తనకు దక్కాల్సింది దక్కడంతో రాఖీ అతగాడికి బ్రేకప్ చెప్పేసింది అంటున్నారు బాలీవుడ్ జనాలు. కేవలం ఖరీదైన ఆ ఫ్లాట్ కోసమే రాఖీ ఎంగేజ్‌మెంట్‌కు సిద్ధపడిందనీ, కావలసింది దక్కగానే అతగాడికి బ్రేకప్ చెప్పేసిందని అంటున్నారు.



వెధవ ఇండియన్ సినిమాలు. ఇంటర్వెల్ ఉంటుంది. ఇంగ్లీషువి నయం. గంటలో సినిమా అయిపోతుంది. ఎవరినీ కలిసే పని లేకుండా వచ్చిన దారినే పోవచ్చు' గొణుక్కుంది కావ్య.

వెళ్ళేప్పుడు దారి మొత్తం కావ్య తల్లి సీమని పొగుడుతూనే ఉంది.

"ఎంత బాగుందే ఆ పిల్ల. అంత అందమైన వాళ్ళని నేనింత వరకు చూడలేదు. మంచి అమ్మాయి లాగా ఉంది. ఎంత ఆప్యాయంగా మాట్లాడిందో!"

కావ్య ఉడికిపోతున్న సంగతి ఆమెకి అర్థమవ లేదు. ఏదో ట్రాన్స్‌లో ఉన్నట్లుగా సీమని పొగుడుతూనే ఉంది.

"మరీ తెల్లగా ఉంది... తేలిపోయినట్టు" అన్నాడు కావ్య తండ్రి.

కావ్యకి ఎగిరి గంతేయాలనిపించింది.

"మీ తండ్రీకూతుళ్ళకి ఎవరూ నచ్చరు. అందరికీ వంకలు పెడతారు. ఎందుకా కుళ్ళు!" అనేసింది.

కావ్య, ఆమె తండ్రి మొహాలు చూసుకున్నారు.

●●●

పొద్దున్నే లేవగానే ఆ రోజు బ్రేకింగ్ న్యూస్.

టీవీ ఛానల్స్, వార్తాపత్రికలు అన్నింట్లో ఒకటే వార్త.

మానస కంపెనీ బిల్డింగ్ పైనుంచి దూకి ఆత్మహత్య చేసుకుందనే వార్త ప్రకంపనలు సృష్టిస్తోంది.

ఆ రోజు శనివారం కావటంతో ఆఫీస్ లేదు. ఒకరికొకరు ఫోన్లు చేసుకుని ఏమై ఉంటుందో చర్చించుకున్నారు.

టీవీ ఛానల్స్ వాళ్ళు కారణాలు వెతకటం మొదలెట్టారు. ఆమె దగ్గర స్నేహితులనీ, బంధువులనీ, కొలీగ్స్‌నీ వివరాలు అడుగుతున్నారు.

"ఆమెకి లవ్ ఎఫైర్ ఉందా? అది ఫెయిలవటం వల్ల చనిపోయిందా?" సాధారణంగా ఎవరు ఆత్మహత్య చేసుకున్నారన్నా వచ్చే మొట్టమొదటి సందేహం ఇదే! కొంతమంది ఈ కోణంలో దర్యాప్తు మొదలెట్టారు.

"ఉద్యోగం నుంచి తీసేశారా? అమెరికాలో ఆర్థిక మాంద్యం కారణంగా జరగబోతున్న లే ఆఫ్‌లే దీనికి కారణమా?" ఒక ఛానల్‌లో చర్చ మొదలైంది. కంపెనీలో పనిచేసే సగంమందికి గుండెల్లో రాయి పడ్డట్ల

యింది. లే ఆఫ్స్ ఉన్నాయా? రేపు మన పరిస్థితేమిటి?"

ఊహించని దారుణానికి షాక్ తిన్న మానస తల్లిదండ్రులు, బయటివాళ్ళు అడిగే ప్రశ్నలకు జవాబులు చెప్పలేక, ఇంట్లో నుంచి బయటికి రావటమే మానుకున్నారు.

ఉద్యోగంలో ఏదో ఫ్రాడ్ చేసిందనీ, అది తెలిసి ప్రశ్నించేసరికి బయటికొస్తుందనే భయంతో ఆత్మహత్యకి పాల్పడిందని కూడా ఒక పక్క వార్తలొస్తున్నాయి.

"సాఫ్ట్‌వేర్ ఉద్యోగాలలో ఒత్తిళ్ళు - దానివల్ల ఆత్మహత్యలు" అంశం మీద ఒక ఛానల్‌లో చర్చ నడుస్తోంది.

•••

మర్నాటికి మానసకీ ఆమె బాయ్‌ఫ్రెండ్‌కీ మధ్య జరిగిన సంభాషణల టేప్‌లు, ఈ మెయిల్స్ బయటికొచ్చాయి.

ఆమె గొంతు ఏ రోజూ విననివారు కూడా ఆమెని జడ్జ్ చేయటం మొదలెట్టారు.

సర్వర్ డేట్స్ వెనక్కి జరిపి ఈ-మెయిల్ సంభాషణలు సృష్టించవచ్చని తెలిసిన వాళ్ళకి కూడా బుర్ర తిరిగేలా ఉన్నాయా మెయిల్స్. తనని వదిలి వేయొద్దని బాయ్‌ఫ్రెండ్‌ని అభ్యర్థిస్తున్న ఈ-మెయిల్స్ ట్రోలింగ్‌లో చూపిస్తున్నారు.

పరువు పోతుందన్న భయంతో ఆమె ఇంట్లో వాళ్ళు ఇన్వెస్టిగేషన్ ఆపేయమంటూ కంపెనీ వాళ్ళనూ, పోలీసులనూ వేడుకున్నారు. ఫలితంగా ఆమె మరణానికి సంబంధించిన న్యూస్, మీడియాలో రావటం ఆగిపోయింది.

ఒక ఛానల్ వాళ్ళు మాత్రం ప్రతిక్షణం, ప్రతి అంగుళాన్నీ రికార్డ్ చేసే సీసీ కెమేరాల టేప్‌లు ఏమయ్యాయనీ, ఆరోజు ఏం జరిగిందో విడుదల చేయాల్సిందేననీ రెండు రోజులు చర్చలు నడిపి ఆపేశారు.

నిజంగానే ఆమె ఆత్మహత్య చేసుకుందా? లేక కావాలని ఎవరైనా ఆమెను పైనుంచి తోసేశారా? ఒకవేళ రెండోది నిజమైతే ఎవరు తోసేశారు? ఆమె బాయ్‌ఫ్రెండా? లేక ఇంకెవరన్నానా? అసలు మానస బాయ్‌ఫ్రెండ్ ఎక్కడున్నాడు? ఇవీ ఆమె గురించి తెలిసిన ప్రతివాళ్ళ మెదళ్ళను వేధిస్తున్న ప్రశ్నలు!

అదే రోజు రాత్రి న్యూలుక్ ఏజెన్సీలో భాగస్వామ్యం ఉన్నవాళ్ళంతా ఒక మందుపార్టీ చేసుకున్నారు. మన జోలికొస్తే ఎవరి పనైనా ఇంతే. ప్రాణాలు పోగొట్టుకోవటమే కాదు. వాళ్ళ జీవితాల మీద చెరపలేని మచ్చ పడాల్సిందే!" గర్వంగా అన్నాడు సీనియర్ డైరెక్టర్.




•••

రెండు రోజులకి ఆఫీస్ మామూలుగా మొదలైంది.

ఒక మనిషి ఆత్మహత్య చేసుకున్న దాఖలాలు ఏమీ లేవు. కావ్యలాంటి వాళ్ళు మాత్రం పార్కింగ్ లాట్‌లోకి ఒంటరిగా వెళ్ళటానికే భయపడుతున్నారు. ఎవరి జీవితపోరాటం వాళ్ళకు తప్పదు కాబట్టి రోజులు ముందుకు జరిగిపోతున్నాయి.

రోహిణి ఇల్లు కొనదల్చుకుంది. ఆమె తల్లిదండ్రులు ఊళ్ళో ఉంటారు. హాస్టల్లో ఉంటూ ఉద్యోగం చేస్తోందామె. ఎక్కడ కొనాలో అందరూ తలా ఒక సలహా పడేస్తున్నారు.

ఆ రోజు అన్ని న్యూస్‌పేపర్స్‌లో పడిన అడ్వర్టైజ్‌మెంట్ ఆమెని ఆకట్టుకుంది. ఇరవై బ్లాకుల్లో పెద్ద ఎత్తున కడుతున్న స్కైలాబ్ అపార్ట్‌మెంట్స్. అపార్ట్‌మెంట్ కాంప్లెక్స్‌లోనే ఒక మాల్, సినిమా థియేటర్, హెలీకాప్టర్ దిగటానికి వీలుగా హెలీపాడ్, క్లబ్‌హౌస్, అన్ని సౌకర్యాలతో కూడిన జిమ్, స్విమ్మింగ్‌పూల్, ఇవన్నీ ఒక ఎత్తయితే, టైమ్ సెట్ చేసి పెడితే ఇంటికొచ్చేసరికి నీళ్ళు వెచ్చబెట్టటం, కుక్కర్‌ని ఆన్ చేయటం లాంటి ఆటోమేటెడ్ సిస్టమ్- ఇవన్నీ ఆమెని బాగా ప్రలోభానికి గురి చేస్తున్నాయి. ఎవరి అపార్ట్‌మెంట్‌లోకి వాళ్ళు డైరెక్ట్‌గా వెళ్ళేలా లిఫ్ట్, ఆఫీస్‌కి అత్యంత దగ్గరగా ఉండటం, అపార్ట్‌మెంట్ ధరలు కూడా రీజనబుల్‌గా ఉండటంతో ఆమె ధ్యాస వాటి మీదే ఉంది.

స్నేహితులతో వెళ్ళి చూసొచ్చింది. ఒక బ్లాక్ కట్టటం మొదలెట్టారప్పుడే.

"ఇంత తక్కువమంది పని చేస్తున్నారేమిటి? ఇంకో ఆరు నెలల్లో రెడీ అవుతాయన్నారు. పట్టుమని పదిమంది కూడా పని చేయట్లేదు" సందేహం వెలిబుచ్చిందామె స్నేహితురాలు.

పైగా పనిచేసేవాళ్ళు కూడా మహానటుల్లా అనిపించారు. వీళ్ళు చూస్తున్నప్పుడు ఏదో ఇనుప దిమ్మెల్ని కోసినట్టు, ఇటుకలు మోసినట్టు చేస్తున్నారు. వాళ్ళు కాస్త పక్కకి వెళ్ళారనిపించగానే విశ్రాంతి తీసుకుంటున్నట్లు అనిపించింది.

వాళ్ళ మార్కెటింగ్ చూసి కొనాలనిపిస్తోంది రోహిణికి.

స్నేహితులు వారిస్తుంటే ఆలోచనలో పడింది.

•••

"దేవుడా! ఎన్నాళ్ళు నన్ను పరీక్షిస్తావు?" ఫేస్‌బుక్‌లో రమేష్ స్టేటస్ అప్‌డేట్ చేశాడు.

"ఎందుకు? ఏమైంది?" అందరూ కామెంట్స్ పెడుతున్నారు.

"ఊర్లో ఉన్న స్థలం అమ్మి, సేవింగ్స్‌తో పాటు బ్యాంక్ లోన్ కూడా తీసుకుని స్కైలాబ్ అపార్ట్‌మెంట్స్‌కి కట్టాను. వాళ్ళదంతా మోసమనీ, అపార్ట్‌మెంట్స్‌కోసం జనం కట్టే డబ్బులన్నీ వేరే ప్రాంతంలో రోడ్లు వేసే కాంట్రాక్ట్‌లకి తరలించారనీ పేపర్లో వార్తలొచ్చాయి. ఎండీని అరెస్ట్ చేశారట ఈరోజు. నేను బ్యాంక్ ఇన్‌స్టాల్‌మెంట్లు కట్టక తప్పదు. ప్రస్తుతం ఉన్న ఇంటికి రెంట్ కట్టకా తప్పదు. నిండా మునిగాను" రిప్లయ్ ఇచ్చాడతను.

'సాఫ్ట్‌వేర్ వాళ్ళని అందరూ ఇంత తేలిగ్గా మోసం చేస్తారేమిటి? తామేమో గూగుల్ ప్రసాదించే పరిజ్ఞానంతో, ఫేస్‌బుక్‌లో, వాట్సాప్‌లో తెలివైన వాళ్ళలా చర్చలకి దిగుతుంటాము. కానీ ఏ గన్నాయ్ అయినా సరే తమకి తేలిగ్గా చెవుల్లో పువ్వులు పెట్టేస్తారు" అమ్మో! ఇంకా నయం. తను కూడా డబ్బు కట్టేయలేదు" అనుకుంది రోహిణి.

•••

ఈ మధ్య ఏ పని చేయాలన్నా ఆయాసంగా ఉంటోంది రోహిణికి.

చెకప్‌కోసం డాక్టర్ దగ్గరకొస్తూ కావ్యని తోడుగా తీసుకెళ్ళింది.

"సినిమా థియేటర్, మాల్ అన్నీ రెండడుగుల దూరంలో కావాలనుకున్నావు కదా. చేయెత్తి తలుపు తీసే పని కూడా లేకుండా బయోమెట్రిక్ సిస్టమ్... ఇంకా లావయ్యేదానివి. మరి కాస్త ఆయాసంతో చస్తావు" దారి మొత్తం దెప్పుతూనే ఉంది కావ్య.

డాక్టర్ దగ్గరకి పంపేముందు వయసు, ప్రొఫెషన్ ఇతర వివరాలు సేకరిస్తున్నారు. సాఫ్ట్‌వేర్ ఇంజనీర్ అని కనబడగానే ముందు విటమిన్ - డి టెస్ట్‌కి పంపుతున్నారు.

విటమిన్-డి, బీట్వెల్వ్ ఆమెకి ప్రమాద స్థాయిలో పడిపోయాయని టెస్ట్‌ల్లో తేలింది. రెండు నెలలకి సరిపడా సప్లిమెంట్లు, రోజూ పొద్దున ఎండలో కాసేపు వాకింగ్ చేయమని ప్రిస్క్రిప్షన్‌లో రాసింది డాక్టర్. రెండు నెలల తర్వాత మళ్ళీ వచ్చి టెస్టులు చేయించుకోమంది.

•••

ఆఫీస్ బయట ఖాళీస్థలంలో సిమెంటు బెంచీల మీద కూర్చున్నారు కావ్య, రోహిణి.

ఆ రోజు వాకింగ్‌కి వెళ్ళనందుకు రోహిణికి క్లాస్ పీకుతోంది కావ్య.

"లావైపోతున్నావు ఇప్పటికే. ఇంకా పెరిగితే కంట్రోల్ అవటం కూడా కష్టం. రేపు నీ పెళ్ళిలో బండ పెళ్ళికూతురులా ఉంటావా? చక్కగా ఉండాలని లేదా?" అని పక్కకు తిరిగింది.

అక్షయ్ ఉన్నాడక్కడ. తనని ఎగాదిగా చూసినట్లనిపించిందామెకి. మొహంలో వ్యంగ్యంతో కూడిన నవ్వు. కళ్ళలో నీళ్ళు తిరిగాయి ఆమెకి.

"నేనేం లావుగా లేను. అంత వెటకారం అవసరం లేదు" రోషంగా అంటూ లేచి వెళ్ళబోయింది.

గభాల్న ఆమె చేయి పట్టుకున్నాడు అక్షయ్. అది ఆపటానికి పట్టుకున్నట్టుగా అనిపించలేదామెకి. పట్టుకోవటానికి ఆపినట్లుగా ఉంది. వెనక్కి తిరిగింది. మోకాళ్ళ మీద, కింద కూర్చొని "కావ్య" అన్నాడు అక్షయ్.

***(ఇంకావుంది)***

# వేడుకని ఇలా ఆహ్వానించండి!



ఎన్నో ఆశలు, ఆశయాలు మోసుకుంటూ కొత్త సంవత్సరంలోకి అడుగు పెట్టబోతున్నాం. చిన్నా పెద్దా తేడా లేకుండా అందరూ నూతన సంవత్సర వేడుకల్లో పాల్గొంటారు. మరికొద్ది రోజుల్లో ఆంగ్ల నూతన సంవత్సరం రాబోతుంది. ఈ సందర్భంగా వివిధ దేశాల్లో ప్రజలు కొత్త సంవత్సరం వేడుకలను ఎలా జరుపుకుంటారో చూద్దామా!

డిసెంబరు 31న వివిధ వేడుకల్లో పాల్గొని ఆ రాత్రి 12 గంటల వరకు మేల్కొంటాం. 12 గంటలు కాగానే కొత్తసంవత్సరానికి ఆహ్వానం పలుకుతాం. ఎలాంటి ఒడిదుడుకులూ లేకుండా జీవితం హాయిగా జరిగిపోవాలని కోరుకుంటారు కదా! అయితే జనవరి 1నే నూతన సంవత్సరంగా వేడుకలు చేసుకునే వారిలో కూడా విచిత్రమైన సంప్రదాయాలున్నాయట. అవేంటో తెలుసుకోండి!!

## ఆఫ్రికాలో

ఆఫ్రికాలోని పలు దేశాల్లో కుటుంబ సభ్యులు, స్నేహితులతో కలిసి న్యూ ఇయర్ వేడుకలను అత్యంత ఉత్సాహంగా సెలబ్రేట్ చేసుకుంటారు. ఇక్కడి ప్రజలు చర్చ్ గంటలు మోగించడం ద్వారా కొత్త సంవత్సరానికి ఆహ్వానం పలుకుతారు. లావిష్ డిన్నర్, మ్యూజిక్, డ్యాన్స్‌లతో ఎంజాయ్ చేస్తారు. ముఖ్యంగా దక్షిణాఫ్రికా రాజధాని కేప్‌టౌన్‌లోని ద విక్టోరియన్, ఆల్ఫ్రెడ్ వాటర్ ఫ్రంట్‌ల వద్ద జరిగే ఉత్సవాలు ఆఫ్రికాలోనే ఎంతో పాపులర్. సౌత్ ఆఫ్రికాలోని ప్రజలు పాత వస్తువులను ఇళ్లల్లో నుంచి బయట పారేస్తారు. అంటే ఇంటిని శుభ్రం చేసి నూతన సంవత్సరానికి స్వాగతం పలుకుతారు.





## యూరప్‌లో

ఇక యూరప్ విషయానికి వస్తే అక్కడున్న ఒక్కో దేశానిది ఒక్కో తరహా. ముఖ్యంగా ఫ్రాన్స్‌లో జనవరి ఒకటి నుంచి ఆరు వరకు సెలవు దినాలు పాటిస్తారు. జనవరి 6న ప్రత్యేకంగా తయారు చేసిన కేకు కట్ చేయడం ద్వారా కొత్త సంవత్సర వేడుకలకు ముగింపు పలుకుతారు. ఇంగ్లండ్‌లో ఆకట్టుకునే విషయమేంటంటే న్యూ ఇయర్ క్రుయిజెస్. ఇవి ప్రత్యేక ఆకర్షణతో నిలుస్తాయి. తర్వాత ఇక్కడ కొన్ని ఆనవాయితీలు కూడా ఉన్నాయి. అందులో ముఖ్యమైనది ఫస్ట్ ఫుటింగ్. కొన్ని శతాబ్దాలుగా వస్తున్న ఈ ఆనవాయితీని బ్రిటన్ ప్రజలు ఇప్పటికీ ఆచరిస్తున్నారు. కొత్త సంవత్సరం తొలి రోజున తమ ఇంటికి వచ్చే అతిథి అదృష్టాన్ని తీసుకొస్తారని నమ్ముతారు. అయితే ఆరోజు మహిళలను అతిథులుగా ఆహ్వానించరు. ఇది దురదృష్టంగా భావిస్తారు. ఇటలీ విషయానికొస్తే అక్కడి ప్రజలు సంప్రదాయక వంటకాలతో బాణాసంచా కాలుస్తూ, ప్రొసెకో అనే ఇటాలియన్ స్పెషల్ వైన్‌తో కొత్త సంవత్సరాన్ని ఉత్సాహంగా జరుపుకుంటారు.

## జర్మనీ

సరిగ్గా డిసెంబర్31 అర్థరాత్రి 12 గంటలు కాగానే అక్కడి ప్రజలందరూ 'డిన్నర్ ఫర్ వన్' అనే టీవీ ప్రోగ్రాం తప్పక చూస్తారట. ఆ తర్వాతే సందడి చేస్తారట. దేశంలో ఎక్కడున్నా ప్రజలందరూ చూసే విధంగా అక్కడున్న టీవీ స్క్రీన్లలో ఈ ప్రోగ్రాం వేస్తారు.

## నెదర్లాండ్స్

నెదర్లాండ్స్‌లో రెండవ ప్రపంచ యుద్ధానికి గుర్తుగా పాల డబ్బాలలో కార్బైడ్, నీరు కలిపి ఒక చోట ఉంచి డిసెంబర్ 31 అర్థరాత్రి 12 తరువాత ఆ డబ్బాలను వేడిచేసి గాలిలోకి ఎగరవేస్తారు.

## స్కాట్లాండ్

ఈ దేశంలో డిసెంబర్ 31 అర్థరాత్రి 12 దాటగానే కాగడాలతో తలమీద, శరీరం చుట్టూ నిప్పును తిప్పుతూ నూతన సంవత్సరానికి స్వాగతం పలుకుతారు. ఇక్కడ ఇలా చేస్తే ఈక్విడార్‌లో దిష్టి బొమ్మలను తగలబెడతారు. ఇక చిలీలో చనిపోయిన తమ సన్నిహితులను కూడా తలుచుకుని నూతన సంవత్సరానికి ఆహ్వానం పలుకుతారు.

## స్పెయిన్

స్పెయిన్ దేశంలో కూడా చాలా ఆడంబరంగా ఉత్సవం జరుపుకుంటారు. ఆదేశంలో డిసెంబరు 31న అర్థరాత్రి 12 దాటగానే అక్కడి ప్రజలు 12 ద్రాక్ష పళ్లు తింటారట. ద్రాక్షపండును సంతోషానికి చిహ్నంగా వారు భావిస్తారు. రాబోయే 12 నెలలూ తమ జీవితాల్లో సంతోషం మాత్రమే ఉండాలని వారి కోరిక.

## ఫిలిప్పైన్స్

ఫిలిప్పైన్స్‌లో న్యూ ఇయర్‌ని కాస్త వినూత్నంగా సెలబ్రేట్ చేసుకుంటారు. అక్కడ గుండ్రని పదార్థాలను ఎక్కువగా తింటారు. గుండ్రని పదార్థాలు ఆర్థికంగా బలం తెచ్చిపెడతాయని వారి విశ్వాసం. అందుకే గుండ్రంగా ఉండే పండ్లు ఎక్కువగా తింటారు.

- కీర్తి

# కొట్టుకున్న ప్రాణం

-రావులపాటి వెంకటరామారావు



**దిగులుగా ఇంట్లోకి అడుగుపెట్టాడు. అతని దిగులు మొహం చూసి సంగతేమిటని అడిగింది భార్య. మాట్లాడకుండా నీరసంగా కుర్చీలో కూలబడ్డాడు. విషయం చెప్పమని మళ్ళీ అడిగింది. మొహం అటు తిప్పు కుని కూర్చున్నాడుగానీ వివరం చెప్పలేదు. మొహం తిప్పిచూసి నోరు వెళ్ళబెట్టింది. అతని కళ్ళ వెంట నీళ్ళు.**

అతని ఎదురుగా మోకాళ్ళ మీద కూలబడింది. ఒంటిమీద చెయ్యి వేసి అనునయంగాచూసి 'ఏం జరిగింది?' అని నింపాదిగా అడిగింది. అప్పుడూ మౌనమే. లోపల ఏం రాజుకుంటోందోనని ఆమెలో ఆందోళన. బైటకు వెళ్ళేటప్పుడు హుషారుగానే ఉన్నాడు. గుర్తుగా ఏదో చెణుకు విసిరాడు భార్య మీద. నవ్వుతూ రిటార్ట్ ఇచ్చింది ఆమె.

'ఏమన్నా తేవాలా?' అడిగాడు.

'ఏం తెస్తారు. ఐదు వందలు, వెయ్యినోట్లు చెల్లట్లేదుగా, వందనోట్లు అసలే లేవు. ఏటీఎంలకి డబ్బులేని జబ్బుచేసింది. మాల్స్‌లో సరుకులున్నాయి గానీ ప్లాస్టిక్ డబ్బుకు 'నో' అంటున్నాయి.

'నా ప్రతిభ నీకు తెలియదా' అని అనుకుంటూ ముందుకు సాగాడు. ఈల వేసుకుంటూ వెళ్ళిన గుర్తు ఆమెకు. ఈల వేశాడంటే మహామహాగా ఉన్నట్లు ఆ కాలనీకంతా తెలుసు!

వెళ్ళిన రెండు గంటలకు ఇదిగో ఈ అవతారంతో వచ్చాడు. మళ్ళీ మళ్ళీ ప్రయత్నం చేసింది. అడిగింది. బ్రతిమలాడింది. బావురుమనడం ఒక్కటే తక్కువ. సహనం జారిపోతోంది. ఏం చేయాలి? 'కాఫీ యిస్తా' అంటూ లేవబోతే వద్దని తల అడ్డంగా ఊపాడు. కుర్చీలో వెనక్కివాలి కళ్ళు మూసుకున్నాడు.

'మీ అన్నయ్యగారు ఏమన్నా అన్నారా' తల అడ్డంగా ఊపాడు.

'ప్రాజెక్ట్ విషయంలో ఏమన్నా తేడావచ్చిందా' అదే తల ఊపాడు.

'మీ నాన్నగారి ఆరోగ్యం గురించి ఏదైనా కబురొచ్చిందా.'

ఉలుకూ పలుకూలేదు. 'మరేమైంది చెప్పండి. కాలూ చెయ్యీ ఆడక ఛస్తున్నాను. నీరసంగా ఉందా? ఎండనపడి వచ్చారు. కాస్త నిమ్మకాయ పిండిన మజ్జిగ ఇవ్వనా' మాట్లాడలేదు. అవుననికాని కాదనికాని తల ఊపలేదు. ఏవిటీ, ఈ మనిషి ఇట్లా అయ్యాడు. పెళ్ళైన పాతికేళ్ళలో ఎన్నడూ ఇట్లాలేదు. పిల్లగాడి పైచదువులకు ఇబ్బందులుపడ్డా తొణుకూ బెణుకూ లేకుండా ముందుకు సాగాడు. అప్పోసప్పో చేసి అయిందనిపించాడు, నవ్వుతూనే!

తను, పిల్లపెళ్ళికి సంబంధమని, ఇదనీ అదనీ బెంబేలుపడితే లెక్కచేయక తలాయించి ఏదోచేసి 'ఇంకేదో జేసి అంగరంగ వైభవంగా చేశాడు పెళ్ళి! అప్పు మిగిలింది. ఉన్న దాంట్లోనే కాస్తో కూస్తో మిగిల్చి చాలావరకు అప్పు తీర్చాడు. చేదోడుగా పిల్లగాడు ఎదిగొచ్చి ఉద్యోగం చేస్తూ అది కూడా తీర్చేట్లు చేశాడు.

ఇంకేం తీపరం... కడుపులో చల్ల కదలకుండా ఉద్యోగం చేసుకుంటూ గౌరవంగానే నెట్టుకొస్తున్నాంగా మరేమైంది! బజారుకు వెళ్ళేంతవరకూ హుషారుగానే ఉన్నాడు.

మళ్ళీ కాళ్ళమీద కూలబడి "ఏంటిది చిన్నపిల్లాడిలా! ఎంతసేపు ఏడిపిస్తారు నన్ను, విషయం చెప్పకుండా! చెబితేనేగా విషయం తెలిసేది. షుగరేమైనా డౌన్ అయ్యిందా, లేక లో బి.పి వచ్చిందా? నాకు కంగారుగా ఉంది. సరే మాట్లాడకండి. విషయం మీరే దాచుకోండి. పదండి అన్నం తిందాం!" బతిమాలుతున్నట్టుగా లోగొంతులో మాట్లాడుతూ చేత్తో కాలురాయడం మొదలెట్టింది. కళ్ళువిప్పి సైగచేశాడు కాలు ముట్టుకోవద్దని. వెనక్కి తీసుకున్నాడు కాలుని. మళ్ళీ తనలోకి జారిపోయాడు.

'అవునూ అడగడం మరచిపోయాను, కారు బానే ఉందా? లేక ఎవరినైనా గుద్దారా.. లేదూ ఎవడైనా మనకారుకు డాష్ ఇచ్చాడా, తాళాలేవి? నేను చూసి వస్తాను" అంటూ లేచి నిలబడితే.

ప్యాంట్ జేబులో నుంచి వాటిని తీసి టేబుల్‌మీద పడేశాడు.

'కారు బానే ఉంది' అని నోటినుండి ముత్యాలు రాలాయి!

"హమ్మయ్య, మీ నోట మాట ఊడిపడింది. నా మనసు కుదుట పడింది. ఇహ చెప్పండి అని అతని చేయి పట్టుకుంది. వెన్న కరిగినట్లు, పేరిన్నెయ్యి కరుగుతున్నట్లు మూసుకున్న కళ్ళు విప్పారి, మళ్ళీ మూతలు పడి పెదిమలు మాట్లాడటానికి కదిలించగా వణకడం మొదలెట్టాయి. గొంతు పెగలని కారణం బైటకు రాని మాట అలాగే ఆగిపోయింది. కళ్ళు ధారాపాతాలైనాయి. మౌనంగా భర్తవైపు కళవళ పడుతూ చూసింది ఆమె. పక్కన కూర్చుంది.

భుజం చుట్టూ చెయ్యివేసి తనవైపు లాక్కుంది. అప్పుడు సన్నగా మొదలై ఉధృతమైంది మాట బయటకు వచ్చి.

"అది... అది... అలా అవుతుందనుకోలేదు. నేను మామూలుగానే డ్రైవ్ చేస్తున్నాను. అంతలో..." వింటున్నట్లుగా తలాడిస్తోంది ఆమె. "గ్లాసు నుండి ముందుకు అంటే కిందికి చూద్దునుగదా, బుజ్జి పావురంపిల్ల నడిరోడ్డుమీద తత్తరపాటుతో అటూయిటూ తిరుగుతోంది. గజిబిజిగా ఇంతలో నా కుడి పక్కనుండి వేగంగా మోటార్ బైక్ కనబడి మాయమైంది రెప్పపాటులో. స్టీరింగు నేను ఎడమ వైపుకి తిప్పాను. ఆటో ఎడమవైపు నుండి నన్ను

**ఈలవేసుకుంటూ హుషారుగా బజారుకు వెళ్ళాడతను. రెండు గంటల తర్వాత బేలగా ఇంటికి తిరిగి వచ్చాడు. భార్యను పలకరించ లేదు. మౌనంగా కూర్చున్నాడు. అతడి కళ్ళ నిండా నీళ్ళు! భార్య భయపడింది. అనేక విధాలుగా సందేహించింది. విషయం రాబట్టేందుకు శతవిధాలుగా అతణ్ణి ప్రశ్నించింది. అనునయించింది. చివరకు ఎలాగో నోరు తెరిచాడు. ఇంతకూ అతడు చెప్పింది ఏమిటి? అసలేం జరిగింది?**

ఓవర్ టేక్ చేయబోయింది. నా అటెన్షన్ డిస్ట్రార్బ్ అయింది. వాణ్ణి తప్పించి రోడ్డు మధ్యలో నేను బ్రేక్‌వేసే సమయంలేదు. అరె... పావురం పిల్ల అని అనుకుంటూనే ఉన్నాను. టప్‌మని చప్పుడై ఎడమ వెనక ఎడమవైపు టైర్... ఎత్తు నుండి నెమ్మదిగా దిగినట్లైంది.

"ఏమైంది పావురం పిల్ల" ఆత్రంగా అడిగింది ఆమె.

"నాకు కనబడలేదు. బ్రేక్‌వేశాను అప్పుడు... ఏమీ కనిపించలేదు. తప్పించుకుందిలే అని అనుకుని ఎక్సలేటర్ నొక్కాను".

"హమ్మయ్య తప్పించుకుందన్నమాట..."

"నేనూ అదే అనుకున్నాను. అని ముందుకు సాగి ఏదో అనుమానంవచ్చి రీర్ మిర్రర్‌లో వెనక్కి చూశాను. పత్తి ఏకినప్పుడు దూదిపింజల్లా గాల్లో ఎగిరినట్టు రెక్కలు... ఈకలు గాలిలో ఎగురుతున్నాయి. పక్కకుతీశాను కారు.. ఏముంది నలిగిన పిల్లపక్షి అచేతనంగా... రెక్కలు ఊడి రోడ్డు మీద".

"చనిపోయిందా... అయ్యో... అయ్యో".

"అనుకుంటా... కాదు... చచ్చింది... కాదు కాదు... నేనే చంపేశాను. అయ్యోపాపం అనుకున్నాను. నేరంచేసి కూడా తప్పించు కొచ్చాను. ఎలా వచ్చానో నాకే తెలియదు" అంటూ జీర బోయిన గొంతు సవరించుకున్నాడు.

"హడలిచచ్చాను, ఇంకేం ఘోరం జరిగిందోనని. పోనీలేండి. దానికి నూకలు చెల్లాయి భూమ్మీద... లేవండి భోం చేద్దాం".

"నేను తినను. తినబుద్ధి కావట్లేదు... అది రోడ్డుమీద గజిబిజిగా తిరుగుతున్న దృశ్యమే గుర్తుకు వస్తున్నది. పాపం చేశాను".

"ఇంకానయం మనిషిని గుద్దలేదు. గుడ్డిలో మెల్ల."

"అదికూడా ప్రాణమేగా" అని భోరుమన్నాడు.

"పసిప్రాణం ఎంత విలవిలలాడిందో" అన్నాడు మళ్ళీ!

అలా అరగంట వరకు వెక్కుతూనే ఉన్నాడు అరవైఏళ్ళ భర్త. అలా భర్తను చూస్తూ కూర్చునే ఉంది జారగిలబడి, భార్య.

**సెల్:98480 33150**

## మనమీదేనర్రోయ్!

సరసి



డబ్బులు కావాల్సినపుడల్లా అబ్బాయి కార్డు గీకుతాడు!

వీడూ అంతేగా.. డబ్బులు కావాల్సినపుడల్లా నా వీపు గోకుతాడు!



# సౌభాగ్య చక్రం

డిసెంబర్ 21 నుంచి
డిసెంబర్ 27 వరకు

శ్రీ బిజుమళ్ళ బిందుమాధవశర్మ



**మేషం (మార్చి 21 - ఏప్రిల్ 20 మధ్య పుట్టినవారు)**

కీలక నిర్ణయాలు, ఇంక్రిమెంట్లు, వృత్తిపరమైన సమావేశాలు, వేడుకలకు ఈ వారం అనుకూలం. బుధ, గురు, శుక్రవారాల్లో సమావేశాల్లో మాటపడాల్సి వస్తుంది. శ్రీవారు, శ్రీమతి విషయాల్లో శుభపరిణామాలు సంభవం. ప్రముఖులతో పరిచయాలు ఏర్పడతాయి. 24,25 తేదీల్లో ఆర్థిక విషయాల్లో ప్రముఖుల సహకారం అందుకుంటారు. ఉద్యోగ, వ్యాపారాల్లో లక్ష్య సాధనకు గత అనుభవం తోడ్పడుతుంది. పెద్దల ఆరోగ్యం కలవరపెడుతుంది. 26,27 తేదీల్లో ప్రణాళికాబద్ధంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. సమావేశాలు, ప్రయాణాల్లో అసౌకర్యం కలిగే అవకాశం ఉంది. పెద్దల కారణంగా మనస్తాపం కలుగుతుంది.



**వృషభం (ఏప్రిల్ 21 - మే 21 మధ్య పుట్టినవారు)**

ఉన్నత విద్య, దూరప్రయాణాలు, వృత్తి, వ్యాపారాలు, బృందకార్యక్రమాలకు ఈ వారం ప్రోత్సాహకరం. బుధ, గురు, శుక్రవారాల్లో సన్నిహితుల ఆరోగ్యం కలవరపెడుతుంది. అంచనాలు తప్పే అవకాశం ఉంది. వృత్తి, వ్యాపారాల్లో లక్ష్యాలు సాధిస్తారు. సమావేశాలు, విందుల్లో పాల్గొంటారు. 24,25 తేదీల్లో శ్రీవారు, శ్రీమతి విషయాల్లో శుభపరిణామాలు సంభవం. స్పెక్యులేషన్లు, ఆర్థిక లావాదేవీల్లో అంచనాలు ఫలించకపోవచ్చు. 26,27 తేదీల్లో ఆర్థికపరమైన సమావేశాలకు అనుకూలం. రుణప్రయత్నాలు ఫలించకపోవచ్చు. డిపాజిట్లు, పొదుపు పథకాల్లో నిరాశ ఎదురయ్యే అవకాశం ఉంది.



**మిథునం (మే 22 - జూన్ 21 మధ్య పుట్టినవారు)**

ఆరోగ్యం, ఆర్థిక సంస్థలతో పనులు, బృందకార్యక్రమాలకు ఈ వారం ప్రాధాన్యం ఇస్తారు. బుధ, గురు, శుక్రవారాల్లో చిన్నారులు, ప్రియతముల ఆరోగ్యం కలవరపెడుతుంది. ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం విలువైన వస్తువులు సమకూర్చుకుంటారు. 24,25 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో గత అనుభవంతో లక్ష్యాలు సాధిస్తారు. ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపాలి. సహోద్యోగుల ఆంతరంగిక విషయాల్లో జోక్యం చేసుకోవాల్సి రావచ్చు. 26,27 తేదీల్లో బహుమతులు ఇచ్చిపుచ్చుకుంటారు. స్పెక్యులేషన్లలో నష్టం సంభవం. భాగస్వామి కోసం ఖర్చులు అంచనాలు మించుతాయి. ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపించాలి.



**కర్కాటకం (జూన్ 22 - జులై 22 మధ్య పుట్టినవారు)**

వేడుకలు, శుభకార్యాలు, సినీ, రాజకీయ విషయాలు, ఆరోగ్య అంశాలకు ఈ వారం అనుకూలం. బుధ, గురు, శుక్రవారాల్లో భాగస్వామి వైఖరి ఆవేదన కలిగిస్తుంది. కుటుంబ సభ్యుల వైఖరి ఆవేదన కలిగిస్తుంది. వేడుకలు, శుభకార్యాలకు ఏర్పాట్లు చేస్తారు. రియల్ ఎస్టేట్ రంగంలోని వారికి శుభప్రదం. 24,25 తేదీల్లో ప్రేమానుబంధాలు బలపడతాయి. స్పెక్యులేషన్లకు దూరంగా ఉండాలి. ఖర్చులు అంచనాలు మించుతాయి. 26,27 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో ప్రోత్సాహకరం. కొత్త పరిచయాలు ఏర్పడతాయి. ప్రియతముల ఆరోగ్యం మందగిస్తుంది. లక్ష్య సాధనలో ఆటంకాలు ఎదురవుతాయి.



**సింహం (జులై 23 - ఆగస్టు 23 మధ్య పుట్టినవారు)**

వృత్తి, వ్యాపారాలు, ఆరోగ్యం, స్పెక్యులేషన్లు, వేడుకలు, ప్రేమానుబంధాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురు, శుక్రవారాల్లో సన్నిహితుల ఆరోగ్యం కలవరపెడుతుంది. ఇంటర్వ్యూలలో విజయం సాధిస్తారు. కొత్త స్నేహాలు చిగురిస్తాయి. 24,25 తేదీల్లో రియల్ ఎస్టేట్, నిర్మాణ రంగాల వారు లక్ష్యాలు సాధిస్తారు. చేపట్టిన పనులు పట్టుదలతో పూర్తి చేస్తారు. బదిలీల కోసం చేసే ప్రయత్నాలు ఫలించకపోవచ్చు. 26,27 తేదీల్లో అడ్వర్టయిజ్‌మెంట్లు, విద్యారంగాల వారు లక్ష్యాలు సాధిస్తారు. విద్యార్థులకు లక్ష్య సాధనలో ఆటంకాలు ఎదురయ్యే అవకాశం ఉంది.



**కన్య (ఆగస్టు 24 - సెప్టెంబర్ 22 మధ్య పుట్టినవారు)**

ప్రేమానుబంధాలు, పెట్టుబడులు, వృత్తిపరమైన నిర్ణయాలు, ఆరోగ్యంపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురు, శుక్రవారాల్లో ఆర్థిక విషయాల్లో అంచనాలు తప్పే అవకాశం ఉంది. పెట్టుబడులు లాభిస్తాయి. ప్రియతముల కోసం విలువైన వస్తువులు సేకరిస్తారు. 24,25 తేదీల్లో విద్యార్థులకు శుభప్రదం. చర్చలు, పర్యటనలు లాభిస్తాయి. కాంట్రాక్టులు, అగ్రిమెంట్ల విషయంలో పొరపాట్లు దొర్లే అవకాశం ఉంది. 26,27 తేదీల్లో బంధుమిత్రుల రాక ఆనందం కలిగిస్తుంది. బదిలీలు, మార్పులు అసౌకర్యం కలిగిస్తాయి. ప్రియతముల వైఖరి ఆవేదన కలిగిస్తుంది.



**తుల (సెప్టెంబర్ 23 - అక్టోబర్ 23 మధ్య పుట్టినవారు)**

వేడుకలు, గృహోపకరణాల సేకరణ, ప్రేమానుబంధాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురు, శుక్రవారాల్లో బదిలీలు, మార్పులు అసౌకర్యం కలిగిస్తాయి. రియల్ ఎస్టేట్, నిర్మాణరంగాల వారికి శుభప్రదం. వేడుకలకు ఏర్పాట్లు చేస్తారు. 24,25 తేదీల్లో ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. పెట్టుబడుల విషయంలో ఆచితూచి వ్యవహరించాలి. డబ్బు విషయంలో మీ వైఖరిని సమీక్షించుకుంటారు. 26,27 తేదీల్లో సోదరీసోదరుల విషయాల్లో ప్రోత్సాహకరం. కాంట్రాక్టులు, అగ్రిమెంట్ల విషయంలో ఆచితూచి వ్యవహరించాలి. చర్చలు, ప్రయాణాల్లో నిదానం అవసరం.



**వృశ్చికం (అక్టోబర్ 24 - నవంబర్ 22 మధ్య పుట్టినవారు)**

విద్యా విషయాలు, వృత్తిపరమైన సమావేశాలు, బదిలీలు, వేడుకలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురు, శుక్రవారాల్లో ఒక సమాచారం కలవరం కలిగిస్తుంది. ప్రయాణాల్లో నిదానం అవసరం. విద్యార్థులకు శుభప్రదం. సినీరాజకీయ రంగాల వారు కీలక సమాచారం అందుకుంటారు. 24,25 తేదీల్లో సోదరీసోదరుల వ్యవహారాలపై దృష్టి పెడతారు. ఇంటర్వ్యూలలో నిరాశ తప్పకపోవచ్చు. ప్రయాణాల్లో నిదానం అవసరం. 26,27 తేదీల్లో విలువైన పత్రాలు అందుకుంటారు. ఆర్థిక విషయాల్లో తొందరపాటు కారణంగా నష్టపోయే అవకాశం ఉంది. చెక్కులు, బిల్లులు సకాలంలో అందక ఇబ్బంది పడతారు.



**ధనుస్సు (నవంబర్ 23 - డిసెంబర్ 21 మధ్య పుట్టినవారు)**

పెట్టుబడులు, ఇంక్రిమెంట్లు, విద్యా విషయాలు, స్థిరచరాస్తి విషయాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురు, శుక్రవారాల్లో పెట్టుబడుల్లో ఆచితూచి వ్యవహరించాలి. సమావేశాలకు ఏర్పాట్లు చేస్తారు. ఆర్థికంగా ప్రోత్సాహకర సమయం. 24, 25 తేదీల్లో ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలకు అవసరమైన నిధులు సర్దుబాటవుతాయి. రాజకీయ, సినీరంగాలవారికి నిరుత్సాహకరంగా ఉంటుంది. 26,27 తేదీల్లో కొత్త ఆదాయమార్గాల అన్వేషణ ఫలిస్తుంది. ఆర్థిక విషయాల్లో కీలక నిర్ణయాలకు తగిన సమయం కాదు. విలువైన వస్తువులు భద్రం.



**మకరం (డిసెంబర్ 22 - జనవరి 20 మధ్య పుట్టినవారు)**

కొత్త ప్రాజెక్టులు, పెట్టుబడులు, విద్యా విషయాలు, సమావేశాలకు ఈ వారం ప్రాధాన్యం ఇస్తారు. బుధ, గురు, శుక్రవారాల్లో కీలక నిర్ణయాల అమలుకు ఇది తగిన సమయం కాదు. వృత్తి వ్యాపారాల్లో ప్రోత్సాహకరం. ప్రముఖులను కలుసుకుంటారు. 24, 25 తేదీల్లో సమావేశాలు, బృందకార్యక్రమాల్లో కీలకపాత్ర పోషిస్తారు. ఆర్థిక విషయాల్లో కీలక నిర్ణయాలకు ఇది సమయం కాదు. 26,27 తేదీల్లో ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలకు అనుకూలం. మనశ్శాంతి లోపిస్తుంది. రాజకీయ, సినీరంగాల వారు తొందరపాటు కారణంగా నష్టపోయే అవకాశం ఉంది.



**కుంభం (జనవరి 21 - ఫిబ్రవరి 18 మధ్య పుట్టినవారు)**

ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలు, ప్రయాణాలు, ఆధ్యాత్మిక కార్యక్రమాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురు, శుక్రవారాల్లో దూరంలో ఉన్న వ్యక్తులకు సంబంధించిన సమాచారం కలవరం కలిగిస్తుంది. ప్రయాణాలు, చర్చలకు అనుకూలం విద్యార్థులకు శుభప్రదం. 24, 25 తేదీల్లో ప్రముఖులను కలుసుకుంటారు. సినీ, రాజకీయ రంగాల వారికి అనుకోని ఆటంకాలు ఎదురయ్యే అవకాశం ఉంది. 26,27 తేదీల్లో సమావేశాలు, వేడుకల్లో పాల్గొంటారు. ఆర్థిక విషయాల్లో కొంత అసౌకర్యం కలుగుతుంది. సన్నిహితులకు సంబంధించిన సమాచారం కలవరం కలిగిస్తుంది.



**మీనం (ఫిబ్రవరి 19 - మార్చి 20 మధ్య పుట్టినవారు)**

పెట్టుబడులు, వేడుకలు, విద్యా విషయాలు, సమావేశాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురు, శుక్రవారాల్లో పెట్టుబడుల్లో ఆచితూచి వ్యవహరించాలి. సన్నిహితుల ఆరోగ్యం కలవరపెడుతుంది. రుణప్రయత్నాలు ఫలిస్తాయి. పూర్వ మిత్రులను కలుసుకుంటారు. 24,25 తేదీల్లో ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలకు అనుకూలం. ఆర్థిక విషయాల్లో మీ అంచనాలు ఫలించకపోవచ్చు. 26,27 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో ఆర్థికంగా లాభిస్తుంది. ప్రముఖుల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. ఉన్నత పదవుల విషయంలో ఆశాభంగం తప్పకపోవచ్చు.




## ఆ టైటిల్ కి సరిపోడట!



బాలీవుడ్‌లో అమీర్‌ఖాన్‌ని అందరూ 'మిస్టర్ పర్‌ఫెక్ట్' అని అంటూంటారు. కానీ ఆ టైటిల్‌కి తాను సరిపోనన్నది అమీర్ వాదన. 'మిస్టర్ పర్‌ఫెక్ట్' అంటే అన్ని విషయాల్లోనూ నిష్ణాతుడై ఉండాలి. కానీ నాకు నటన తప్ప మరేది రాదు. అలాంటప్పుడు నేను ఆ టైటిల్‌కి ఎలా పనికి వస్తాను. నన్ను అభిమానించేవారు ముద్దుగా అలా పిలుస్తారు కానీ, నా దగ్గర అంత సీన్ లేదు అని అమీర్‌ఖాన్ ఇటీవల ఓ ఇంటర్వ్యూలో చెప్పుకొచ్చాడు. అమీర్‌ఖాన్ నిజాయితీ బాలీవుడ్ జనాలకు తెగ నచ్చేసింది! తనలోని లోపాలను నిజాయితీగా ఒప్పుకున్న అమీర్ తప్ప ఆ టైటిల్‌కి ఇంకెవరూ సాటిరారు అంటూ వాళ్ళు ఫిక్సయిపోయారట!

## ఇబ్బందుల్లో షారూఖ్



షారూఖ్ నిజంగా ఇబ్బందుల్లో పడలేదు. ఆయన సినిమా 'రాయీస్' మీద అభ్యంతరాలు వ్యక్తం అవుతున్నాయి. ఈ సినిమాలో కొన్ని అభ్యంతరకర సన్నివేశాలు ఉన్నాయని వాటిని తొలగించాలన్నది ఒక వర్గం వారి డిమాండ్. ఆ సన్నివేశాలు ఉంచితే తమని అవమానించినట్టేనని వారు అంటున్నారు. ఈ మేరకు వారు ఢిల్లీ కోర్టులో పిటిషన్ వేయడమే కాకుండా ప్రధాన మంత్రి దృష్టికి తీసుకువెళ్ళబోతున్నారట! కాకపోతే ఆ సన్నివేశాలు సినిమాకి ఆయువు పట్టు లాంటివని, వాటిని తొలగిస్తే సినిమా భావమే మారిపోతుందని దర్శకనిర్మాతలు వాపోతున్నారు. ఈ గొడవ షారూఖ్‌ఖాన్ మెడకు చుట్టుకునేటట్టు ఉందనీ, ఆయన సినిమాలు చూడవద్దనీ కొందరు అప్పుడే ప్రచారం కూడా మొదలెట్టేశారట! ఈ ప్రచారం తీవ్రమైతే షారూఖ్ నిజంగా ఇబ్బందుల్లో పడ్డట్టే అంటున్నారు.

## కలానికి పదును పెట్టిన లెక్కల మాష్టారు



అదేంటి? లెక్కల మాస్టారు సుకుమార్ ఇప్పుడు కొత్తగా కలానికి పదునుపెట్టడం ఏంటి? అన్న సందేహం వస్తోందా? ఇది నిజం. ఎందుకంటే 'ఆర్య' తరువాత సుకుమార్ సొంతంగా కథ రాసుకుని సినిమాలు తీయలేదు. మొన్న వచ్చిన 'నాన్నకు ప్రేమతో' కూడా తన రైటర్స్ అసోసియేట్‌తో రాయించిందే! అయితే రామ్‌చరణ్‌తో తీయబోతున్న సినిమాకు మాత్రం సుకుమారే స్వయంగా కథ రాస్తున్నాడట! కథ రాయడం దాదాపు పూర్తయిందట! కాకపోతే షూటింగే ఆలస్యం అయ్యేట్టు ఉందట! మొత్తానికి మలిసారి తన పెన్నుకు పదును పెట్టిన సుకుమార్ ఈ సినిమాను కూడా 'ఆర్య' లెవెల్లో బ్లాక్‌బస్టర్ చేస్తాడని అందరూ అంటున్నారు.

## రాజుగారు తగ్గనంటున్నారు



దిల్ రాజ్ నుంచి వస్తున్న 'శతమానం భవతి' సంక్రాంతికి రావడానికి సిద్ధమైపోయింది. ఈ టైములో రెండు పెద్ద సినిమాలు వస్తున్నా తన సినిమాలను సంక్రాంతికే విడుదల చేయడానికి దిల్‌రాజ్ సిద్ధమైపోయాడు. ఆ రెండు సినిమాలతో తమ సినిమాకు ఏమాత్రం పోటీలేదన్నది ఆయన వాదన. తమ సినిమా కుటుంబ కథా చిత్రమని, మిగతా సినిమాలు ఈ టైపు సినిమాలు కావని చెబుతున్నాడు. సంక్రాంతికి వచ్చే కుటుంబ కథా చిత్రాలకు ప్రేక్షకులు పెద్ద పీట వేస్తారన్న నమ్మకం ఒకటుంది. దాన్ని బేస్ చేసుకునే దిల్‌రాజ్ మిగతా పెద్ద సినిమాలతో పోటీ పడుతున్నాడని సినీజనాలు అంటున్నారు.

## మొదటి భార్యే కారణమా?

నిన్న అమల...ఈరోజు మీరా జాస్మిన్. ఇద్దరూ పట్టుమని రెండేళ్ళు భర్తతో కలిసి ఉండకుండానే కోర్టు మెట్లు ఎక్కేశారు. అమల కేసులో అత్తమామలు విలన్లు అయితే, మీరాజాస్మిన్ విషయంలో భర్తే విలన్ అయ్యాడు. అతగాడి వేధింపులు భరించలేక మీరాజాస్మిన్ కోర్టు మెట్లు ఎక్కిందట! ఏరికోరి మరీ చేసుకున్న భర్త అనిల్ ఏడాది తిరక్కుండానే తనకు నరకం చూపించాడన్నది మీరా ప్రధాన అభియోగం. అనిల్‌కి అంతకు ముందే పెళ్ళయి విడాకులు తీసుకున్నాడు. ఆ తరువాత మీరా అతగాడిని పెళ్ళిచేసుకుంది. వృత్తిపరంగా మీరా సక్సెస్‌ఫుల్ హీరోయిన్నే అంటారు. ఆమె నటించిన చాలా సినిమాలకు అవార్డులు పంట పండాయి. కానీ జీవితంలోనే ఫ్లాప్ హీరోయిన్ అయిందని ఆమె అభిమానులు ఆవేదన వ్యక్తం చేస్తున్నారు. ఈ విడాకులకూ, గొడవలకూ అనిల్ మొదటి భార్య కారణమని కొందరు అంటున్నారు.



# ఉన్నమాటంటే ఉలుకెందుకు?

-కంగనా రనౌత్

**బాలీవుడ్ క్వీన్ కంగనా రనౌత్ అనడంలో ఎవరికీ ఎలాంటి సందేహం లేదు. నటనలో ఈ అమ్మడిని బీట్ చేసేవారు సమీప భవిష్యత్తులో ఎవరూ లేరనే అంటారు. అది నిజం కూడా! తనకు తానే నెంబర్ వన్ హీరోయిన్ అని చెప్పుకోగల ధైర్యం ఉన్న ఏకైక స్టార్ హీరోయిన్ కంగనా రనౌత్. తన నటనతోనే కాదు, నోటి వాచాలత్వంతోనూ అందరికీ వణుకు పుట్టించగల ధీరనారి కంగనా చెబుతున్న విషయాలు...**

**15 కోట్ల పారితోషికం అడుగుతున్నారట నిజమేనా?**

నా ఇష్టం వచ్చినంత అడుగుతాను. నాకున్న డిమాండ్‌ని బట్టి ఇస్తారు. అలా ఇవ్వగలిగే వాళ్ళే నాతో సినిమా చేస్తారు.

**'పద్మావతి' సినిమా కోసం దీపిక 13 కోట్లే తీసుకుంటోంది కదా?**

ఒక సినిమాకి ఎంత తీసుకోవాలి అన్నది హీరోయిన్ ఇష్టం. ఆ సినిమాకి దీపిక అంతే తీసుకుంటోంది కదా? మీరు అంత అడుగుతున్నారెందుకు? లాంటి ప్రశ్నలకు జవాబులు ఉండవు.

**అంత పారితోషికం ఇవ్వలేమని నిర్మాతలు అంటున్నారట నిజమేనా?**

చెప్పానుగా, నాతో సినిమా చేయాలని అనుకునేవారు అంతా ఇచ్చుకుంటారు. ఇవ్వలేని వారు వెళ్ళిపోతారు. దీని మీద డిస్కషన్ అనవసరం.

**హీరోయిన్లను హీరోలు వాడుకుంటారు? అన్న మాట మీద నిలబడతారా?**

ఇప్పుడే కాదు. ఎప్పుడూ నిలబడతాను. సినిమాల్లోకి వచ్చిన కొత్తల్లో నన్నూ వాడుకున్నారు. అసలు స్టార్ హీరోయిన్లు అందరూ ఈ పరిస్థితిని ఎదుర్కొన్నవారే. ఎవరో కొందరు కుటుంబ నేపథ్యం ఉన్నవారు తప్పించి చాలామందికి నాకు ఎదురైన, జరిగిన అనుభవాలే జరిగాయి. ఇవన్నీ జగమెరిగిన సత్యాలే! నేను ఆ విషయాలే చెబితే కొందరు భుజాలు తడుముకుంటున్నారు. నేను అన్న మాటలు తప్పు అని ఎవరూ ఇంతవరకూ పబ్లిక్‌గా స్టేట్‌మెంట్ ఇవ్వలేదు. అంటే నేను అన్నమాటలు నిజమేగా?

**గుర్రపుస్వారీ పూర్తిగా వచ్చేసినట్టేనా?**

'రాణి లక్ష్మీబాయి' సినిమా కోసం నేర్చుకున్నా. ఇందు కోసం ప్రత్యేకంగా జర్మనీలో శిక్షణ పొందాను. సినిమాల్లో గుర్రపు స్వారీ దృశ్యాలలో ట్రైన్డ్ గుర్రాలనే వాడతారు. చాలా వరకూ డూప్‌లతోనే చేసేస్తారు. కానీ ఈ సినిమాలో డూప్ వద్దన్నాను. నేనే స్వారీ చేస్తానని

చెప్పాను.

ఎంత ట్రైన్డ్ గుర్రాన్ని ఉపయోగించినా, వాటి గురించి తెలుసుకోకపోతే కష్టం. అందుకే వివిధ జాతుల గుర్రాల గురించీ, వాటి అలవాట్లు, ఎప్పుడు ఎలా స్పందిస్తాయి అన్న విషయాల మీద శిక్షణ పొందాను. గుర్రంపై నుంచి పడిపోయినప్పుడు చేయవలసిన ప్రథమ చికిత్స గురించి కూడా తెలుసుకున్నాను. ఈ సినిమా కోసం కొద్దిగా బరువు కూడా పెరిగాను. వచ్చే సంవత్సరం ప్రథమార్థంలో సినిమా షూటింగ్ ప్రారంభమవుతుంది. ఈ సినిమాను చాలా ప్రత్యేకంగా తీసుకున్నాను. అందుకే ఇన్ని జాగ్రత్తలు. 'క్వీన్' నాకు ఎంత పేరు తెచ్చిందో అంతకు మించిన పేరు తెస్తుంది ఈ సినిమా.

## సినిమాల ఎంపిక ఎలా చేసుకుంటారు?

కథ విన్న వెంటనే మనసులోనే రిహార్సల్స్ చేసుకుంటాను. దాంతో ఆ పాత్రను నేను చేయగలనో లేదో వెంటనే తెలిసిపోతుంది! నేను చేయగలనని అనుకున్న పాత్రనే ఒప్పుకుంటాను. చేయలేను అనుకుంటే ఎంత ఇచ్చినా చేయను.

## మీ నోటికి అందరూ భయపడతారంటారు నిజమేనా?

నిజాలు మాట్లాడితే అలానే భయపడతారు. నేను ఏం చెప్పినా ప్రాక్టికల్‌గా చూసినవి, అనుభవపూర్వకంగా తెలుసుకున్నవి మాత్రమే మాట్లాడతాను. అబద్ధాలు చెప్పను. అందుకే నేను చెప్పిన మాటలను ఎవరూ ఖండించరు. వారికీ తెలుసు. అవన్నీ నిజాలే అని. నిజాలు మాట్లాడతాను కనుక నన్ను చూసి భయపడతారు. అలా భయపడని వాళ్ళే నాతో స్నేహం చేస్తారు. స్త్రీలకు స్వేచ్ఛ ఉందని అంటారే కానీ వారికి మాట్లాడే స్వేచ్ఛ కూడా ఇవ్వడం లేదు. నాలాగా కొందరు ధైర్యం చేసి మాట్లాడితే పై విధంగా విమర్శిస్తారు.

## ఈ రంగంలోకి వచ్చినప్పుడు అవమానాలు పడ్డాను అని అంటూంటారు ఎందుకలా?

నేను సిటీలో పుట్టి పెరగలేదు. హిమాచల్ ప్రదేశ్‌లోని ఓ చిన్న టౌన్‌లో పుట్టాను. ముంబయికి వచ్చిన కొత్తల్లో సిటీ పద్ధతులు నాకు అస్సలు తెలియదు. అందరిలాగా ఇంగ్లీష్ మాట్లాడడం వచ్చేది కాదు. దాంతో అందరూ ఎగతాళి చేసేవారు. నా ఇంగ్లీష్ యాక్సెంట్‌ని చూసి, నా బట్టలను చూసి నవ్వేవారు. వారి ప్రవర్తనే నాలో కసినీ, పట్టుదలనూ పెంచాయి. వారికి ఏమాత్రం తీసిపోనని, నన్ను నేను నిరూపించుకోవాలని ప్రారంభంలోనే డిసైడ్ అయిపోయాను.

వేషం మార్చుకున్నాను. భాష నేర్చుకున్నాను. అన్ని విధాలా మారిన నన్ను చూసి అప్పుడు నవ్విన వారే ఇప్పుడు ఆశ్చర్యపోతున్నారు. ఎలాంటి సపోర్టు లేకుండా స్వశక్తితోనే ఈ స్థాయికి చేరుకున్నాను. ఇప్పుడు అందరూ నన్ను చూసి ఈర్ష్య పడే స్థాయిలో ఉన్నాను.

### సెట్‌లో కంగనా ఎలా ఉంటుంది?

స్త్రీని అని ప్రత్యేక గౌరవాన్ని ఎప్పుడూ కోరుకోను. అందరిలానే నేనూ అంతే! నాకేమీ ప్రత్యేకమైన ట్రీట్‌మెంట్ అవసరం లేదు. అలాగని నా ఆత్మాభిమానం దెబ్బతింటే మాత్రం సహించలేను. అందరితో కలిసి పని చేయడం నాకు చాలా ఇష్టం. ఈ విషయం నాతో కలిసి పనిచేసిన వారందరికీ తెలుస్తుంది. షూటింగ్ మొదలైన ఐదురోజుల్లోనే అందరితో కలిసిపోతా. నా దృష్టిలో స్త్రీ పురుషులు ఇద్దరూ ఒక్కటే! ఒకరు తక్కువ ఒకరు ఎక్కువ అన్న పరిస్థితి మారాలి. అసలు ముందుగా ఈ మార్పు స్త్రీలలోనే రావాలి. తాము ఎందులోనూ తక్కువ కాదన్న అభిప్రాయం పెంచుకోవాలి. ఆ అభిప్రాయం బలంగా కలిగిననాడు ప్రత్యేకమైన గుర్తింపు కోసం ఆరాటపడాల్సిన అవసరం లేదు.

## బాలీవుడ్‌కి వచ్చి దశాబ్దం పూర్తయింది కదా ఎలా అనిపిస్తోంది?

బాలీవుడ్‌లో నాకంటూ ఓ రహదారి ఏర్పాటు చేసుకున్నాను. ఇప్పుడిప్పుడే అందరూ నా దారిలోకి వస్తున్నారు. కంగనాలో ఆత్మవిశ్వాసమే కాదు, స్వతంత్రభావాలు కూడా ఎక్కువే అన్న విషయం అందరూ గుర్తించగలిగేటట్లు చేయగలిగాను. ఏ లక్ష్యంతో ఈ రంగంలోకి వచ్చానో ఆ లక్ష్యాన్ని దాదాపు చేరుకోగలిగాను.

## ఇంక సాధించేదేమీ లేదనా అర్థం?

లేదని కాదు. చదువురాని ఓ పల్లెటూరి అమ్మాయి ఈ స్థాయికి చేరుకోవడం ఆషామాషీ కాదు. ఇప్పుడున్న స్టార్ హీరోయిన్లందరికీ సినీ బ్యాక్‌గ్రౌండూ లేదా కుటుంబం అండా ఉన్నాయి. నా విషయానికి వస్తే ఆ రెండూ లేవు. అలాంటి స్థితి నుంచి వచ్చి బాలీవుడ్ క్వీన్ అనిపించుకోవడం పెద్ద అఛీవ్‌మెంట్ అని నా ఉద్దేశం.

## టాలీవుడ్‌లో చేయబోతున్నారట?

ఆలోచన ఉంది. అన్నీ సమకూరితే తప్పకుండా చేస్తాను. దక్షిణాదిన సినిమా ఫైనల్ అయినప్పుడు అందరికీ నేనే చెబుతాను.

## బాలీవుడ్‌లో చేస్తున్న సినిమాలు?

ప్రస్తుతం రెండు సినిమాలు ఉన్నాయి. ఒక సినిమా షూటింగ్ అయిపోవచ్చింది. మరొకటి త్వరలోనే ప్రారంభమవుతుంది. రెండు కథలు నచ్చాయి. వాటికి ఇంకా ఓకే చెప్పలేదు.

## పెళ్ళి గురించి...

దానికి ఇంకా టైముంది. అసలు పెళ్ళి గురించిన ఆలోచనే నాకు లేదు. ఎలా పెళ్ళి చేసుకోవాలి? అన్నదాంట్లో ఇంకా క్లారిటీ కూడా రాలేదు. అలాంటప్పుడు దాని గురించి మాట్లాడడంలో అర్థం లేదు. ఓ రెండు మూడేళ్ళ తరువాత ఆలోచిస్తాను.

-చిన్ని





# ఇంటర్వ్యూ

# సమాజంలో మార్పు మళ్ళీ సినిమాతోనే!

**-జీవిత**

**నుదుట రూపాయిబిళ్ళంత కుంకుమబొట్టు, నిండైన చీరకట్టులో కనిపించే పరిపూర్ణమైన తెలుగింటి ఆడపడుచు నటి జీవిత. నిర్మాత, దర్శకురాలు. నటించిన చిత్రాలు తక్కువే అయినా బహుభాషా నటి. సినిమా ఒక బలమైన మీడియా అంటారామె. సమాజంలో హింస, ద్వేషం, సెక్స్ ధోరణులు తగ్గించి స్త్రీ వ్యక్తిత్వాన్ని కాపాడేందుకు తిరిగి సినిమా మీడియా ద్వారానే మార్పు తెచ్చి తీరాలి అంటారు జీవిత. దర్శక నిర్మాతలు కనీస సామాజిక బాధ్యతతో వ్యవహరించాలంటున్న జీవిత ఇంటర్వ్యూ...**

పశ్చిమగోదావరిజిల్లా తాడేపల్లిగూడెంలో మాతామహుల ఇంట శ్రావణ శుక్రవారం సాయంత్రం పుట్టాను. అమ్మానాన్న పెట్టిన పేరు పద్మ. సినిమాల్లోకి వచ్చిన తర్వాత నా పేరు జీవితగా మారింది.

మా నాన్నగారు రామనాథం. హెల్త్ ఇన్‌స్పెక్టర్‌గా పనిచేసేవారు. అమ్మ శకుంతలాదేవి. స్టాఫ్ నర్స్‌గా పనిచేసేది. మా మాతామహులు అప్పారావుగారు. ఎన్.టి.రామారావుగారి దగ్గర అకౌంటెంట్‌గా పనిచేసేవారు. మా పెద్దక్క ఉషారాణి గురించి మేమంతా చెన్నై వచ్చి సెటిలయ్యాం. నాన్నగారు నెలకోసారి చెన్నై వచ్చి వెళ్ళేవారు.

### ఇంటర్మీడియట్‌లోనే సినిమాల్లోకి

నా ప్రాథమిక విద్య అంతా చెన్నైలోనే. టి.నగర్ బాల గురుకుల పాఠశాలలో 8 వరకు చదివాను. దర్శకుడు తేజ, కొరియోగ్రాఫర్ సుచిత్ర (చంద్రబోస్ భార్య), ప్రముఖ డాన్స్ మాస్టర్ బృంద తదితరులు గురుకుల పాఠశాలలో నాతో చదివినవారే. ఇంటర్మీడియట్ చదివే రోజుల్లోనే సినిమాల్లోకి ప్రవేశించాను.

### తమిళంలో తొలి చిత్రం

నేను తెలుగు అమ్మాయినే. కానీ సినీరంగ ప్రవేశం మాత్రం తమిళచిత్రంతోనే. ప్రముఖ తమిళ దర్శకుడు టి.రాజేందర్ నటుడు, కంపోజర్, స్క్రీన్ రైటర్, సినిమాటోగ్రాఫర్, ప్రొడ్యూసర్, సింగర్ మాత్రమే కాదు, తమిళరాజకీయాల్లో ఆరితేరిన నాయకుడు. ఆయనే నాకు అవకాశం ఇచ్చారు. ఒకసారి వాణీమహల్‌లో ఆయన కలిశారు. నా స్నేహితురాలి ద్వారా నాపేరు తెలుసుకుని, 'పద్మా, నేనో సినిమా తీస్తున్నాను అందులో నటిస్తావా?' అని అడిగారు. నిజానికి నాకు సినిమాలపై ఆసక్తి లేదు. చదువుమీదే దృష్టి. కాకపోతే పాఠశాల స్థాయిలో ఉపన్యాసాలివ్వడంతోపాటు సాంస్కృతిక కార్యక్రమాల్లో యాక్టివ్‌గా ఉండేదాన్ని. రాజేందర్ గారు మా ఇంటికి వచ్చి అమ్మానాన్నలతో మాట్లాడి వెళ్ళాక కాలేజీలో స్నేహితులు, లెక్చరర్లు కూడా నన్ను ఎంతగానో ప్రోత్సహించడంతో ఆసక్తి కనబరిచాను. తర్వాత విజయాగార్డెన్‌లో సెలక్షన్స్‌కి పిలిచి 15మందిలో నాతోపాటు ముగ్గుర్ని ఎంపిక చేశారు. ఆ విధంగా 'ఉఅవై కాత్తకిళి' అనే తమిళ చిత్రంలో మొదట నటించాను. ఇది పూర్తిగా కొత్త నటులతో నిర్మించిన విజయవంతమైన చిత్రం. 1984లో ఈ సినిమా విడుదలయ్యాక నాకు ఆఫర్స్ రావడం మొదలైంది.

### తెలుగులో తొలిచిత్రం తలంబ్రాలు

తలంబ్రాలు చిత్రంలో నటించమని ఎం.ఎస్. రెడ్డిగారు అడిగారు. అమ్మానాన్నలను అడగమన్నాను. మర్నాడు వాళ్ళబ్బాయి శ్యామ్‌ప్రసాద్‌రెడ్డి గారు మా ఇంటికి వచ్చి అగ్రిమెంట్ తీసుకున్నారు. తెలుగు మాట్లాడటం వచ్చా? అని అడిగారు. మేం ఇంట్లో మాట్లాడేది తెలుగేసార్ అని బదులిచ్చాను. కోడి రామకృష్ణగారి దర్శకత్వంలో నందమూరి కల్యాణచక్రవర్తి, డాక్టర్ రాజశేఖర్ తదితరులు నటించిన చిత్రం తలంబ్రాలు. సత్యం సంగీత దర్శకత్వంలో 1987లో విడుదలైన ఎంతో విజయవంతమైన చిత్రం. ఈ చిత్రంలో నా పాత్రకు మంచి పేరు వచ్చింది. అదే నాకు ప్లస్ పాయింట్ అయ్యింది. ఇక ఆ తర్వాత వెనుతిరిగి చూడలేదు.

### ఆహుతి, అంకుశం

ప్రబోధాత్మక చిత్రం 'ఆహుతి'లో నాపాత్రకు మరింత పేరు వచ్చింది. ఈ చిత్రంతోనే డా.రాజశేఖర్‌గారితో చనువు మొదలైంది. కోడి రామకృష్ణ గారి దర్శకత్వంలో 1988లో విడుదలైన ఈ చిత్రంతోనే ప్రసాద్ తన పేరును ఆహుతి ప్రసాద్‌గా మార్చుకున్నారు.

నిజాయితీగల పోలీసు అధికారి కథ అంకుశం. పరిశ్రమలో సంచలనం సృష్టించింది. ఆరోజుల్లో బాక్సాఫీస్ కలెక్షన్లను తిరగరాసిన చిత్రం. కోడిరామకృష్ణగారి దర్శకత్వంలో ఎం.శ్యాంప్రసాద్‌రెడ్డిగారు నిర్మించిన ఈ చిత్రం 1990లో విడుదలైంది. 'ఇదు దాండ పోలీసు' పేరుతో తమిళంలోకి డబ్బింగ్ చేశారు. హిందీ, కన్నడల్లో రీమేక్ చేశారు. అన్ని భాషల్లోనూ విజయవంతమైంది.

తలంబ్రాలు, అంకుశం, ఆహుతి, అన్నాచెల్లెలు,

మంచివారు మావారు, స్టేషన్‌మాస్టర్, జానకి రాముడు వంటి నా చిత్రాలన్నీ విజయవంతమైనవే.

**వివాహం**

డాక్టర్ రాజశేఖర్‌గారితో తలంబ్రాలు చిత్రంతో పరిచయం ప్రారంభమై ఆహుతి చిత్రంతో స్నేహంగా మారి, అంకుశం చిత్రంతో ప్రేమికులుగా మారాం. 1991లో మా వివాహం జరిగింది. మాకు ఇద్దరు ఆడపిల్లలు.

మా పెద్దమ్మాయి శివాని. మెడిసిన్ రెండో సంవత్సరం చదువుతోంది. రెండో అమ్మాయి శివాత్మిక. ఇంటర్మీడియట్ మొదటి సంవత్సరం చదువుతోంది. ఇద్దరికీ సినిమాల్లో నటించాలనే కోరిక ఉంది.

**చిత్రపరిశ్రమ అన్ని రకాలుగా అభివృద్ధి చెందింది**

సినిమారంగం అభివృద్ధి సాధిస్తూ ముందుకు సాగుతోందనే చెప్పాలి. ఉన్నతమైన చిత్రాలు వస్తున్నాయి. ఎలక్ట్రానిక్ మీడియా పెరుగుదల వల్ల జనంలో అవగాహన పెరిగింది. ముఖ్యంగా మహిళలు అభివృద్ధి చెందడానికి సినిమాలు కూడా దోహదం చేశాయి. మహిళలు పైలట్ స్థాయికి ఎదిగారంటే కారణం సినిమాలే. సినీ ప్రపంచం టెక్నికల్‌గా, వ్యాపారపరంగా విస్తృతమైంది కానీ..

ఆనాడు స్త్రీని హైలైట్ చేస్తూ, వాళ్ళ గొప్పతనాన్ని చూపించే చిత్రాలు వచ్చేవి. పిల్లల చిత్రాలు, జానపద, భక్తి చిత్రాలు ఎక్కువగా వచ్చేవి. ఆనాటి ప్రముఖ దర్శకులు కమలాకర కామేశ్వరరావు, విఠలాచార్య, డి.వి.ఎస్.రాజు, నాగిరెడ్డి, చక్రపాణి, బి.ఎన్. రెడ్డి ఆ తర్వాత విశ్వనాథ్, బాలచందర్, బాపూ లాంటివారంతా సంఘానికి ఎంతో ఉపయోగపడే చిత్రాలు ఎన్నో నిర్మించారు. ఇవ్వదల్చిన సందేశాన్ని ఎంతో గొప్పగా అందించేవారు. ముఖ్యంగా స్త్రీ వ్యక్తిత్వాన్ని కాపాడే ఆనాటి చిత్రాలు ఈనాడు కరవైపోయాయి.

**ట్రెండ్ మారింది**

మూడేళ్ళుగా అన్ని రకాల చిత్రాలూ వస్తున్నట్టు అనిపిస్తోంది. మంచి కథ ఎన్నుకుంటున్నారు. ట్రెండ్ మారింది. కమర్షియల్ వ్యూ తగ్గించారు. సొసైటీకి ఉపయోగపడే చిత్రాలు వస్తున్నా చాలా తక్కువే.

సినిమా ఒక స్ట్రాంగ్ మీడియా. అంత వేగంగా మరేదీ ప్రజల్లోకి వెళ్లలేదు. దేవుడే దిగివచ్చి చెప్పినా వినని యువతరం, సినిమాల్లో హీరో చెప్పిందే వేదంగా భావించి ఫాలో అవుతున్నారు. సినిమాకి ఇంత క్రేజ్ ఉన్నప్పుడు ఆ సినిమా ద్వారానే యువతకు ప్రబోధం చేయాలి. విలువల్ని కాపాడేందుకు హీరోతో సందేశం చెప్పించవచ్చు. సినిమాను మరీ దిగజార్చి తీయాల్సిన పనిలేదు. ఈ ధోరణి మారాలి.



నవ్య వీక్లీ చదువుతూ


కుటుంబసభ్యులతో

**అర్ధనగ్న హీరోయిన్**

ఒకప్పుడు సినిమాల్లో వ్యాంప్, హీరోయిన్ ఉండేవారు. ఈ పాత్రల మధ్య తేడా చూపించేవారు. అచ్చమైన తెలుగు ఆడపడుచులా కనిపించే హీరోయిన్‌వైపు అందరూ ఆకర్షితులయ్యేవారు. ఇప్పుడది లేదు. అన్నీ హీరోయిన్‌చేతే చేయిస్తున్నారు. దానికితోడు హీరోయిన్లు కూడా వ్యాంప్ ఎందుకు, మేమే చేస్తాం అన్నట్టు ఉంటున్నారు.

**ఐ లవ్ యూ కామన్ వర్డ్!**

పాత సినిమాల్లో ఐ లవ్ యూ అని ఒక పద్ధతి ప్రకారం ఆలోచించి చెప్పించేవారు. ఇప్పుడు ఇదొక కామన్ వర్డ్‌గా మారిపోయింది. 'కుక్కలు క్రాసింగ్‌కి వచ్చాయి అని హీరోయిన్ అంటే, 'కుక్కలేనా, మేం కూడా క్రాసింగ్‌కి వచ్చాం' అనే అర్థంలో అంటాడు హీరో. ఒక గొప్ప హీరోతో అలా చెప్పిస్తారా? ఒకప్పుడు మనం ఎంతో సంతోషంగా ఉండేవాళ్ళం. ఇప్పుడెలా ఉన్నాం? పిల్లలు ఏ దార్లో వెళుతున్నారో తెలియని అగమ్యగోచరంలో ఉన్నారు తల్లిదండ్రులు. ఇప్పుడు ప్రతి బజారులో పబ్ వెలుస్తోంది. బంగారం లాంటి పిల్లల భవిష్యత్తు నాశనం అవుతోంది. దానికి ఎవరు బాధ్యులు? ప్రభుత్వమా? రాజకీయ నాయకులా? నేను మాత్రం అందరినీ తప్పుపడుతున్నాను. కనుక ఎవరికివారే ఆత్మవిమర్శ చేసుకోవాలి.

**పెద్దలు మారాలి**

నేటి యువతరంలో మంచిదారిలో వెళ్ళేవారి శాతం తక్కువ. చెడ్డదారిలో వెళ్ళే అవకాశాలే ఎక్కువ. ప్రభుత్వం తల్చుకుంటే దీన్ని ఆపగలదు కదా! ముఖ్యంగా ఫేస్‌బుక్కులు, వాట్సాప్‌లు ఈ జనరేషన్‌ని నాశనం చేస్తున్నాయి. ఈ విషయంలో ముందు పెద్దలు మారాలి.

ఒకప్పుడు సెక్స్ సీడీలను రహస్యంగా చూసేవారు. పోలీసులకు భయపడేవారు. కానీ ఇప్పుడో? అదో ఫ్యాషన్‌గా మారింది. అదెంతో ఈజీ అయిపోయింది. తల్లిదండ్రులు పిల్లలకు ఇచ్చిన స్వేచ్ఛను వారు సద్వినియోగం చేసుకోలేకపోతున్నారు.

పెళ్ళి విషయానికి వస్తే ఒక రోజు పెళ్ళి, రెండో రోజు డైవోర్స్ అన్నట్టుగా ఉంది. విడాకులు పెరిగాయి. కలిసి బతకలేకపోతున్నారు.

**మేలు చేసే సినిమాలు**

టాప్ హీరోలు, హీరోయిన్లతో సినిమాలు తీస్తున్నారు. కానీ క్రైమ్, సెక్స్ నింపి ప్రేక్షకులకు పిచ్చెక్కిస్తుంటారు. హీరో చెయ్యడం వల్ల యువతరం దాన్నే హాబీగా తీసుకుని తప్పుదారిపడుతోంది. అందుకే కనీస సామాజిక బాధ్యతను బుర్రలో పెట్టుకుని ఎంతో కొంత సొసైటీకి మేలు చేసే సినిమాలు నిర్మించాలి. అప్పుడు కొంతైనా సినిమాల వల్ల మంచి జరుగుతుంది.

ఇప్పుడు పబ్లిసిటీ బాగా పెరిగింది. టాప్ హీరోలతో సినిమాకు ప్రచారం చేయిస్తున్నారు. సొమ్ము చేసుకుంటున్నారు బాగుంది. కానీ ఇది అంత కరెక్టు కాదు. ఆ ప్రొడక్షన్ సొసైటీకి ఉపయోగకరమా కాదా? అన్నదే మీమాంస. ఒక ప్రొడక్ట్ నిజంగా ప్రజలకు ఉపయోగకరమా కాదా? అనేది ఆలోచించి ఏదైనా నిర్ణయం తీసుకుంటే మంచిది.

**మళ్ళీ మార్పు సినిమాతోనే**

ఈనాడు మనిషికి డబ్బే ప్రధానం అయిపోయింది. అసూయ, ద్వేషం, కక్షలు, కార్పణ్యాలు, ఎదుటివాణ్ణి దెబ్బకొట్టాలనే హ్యూమన్ టెండెన్సీలో మార్పు రావాలంటే ప్రతి ఒక్కరూ మారాలి. రాజకీయాల్లో ఎక్కువ మార్పు రావాలి. అంటే సినిమాల ద్వారానే మళ్ళీ మార్పు తేవాలి. అలాంటి మార్పు తెచ్చే చిత్రాలు రావాలి.

**స్త్రీని కాపాడే చిత్రాలు రావాలి**

జీవితంలో సెక్స్ ఎంతో అవసరం. బ్రష్ చేసుకున్నట్టు, స్నానం చేసినట్టు, కాఫీ తాగినట్టు దాంపత్యసుఖం కూడా జీవితంలో భాగమే. దాంతో పాటే సహజీవనం కూడా వచ్చింది. ఏది వచ్చినా స్త్రీ తన క్యారెక్టర్ కాపాడుకోవాలి. భార్య అయినా,

ప్రాస్టిట్యూట్ అయినా...స్త్రీ ఇష్టం లేకుండా పురుషుడు ఆమెతో గడపలేడు. భర్త దుర్మార్గుడు, దుష్టుడైతే వాడితోనే జీవితం గడపాల్సిన అవసరం లేదు. 'పెళ్ళి చేసుకున్నా, నా చెప్పుచేతల్లో ఉండాలి' అనే ధోరణి కరెక్టుకాదు. అందుకే ఒకరి గురించి ఒకరు అర్థం చేసుకోవాలి. ఒకర్ని విడిచి మరొకరు ఉండలేం అనుకున్నప్పుడే పెళ్లి చేసుకోవాలి. పిల్లల్ని కన్న తర్వాత మాత్రం కాంప్రమైజ్ కావడం చాలా ఇంపార్టెంట్. జీవిత విలువల్ని అర్థం చేసుకుని ఎవరో ఒకరు ఎడ్జస్ట్ కావడం మంచిది. ఇలాంటి ధోరణులు సమాజంలో పెరిగాయి గనుక ఈ రోజుల్లో కుటుంబాలకు, యువతకు, విద్యార్థులకు మంచిని ప్రబోధించే చిత్రాలు ఎక్కువ రావాలి. అమితాబ్‌బచ్చన్ చిత్రం 'పింక్' ఎంతో బాగుంది. ఆడపిల్లల గురించి ఈ చిత్రంలో ఎన్నో విషయాలు చెప్పారు. భర్త కావచ్చు, ప్రాస్టిట్యూట్ దగ్గర విటుడు కావచ్చు, ఆడది నో అంటే నో అంతే. సుప్రీంకోర్టు నుంచి ఎన్నో చట్టాలు తెచ్చినా ఇంకా మార్పు రావడం లేదు. ఇలాంటి ప్రబోధాత్మక చిత్రాలు రావాలి.

ఇక రాజకీయాల విషయానికొస్తే ప్రజలకు సేవ చేయాలనుకునేవారు జెన్యూన్‌గా ఆలోచించాలి. ఉదాహరణకు జయలలిత మరణించినప్పుడు ఆమెకోసం రాష్ట్రం కదిలి వచ్చింది. రాజకీయం అంటే అది. ఎవరికీ తల వంచని ధీశాలి ఆమె.

### యువతకు సలహా

వయసులో ఉన్న వారికి అమ్మానాన్న చెప్పేది పనికిరాదు. ప్రతీదీ తమకే తెలుసునన్న ఫీలింగ్‌తో దబాయించేస్తారు. చదువుకోవాల్సిన సమయంలో లవ్ మంచిది కాదు. కానీ ఈ లవ్ అనేది నాకూ వచ్చింది. అందరికీ వస్తుంది. కానీ చదువునీ, దీన్నీ కలపకూడదు. మీరు సిన్సియర్‌గా ఉంటే స్నేహం కంటిన్యూ చెయ్యండి. అప్పుడు నిజమైన ప్రేమ అంటే ఏమిటో అర్థం అవుతుంది. ఈ లవ్ అనేది నిజమైనదా? మంచి ఫ్రెండ్‌షిప్పా? అనే దానికి మీకే ఆ తర్వాత మీనింగ్ అర్థం అవుతుంది. మొదటి రోజు లవ్, రెండోరోజు ముద్దు, మూడోరోజు కౌగిలింత, మర్రోజు కొట్టుకునే స్థితికి రావద్దు. ఆరోగ్యకరమైన స్నేహంతో ఉండండి. చదువులు పూర్తిచేసి ఉద్యోగాలు చేసుకుంటూ, ప్రేమ గట్టిదైతే అప్పుడు పెళ్ళి చేసుకోండి. రియల్ లవ్ ఎప్పటికీ సజీవంగా ఉంటుంది. తల్లిదండ్రులు కూడా పిల్లల్ని బాధించకూడదు. వాళ్ళకి అర్థమయ్యేలా చెప్పాలి. ఈ నేపథ్యంలో ఇంటర్నెట్, వాట్సాప్, ఫేస్‌బుక్ లాంటివాటిని పరిధిలో ఉపయోగిస్తూ సద్వినియోగం చేసుకోవాలి. ఇలాంటి విషయాలను బోధించే మంచి చిత్రాలు నిర్మించాలి. అప్పుడు తప్పకుండా సమాజంలో మార్పు వస్తుంది. తల్లిదండ్రులు కూడా చాకచక్యంగా వ్యవహరించాలి.

### నాకు నచ్చిన హీరో

జీవితంలో ఏదైనా మరపురాని సంఘటన ఉందంటే అది డాక్టర్ రాజశేఖర్‌గారితో నా వివాహమే. నా ఇద్దరు పిల్లల్ని బాగా చదివించాలనుకుని చదివిస్తున్నాను. ఈ మధ్య మా అమ్మగారి మరణం నాకు చాలా బాధ కలిగించింది. తండ్రి, అక్క, అమ్మమ్మ అందరూ లేకపోవటం, ఇంతతొందరగా దేవుడు వాళ్ళందరినీ నాకు లేకుండా చేయడం నాకు తీరని లోటు.

నాకు నచ్చిన హీరో డాక్టర్ రాజశేఖర్. ఆయన ఎంతో ఫ్రాంక్‌గా ఉంటారు. కోటి రూపాయలు ఇచ్చి అబద్ధం చెప్పమన్నా చెప్పరు. ఆయన మొదట ప్రేమించేది నన్ను, ఆ తర్వాతే పిల్లల్ని. మేం లేకుండా ఎక్కడికీ బైటకు వెళ్ళరు. ఎన్ని కోట్లు ఉన్నాయన్నది ముఖ్యంకాదు, ఆయన ఫ్రాంక్‌నెస్సే ఆయనకు ముఖ్యం. శివుడంటే ఆయనకు బాగా ఇష్టం. నేను ఎక్కువ ఇష్టపడే నటి జయసుధ.

రోజూ పూజ చేస్తాను. ఉపవాసాలుంటాను. ఎదుటివారికి హాని తలపెట్టకు అంటారు మా వారు. నా ఉద్దేశం కూడా అదే. మాది అన్యోన్య దాంపత్యం. ప్రస్తుతం రాజశేఖర్‌గారు 'గరుడవేగ' చిత్రంలో నటిస్తున్నారు. నేను ఇంటి పనులతో బిజీ.

*-కె.హరనాథ్*

*సెల్: 97035 42598*

## సుధామ పదగారడి-293

**సెల్: 98492 97958**

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| h | 1 | 2 | | h | 3 | 4 | | h |
| 5 | h | | h | 6 | h | | h | 7 |
| | h | 8 | | | | 8 | h | |
| 9 | 10 | h | h | | h | h | 11 | |
| h | 12 | | h | | h | 13 | | h |
| 14 | | 15 h | h | h | h | h | 15 | 16 |
| | h | 17 | h | | h | 18 | h | |
| h | h | 19 | 20 | h | 21 | | 22 h | h |
| 23 | | h | | h | | h | 24 | |

### ఆధారాలు

**అడ్డం**

1. ఏసుక్రీస్తు (3)
3. పరిశుద్ధ గ్రంథంగా పేర్కొనబడేది (3)
8. రసాయనాలు కలిసిన పదార్థాలు ఏవైనా శరీరానికి ఇదే! (5)
9. డబ్బా కాదు గాజుది (2)
11. క్రైస్తవమత ప్రచారిణి (2)
12. పండకముందు స్థితి (2)
13. దారి (2)
14. ఎల్లప్పుడూ, రోజూ (2)
15. కుంతలము ఆద్యంతాలు మాయం (2)
19. శాపం కాదు దానికి వ్యతిరేకం (2)
21. ఆవగింజంత ప్రతిభవున్నా గుమ్మడి కాయంత ఇది చేసుకునే వాళ్ళున్నారు (3)
23. ఆభరణం (2)
24. రాతబల్ల ముందు వేసుకు కూర్చుని రాసుకుంటాం (2)

**నిలువు**

2. డాక్టర్లు, లాయర్లు ఉచితంగా ఇవ్వనిది (3)
4. రంధ్రము, గుహ (3)
5. ఆంగ్లంలో అసూయ (3)
6. ఇసుక తిన్నె, ఇసుక ప్రదేశం (6)
7. రాజాధిరాజు చిత్రంలో నూతన ప్రసాద్ పోషించిన పాత్ర (3)
10. పోలిక (3)
11. కొత్తదనం, ఒకప్పుడు సెవెన్‌స్టార్ సిండికేట్ వారు నడిపిన పత్రిక (3)
14. టెస్టిమెంట్ అనగా క్రైస్తవ పరిభాషలో (4)
16. సిగ్గు (2)
17. పడవ (2)
18. భజన పరులకే ఈ..గాళ్ళు అని కూడా పేరు కాఫీలో పంచదార కలుపుకు నేందుకు వాడేది (2)
20. కలర్ (2)
21. సమాధానం ఆశించేదిగా వేసేది (2)
22. ఇది నేర్చినమ్మ బొంకు నేర్వదా అని సామెత (2)

### పదగారడి-292 సమాధానాలు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | బా | పు | | ము | ళ్ళ | పూ | డి | |
| గో | ల | | బు | వ్వ | | జా | | తో |
| డ | | సి | ద్ధి | | | రి | వ | ట |
| | పా | | మం | | రే | | ట | |
| మా | ల | | తు | వ్వా | యి | | వృ | ధా |
| | కో | | డు | | ప | | క్షం | |
| జ | వా | బు | | | గ | డ్డ | | ప |
| ర | | డు | | పా | లు | | సా | క్షి |
| | చి | గు | రా | కు | | షా | కు | |

Printed and Published by VEMURI RADHAKRISHNA, Managing Director, on behalf of Aamoda Publications Pvt. Ltd., Plot No.76, Aswani Layout, Huda Heights, Jubilee Hills, Hyderabad-500 033. Ph.(040) 23558233/44, Fax No.23558288. Printed at Aamoda Press, R.S.No.191/3, Ward No.43, Donka Road, Patamata, Vijayawada 520 010, Reg.No.: APTEL/2004/12594. Editor: A.N.JAGANNADHA SARMA

చాలా మంది హీరోయిన్లకు పాడాలనే కోరిక ఉంటుంది. ఏదో ఒక సినిమాలో ఒక పాట పాడి తమ కోరికను తీర్చేసుకుంటారు. అలాంటి వారి కోవలోకి శ్రద్ధాకపూర్ పేరు కూడా చేరుతుంది. 'రాక్ ఆన్ 2'లో తన గాన మాధుర్యాన్ని, సంగీత పరిజ్ఞానాన్ని సినీ ప్రియులకు పరిచయం చేసింది శ్రద్ధాకపూర్. నటన తరువాత సంగీతమే తన ప్రపంచం అంటున్న శ్రద్ధాకపూర్‌తో...

# ఇబ్బందేమీ లేదు

-శ్రద్ధా కపూర్



**ఆదిత్యా రాయ్‌తో మళ్లీ జత కడుతున్నట్టున్నారు?**

అవును. 'ఓకే జాను'లో తనతో కలిసి నటిస్తున్నాను. తనతో నటించడం చాలా ఈజీ. మొదటిసారి చేస్తున్నప్పుడే చాలా సౌకర్యవంతంగా ఫీలయ్యాను. అందరూ తనతో చేస్తున్నావు ఇబ్బంది పడతావేమో అని కొందరు నన్ను భయపెట్టారు. కానీ నాకెలాంటి ఇబ్బందీ కలగలేదు. 'ఓకే జాను'లో సున్నితమైన శృంగారాన్ని చూపించబోతున్నారు. 'ఆషికి 2' ఎంత విజయం సాధించిందో ఈ సినిమా కూడా అంతే విజయం సాధిస్తుందన్న నమ్మకం నాకుంది.



**'రాక్ ఆన్ 2'లో పాడడానికి శిక్షణ పొందారా?**

నేను నేర్చుకున్నది సాంప్రదాయ సంగీతం. ఈ సినిమాలో రాక్ సంగీతం అవసరం అయింది. అందుకే సమంత ఎడ్వర్డ్ అనే మహిళ దగ్గర శిక్షణ పొందాను. తనో గొప్ప జాజ్ ఓకలిస్ట్. రాక్ సంగీతానికి సంబంధించి ఏవో కొన్ని చిట్కాలు చెప్పి ఆగిపోకుండా దానికి సంబంధించి చాలా విషయాలలో శిక్షణ ఇచ్చారు. అలాంటి ట్రైనర్ దొరకడం నా అదృష్టం. నటన తరువాత సంగీతమే నా ప్రపంచం.

**ఈ సినిమాలో పాడాలనే ఆలోచన ఎలా వచ్చింది?**

ఈ సినిమాలో కీ బోర్డు ప్లేయర్‌గా చేశాను. పాటలు కూడా పాడే క్యారెక్టర్ నాది. నాకు సంగీతం వచ్చు కనుక నా క్యారెక్టర్‌కు వేరే వాళ్ళతో పాడించడం కన్నా నాతో పాడిస్తేనే బాగుంటుందన్న ఆలోచనతో దర్శకనిర్మాతలు నన్ను అడిగారు. నాకు ఆ ప్రపోజల్ నచ్చడంతో ఓకే చెప్పేశాను. అలా ఈ సినిమాతో సింగర్‌గా కూడా మారాను.

**ఈ సినిమా తరువాత ప్రొఫెషనల్ సింగర్‌గా మారే అవకాశం ఉందా?**

పూర్తిగా లేదని చెప్పలేను. సొంతంగా పాటలు రాసి వాటికి సంగీతాన్ని సమకూర్చాలని అనుకుంటున్నాను. వాటిని బయట పాడే ఉద్దేశం లేదు.

**అంటే ఆల్బమ్ చేద్దామనుకుంటున్నారా?**

ఇప్పటి వరకూ రెండు పాటలు మాత్రమే రాశాను. వాటితో ఆల్బమ్ సాధ్యం కాదు కదా! చెప్పానుగా ఇప్పటి వరకూ ఎలాంటి ఆలోచనా లేదు. నా తృప్తి కోసం తోచిన విధంగా పాటలు రాసుకున్నాను. మరికొన్ని రాసి బాణీలు సమకూర్చిన తరువాత ఆల్బమ్ గురించి ఆలోచిస్తాను. ఇప్పటికైతే అలాంటి ఆలోచన లేదు.

**సంగీతం పట్ల ఇష్టం కలగడానికి కారణం?**

లతా మంగేష్కర్‌జీనే కారణం. ఆవిడని చూసి చాలా ఇన్‌స్పైర్ అయ్యాను. ఆవిడ నా ఒక్కదానికే కాదు మా మదర్ శివాంగీ కపూర్‌కీ, మా అత్తకు ఆవిడన్నా, ఆవిడ పాటలన్నా చాలా ఇష్టం. ఆవిడ గొంతు ఇప్పటికీ చిన్నపిల్లల గొంతులాగా ఉంటుంది. అది అందరికీ సాధ్యం కాదు. లతాజీకి భగవంతుడు అంత గొప్ప వరాన్ని ప్రసాదించాడు.

**సంగీతపరంగా అందుకున్న అవార్డులు?**

సంగీతాన్ని ప్రొఫెషన్‌గా చేసుకోలేదు. నటిగా అవార్డులు అందుకున్నాను కానీ, గాయనిగా ఇంతవరకూ ఎలాంటి అవార్డు రాలేదు. మా అత్త పద్మినీ కొల్హాపురి ఓ సినిమాలో చేసిన పాటకు చిన్నతనంలో అంటే స్కూల్ డేస్‌లో డ్యాన్స్ చేసేదాన్ని. పాట కూడా పాడేదాన్ని. నా డ్యాన్స్‌నూ, పాటనూ చాలా మంది మెచ్చుకునే వారు. ఆ పాటను అడిగి మరీ చాలాసార్లు పాడించుకునే వారు.

**మీలోని నటి నచ్చుతుందా? లేక సింగర్ నచ్చుతుందా?**

కష్టమైన ప్రశ్నే. ఆ రెండు క్యారెక్టర్లూ నాలో ఉండేవే! నటన నా వృత్తి. సందర్భానుసారంగా నాలోని గాయని బయటకు వచ్చింది. అంతే తప్ప సంగీతాన్ని వృత్తిగా తీసుకోలేదు. అందువలన ఎప్పుడూ నాతోనే ఉండే నటి, అప్పుడప్పుడూ బయటకు వచ్చే గాయనీ రెండూ ఇష్టమే!

-భరత్ కుమార్

| | | |
|---|---|---|
| 28. | తులసి నిత్యపూజ, తులసీఉపయోగాలు | 10-00 |
| 29. | శ్రీ చక్ర రహస్య విజ్ఞానమ్ | 36-00 |
| 30. | శ్రీచక్ర పూజావిధానం(పెద్దది) | 36-00 |
| 31. | లక్ష్మీ - గౌరీ నిత్యపూజ | 10-00 |
| 32. | శ్రీ సరస్వతీ నిత్యపూజ | 10-00 |
| 33. | శ్రీ దుర్గానిత్యపూజ | 10-00 |
| 34. | కాలభైరవ నిత్యపూజ | 10-00 |
| 35. | శివపూజ | 10-00 |
| 36. | వీరభద్ర పూజ | 10-00 |
| 37. | ఆంజనేయ నిత్యపూజ | 10-00 |
| 38. | నాగేంద్ర స్వామి పూజ | 10-00 |
| 39. | సుబ్రహ్మణ్య నిత్యపూజ | 10-00 |
| 40. | రామదేవుని కథ | 10-00 |
| 41. | శివదేవుని కథ | 10-00 |
| 42. | లక్ష్మీనరసింహపూజ | 10-00 |
| 43. | వేంకటేశ్వరపూజ | 10-00 |
| 44. | బ్రహ్మంగారి నిత్యపూజ | 10-00 |
| 45. | సూర్య నిత్యపూజ | 10-00 |
| 46. | నవగ్రహ నిత్యపూజ | 10-00 |
| 47. | రుక్మిణీ కల్యాణం | 25-00 |
| 48. | ఉమామహేశ్వర వ్రతం | 36-00 |
| 49. | శ్రీ కామేశ్వరీ వ్రతం | 36-00 |
| 50. | 16 సోమవారముల వ్రతము | 25-00 |
| 51. | పార్వతీకల్యాణం | 25-00 |
| 52. | సహస్రకమలవర్తి వ్రతము | 25-00 |
| 53. | పంచముఖ ఆంజనేయ పూజావిధానము | 36-00 |
| 54. | అష్టనాగపూజ | 36-00 |
| 55. | పూజలు ఎందుకుచేయాలి ? | 36-00 |
| 56. | ఏ దేవునికి ఏపుష్పాలతో పూజించాలి? | 36-00 |
| 57. | ఏ దేవునికి ఏప్రసాదం నైవేద్యం పెట్టాలి? | 36-00 |
| 58. | ఏదేవునికి ఏవిధముగాదీపారాధనచెయ్యాలి? | 36-00 |
| 59. | ఏదేవునికి ఎన్ని ప్రదక్షిణలుచేయాలి ? | 36-00 |
| 60. | హనుమద్ వ్రతం | 36-00 |
| 61. | పంచాయతన పూజ | 63-00 |
| 62. | 28 వ్రతములు | 120-00 |

| | | |
|---|---|---|
| 63. | కలశపూజలు (9ఒకేసారి) | 150-00 |
| 64. | కలశపూజలు (విడివిడిగా) (ప్రింటులో) | .... |
| 65. | హ్రీంకార మహాయజ్ఞం (ప్రింటులో) | .... |
| 66. | గోమాత | 40-00 |

## 2. స్తోత్రాలు-సుప్రభాతములు సహస్రనామములు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ లలితా విష్ణు సహస్రనామస్తోత్రాలు<br>పురాణపండ రాధాకృష్ణమూర్తిగారి సంకలనం | 45-00 |
| 2. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రములు (హిందీ) ,, | 50-00 |
| 3. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రములు (ఇంగ్లీషు) ,, | 50-00 |
| 4. | స్థూలాక్షరిలలితావిష్ణుసహస్రనామస్తోత్రములు(పత్రికసైజ్) | 99-00 |
| 5. | లలితావిష్ణు (కేస్ బైండ్) 1/8 డెమ్మి | 63-00 |
| 6. | స్థూలాక్షరీ లలితావిష్ణు (క్రౌన్‌సైజు)కేస్‌బైండ్ | 108-00 |
| 7. | సర్వదేవతా స్తోత్రమంజరి | 120-00 |
| 8. | సకలదేవతా అష్టోత్తరశతనామావళిః (63) | 24-00 |
| 9. | విష్ణుసహస్రనామస్తోత్రమ్ (క్రౌన్) | 25-00 |
| 10. | లలితా సహస్రనామ స్తోత్రమ్ (క్రౌన్) | 36-00 |
| 11. | లలితా సహస్రనామములు | 24-00 |
| 12. | లక్ష్మీ సహస్రనామములు | 24-00 |
| 13. | దుర్గా సహస్రనామములు | 24-00 |
| 14. | ఆంజనేయ సహస్రనామములు | 24-00 |
| 15. | శివ సహస్రనామములు | 24-00 |
| 16. | విష్ణు సహస్రనామములు | 24-00 |
| 17. | గణపతి సహస్రనామములు | 24-00 |
| 18. | సుబ్రహ్మణ్య సహస్రనామములు | 24-00 |
| 19. | గాయత్రి సహస్రనామములు | 24-00 |
| 20. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రాలు | 24-00 |
| 21. | శ్రీరామా సహస్రనామములు | 24-00 |
| 22. | సరస్వతి సహస్రనామములు | 24-00 |
| 23. | సూర్యసహస్రనామములు & ఆదిత్యహృదయం | 24-00 |
| 24. | శ్రీవేంకటేశ్వరసహస్రనామములు | 24-00 |
| 25. | మణిద్వీపవర్ణన (పెద్దది) | 24-00 |
| 26. | సంధ్యావందనం | 24-00 |
| 27. | మంత్రపుష్పమ్ | .... |
| 28. | త్రిభాషా హనుమాన్‌చాలీసా | 15-00 |
| 29. | హనుమాన్ చాలీసా | 10-00 |

| | | |
|---|---|---|
| 30. | మణిద్వీపవర్ణన (పాకెట్) | 10-00 |
| 31. | ఆరు చాలీసాలు | 10-00 |
| 32. | శివారాధన (శివస్తోత్రాలు) | 10-00 |
| 33. | వేంకటేశ్వర సుప్రభాతం (పాకెట్) | 10-00 |
| 34. | ఆరుదండకాలు | 5-00 |
| 35. | వేంకటేశ్వర గోవిందనామములు | 5-00 |
| 36. | అష్టలక్ష్మీ స్తోత్రమ్ కనకధారాస్తోత్రమ్ | 10-00 |
| 37. | దేవీఖడ్గమాలాస్తోత్రమ్ (మహిషాసురమర్దనీస్తోత్రంతో) | 10-00 |
| 38. | సుందరకాండ (పాకెట్) | 10-00 |
| 39. | భగవద్గీత మూలం | 27-00 |
| 40. | రామరక్షాస్తోత్రమ్ | 15-00 |
| 41. | స్తోత్ర రత్నావళి | 36-00 |
| 42. | పురాణపండ లలితా-విష్ణు సహస్రనామస్తోత్రమ్(మినీ) | 10-00 |
| 43. | పురాణపండ లలితాసహస్రనామస్తోత్రమ్(మినీ) | 10-00 |
| 44. | పురాణపండ విష్ణు సహస్రనామస్తోత్రమ్ | 10-00 |
| 45. | పురాణపండ ఆదిత్య హృదయం | 10-00 |
| 46. | మంత్రపుష్పం (మినీ) | 10-00 |
| 47. | శివానందలహరి-సౌందర్యలహరి | 36-00 |
| 48. | కుజదోషం | 10-00 |
| 49. | కాలసర్ప దోషం | 10-00 |
| 50. | మీ అప్పులు తీరాలా? | 10-00 |
| 51. | దృష్టిదోషాలు నివారణ | 10-00 |
| 52. | పంచసూక్తములు | 10-00 |
| 53. | సంధ్యావందనం | 10-00 |
| 54. | రుద్రనమకమ్-చమకమ్ | 10-00 |
| 55. | గాయత్రీమంత్రాలు | 10-00 |
| 56. | హయగ్రీవ స్తోత్రమాల | 10-00 |
| 57. | దక్షిణామూర్తి స్తోత్రమాల | 10-00 |
| 58. | ద్వాదశ జ్యోతిర్లింగాలు - పంచారామాలతో | 10-00 |
| 59. | శ్రీసూక్తం పురుష సూక్తం | 10-00 |
| 60. | నవగ్రహస్తోత్రమాల | 36-00 |
| 61. | మహాన్యాసమ్ | 36-00 |
| 62. | సుందరకాండ గానామృతం | 36-00 |
| 63. | గోమాతపూజావిధానము | 10-00 |
| 64. | ఆనందసిద్ధి - 1 శ్రీదేవీ స్తోత్రమాల | 108-00 |

| | | |
|---|---|---|
| 65. | ఆనందసిద్ధి - 2 ఏ సమస్యకు ఏ స్తోత్రమ్ పారాయణచేయాలి | 108-00 |
| 66. | ఆనందసిద్ధి-3 మానసదేవీ స్తోత్రమాల | 108-00 |
| 67. | శ్రీ కాలభైరవ రక్షా కవచమ్ | 63-00 |
| 68. | అర్చన | 40-00 |
| 69. | నిత్యదేవతార్చన | 40-00 |
| 70. | సర్వదేవతా స్తోత్ర నిధి | 99-00 |
| 71. | శ్రీచక్ర నవవరణార్చన | 63-00 |
| 72. | చండీ సప్తశతి పారాయణ క్రమం | 99-00 |
| 73. | శ్రీదేవి స్తోత్ర రత్నావళి 32 దేవి స్తోత్రాలకు తాత్పర్యంతో | 99-00 |
| 74. | వనదుర్గా మంత్రానుష్ఠాన క్రమమ్ | 63-00 |
| 75. | శ్రీ కాలభైరవ వ్రతము | 63-00 |

## 3. శ్రీ సాయి దత్త గ్రంథములు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ సాయిబాబా సచ్ఛరిత్ర | 120-00 |
| 2. | సంపూర్ణ శ్రీ గురు చరిత్ర | 120-00 |
| 3. | శ్రీ సాయిఆరాధన-షిర్డివైభవం | 120-00 |
| 4. | శ్రీ సాయిబాబా జీవిత చరిత్ర (క్రౌన్) | 63-00 |
| 5. | శ్రీ గురుచరిత్ర (క్రౌన్) | 63-00 |
| 6. | నవనాధ చరిత్ర | 99-00 |
| 7. | శ్రీసాయిచరిత్ర (భైండు) ప్రయాణపుపారాయణగ్రంథం | 63-00 |
| 8. | శ్రీగురుచరిత్ర (భైండు) ప్రయాణపుపారాయణగ్రంథం | 63-00 |
| 9. | సత్యదత్తవ్రతం దత్తాత్రేయపూజాకల్పం,సహస్రంతో | 30-00 |
| 10. | అనఘాదేవీ వ్రతం | 30-00 |
| 11. | భక్తుల ప్రశ్నలకు బాబా జవాబులు | 30-00 |
| 12. | శ్రీ సాయిపూజాకల్పం (సహస్రంతో) | 25-00 |
| 13. | శ్రీ సాయిభజనమాల | 20-00 |
| 14. | శ్రీ సాయి భజన్స్ | 20-00 |
| 15. | శ్రీ సాయిభక్తి గీతాలు | 20-00 |
| 16. | శిరిడిహారతులు (భావంతో) | 20-00 |
| 17. | "శ్రీసాయి"కోటి | 27-00 |
| 18. | "శ్రీసాయిరామ్"కోటి | 20-00 |
| 19. | శ్రీ సాయినాథ స్తోత్రమంజరి | 10-00 |
| 20. | శ్రీ సాయివేయినామాలు | 8-00 |
| 21. | శ్రీ సాయి హారతులు (పాకెట్) | 15-00 |
| 22. | శ్రీ సాయి స్తవనమంజరి | 10-00 |
| 23. | హిందీ శ్రీ సాయి హారతులు | 15-00 |

